# పీఠిక.

మొదటినుండియు భాషాసేవ చేయు నభిలాష నాకు మెండు. మన వాఙ్మయమున విమర్శనభాగము తక్కువగ నుండుటచే నాకొఱంత తీర్చుటకై సారస్వతపరిశోధనము గావించి నా నేర్చుకొలఁది విమర్శనముల వ్రాయుచుండెడివాఁడను. ఇటీవల నేత్రములు జబ్బుగనుండుటచే గ్రంథపరిశోధనమునకును విమర్శనరచనమునకును నవకాశము చిక్కక స్వతంత్ర గ్రంథరచనమునకై పూనుకొనవలసినవాఁడ నైతిని. మనలో సాంఘికస్థితిగతులఁ జిత్రించు రూపకములు తక్కువగ నున్నవి. కాన వాని వ్యక్తీకరించు రూపకము వ్రాయఁ దలఁచితిని. మన సంఘమును బీల్చి పిప్పిచేయుచున్న దుర్వ్యసనములలో నగ్రగణ్యమైనది వేశ్యాటనము. ఈ వేశ్యాసాంగత్యమునందలి నష్టములను సువ్యక్తముచేయ నెంచి విలాసికయను నీ రూపకవిశేషమును విరచించితిని. ఇదివఱకు నపండితులగువారి వేశ్యాలోలతం గూర్చి ముచ్చటించు నాటకములు కొన్ని కలవుగాని పండితుల గణికాలోలుపత్వమును నిరూపించు రూపకములు లేవు. కావున విద్వాంసుల వేశ్యాప్రియత్వమును వర్ణింప దీని వ్రాసితిని. ఇది విబుధలోకమున కెట్లు రుచించునో చూడవలసి యున్నది.

గీతములు పాడవలసివచ్చినప్పుడు నటులసౌకర్యార్థమై వాని యెన్నిక వారికే విడిచి వేసితిని.

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి.



# ఇందువచ్చు పాత్రములు.



## పురుషులు.



శృంగారశేఖరుఁడు—కథానాయకుఁడు.

రసికశేఖరుఁడు—ఉపనాయకుఁడు. శృంగారశేఖరుని శిష్యుఁడు.

పిగ్గు (వరాహనరసింహం)—ఉపనాయకుఁడు. పాశ్చాత్యవేషధారియగు నవనాగరకుఁడు.

వసంతకుఁడు—నర్మసచివుఁడు.

హాగ్గు—అరక్షకకోటాధ్యక్షుఁడగు నొక పాశ్చాత్యుఁడు.

మునిస్వామినాయుఁడు—ఒకవిటుఁడు.

మార్దంగికుఁడు<br>"సర్దార్" } గానసభలో వచ్చువారు

కవి—శృంగారశేఖరుని మిత్రుఁడు.

కలికాలమహర్షి—శృంగారశేఖరుని సహకారి.

పిండివోలు మహారాజు—కలికాలమహర్షి శిష్యుఁడు.

కృష్ణారావు<br>నారాయణరావు<br>గోపాలరావు } మంగతాయి యింటి పెండ్లి పెద్దలు.

వైద్యాచార్యులు—వైద్యశాలాధికారి.

రంగారావు—ఒక విటుఁడు.

సభావాగ్వాహారులు ఇద్దఱు.

ఇద్దఱు వీధి నూడ్చువాండ్రు.

డప్పుకొట్టువాఁడు.

విద్యార్థులు.

సంఘసంస్కారప్రియులు.

సభ్యులు.

ఉపపానశాలవాండ్రు.

ఉపపానము చేయువాండ్రు.

తాపీపనివాఁడు.

కావటివాఁడు.

మంగలిరంగఁడు.

"సోడా" బుడ్డి ఒంపువాఁడు.

దాక్షిణాత్యుఁడు—(పెండ్లికొడుకు)

## స్త్రీలు.

మంగతాయి—కథానాయిక.

చకోరాక్షి<br>సరసీరుహాక్షి } మంగతాయి చెలికత్తెలు.

వేశ్యమాత—మంగతాయి తల్లి.

ఫుల్లఅనుఫల్లజముఖి—ఒక వేశ్య. (పెండ్లికూఁతురు)

సభ్యురాండ్రు.

కుల మనముల మరల్పుటకై ధీరోదాత్తతాద్యుత్తమగుణములు లేని యిప్పటి విద్యాంసుల చర్యలు లోకమునకుఁ జూపు నవసరము తటస్థించినది, ఇట్టి నాయకులు గలది విలాసిక మగును గాని యుత్తమనాటకము గానేరదు. కాన నియ్యది వ్రాయుటకును బ్రదర్శించుటకును నవసరము కలిగినది.

నటి—నేను లోనికిఁ జని మంగతాయి మనము ప్రదర్శింపవలెననియు, నందులకు సంసిద్ధు లగుఁడనియు మన సామాజికులకుఁ దెల్పుదునా ?

సూత్ర—(తెరలోనికిఁ జూచి) మన ప్రసంగము నంతను వినియున్న సామాజికులప్పుడే యీ రూపకమును నాడుటకుఁ దగిన వేషములను ధరించుకొనుచున్నారు. వారు సిద్ధమగులోపల సభ్యుల కింపు గూర్పుటకై నీ మనోహరకోకిలస్వరములో నిప్పుడు లోకములోని మోద్రులంగూడఁ జిగిరింపఁ జేసియున్న యీ వసంతముం గూర్చి నాతో గానము చేసి సభ్యుల హృదయములలో సానంద మిగురొత్తునట్లు చేయుము.

నటి—అట్లే యగుఁగాక! (అని యిద్దఱును గలిసి పాడుచున్నారు.)

ద్విపద. చల్లఁగ నేతెంచి ♦ సమయవిటుండు
తెల్లఁగ గిలిగింత ♦ పెట్టిన కతఁ
మొల్ల నవ్వఁగఁ బలు ♦ మొగ్గ లేర్పడఁగఁ
జల్లని గొజ్జంగి ♦ జలముల నాడి
యుల్లస ముప్పొంగ ♦ నొయ్యారముగను
ఫుల్లపద్మిని యను ♦ భోగినిఁ గూడి
వల్లరీ శయ్యపై ♦ వసియించి యద్ది
వెల్లడి యగునను ♦ భీతిచే సిగ్గు
మల్లడి గొనుచుండ ♦ మలయానిలుండు
మెల్లమెల్లని గతి ♦ మెలఁగుచు నుండ
హల్లక సభయందు ♦ నళిగాన మెలమి
సల్లలితంబుగ ♦ సాగించుచుండఁ
బల్లవరసమద్య ♦ పాయియై పికము
మొల్లంబు గాఁగను ♦ మొనసి కూయంగ
నల్ల భాస్కరదీప్తి ♦ యను ప్రాభగణిక
యుల్లన నాట్యంబు ♦ హాయిగా సలిపి

రొల్లసరముల సా ♦ రింతలో లాగ
నిల్లిదె మాధవుం ♦ డింపుఁ గూర్చెడును.

సూత్రి—ఇంకను నీవు ప్రత్యేకముగ నొకింత పాడుము.

నటి—చిత్తము. (ఇట్లు పాడుచున్నది.)

కం. పల్లవ పరిశోభిత మై, యెల్లెడ నవశక్తి నలరుఁ ♦ గొమ్మలు పూపన్
జెల్లుబ్బ రసికశేఖరు, లుల్లసిఁ బొందఁగ వసంత ♦ కాగమ మొప్పన్. 9

సూత్రి—లెస్సఁగఁ బాడితివి. నీ పాట కావ్యార్థసూచనముఁ గూడఁ జేయుచున్నది. “వసంతకాగమ మొప్పన్” అని నీవనఁగనే చూడుమో! రూపకములోని వసంత నాయక విరూపకుఁడు రంగస్థలమునఁ బురరాజవీధిం బ్రవేశించి యున్నాడు. మన మింక నిట నిలువఁజనదు. పోవుదము. రమ్ము. (ఇద్దఱు నిష్క్రమించుచున్నారు)

ఇది ప్రస్తావన.



ఇవి నిత్యకర్మములు. కామ్యములు నైమిత్తికములు ననంతములు. ప్రాచీనులు తెలుపు నిత్యకర్మము లాచరింపకుండినఁ బ్రత్యవాయ మిహమున లేదు. నవీనులు తెలుపు నీ నిత్యకర్మము లన్నియో యథాకాలముగ నాచరింపకుండిన నిప్పటనే వెంటనే హాని వాటిల్లును. కాలమునకుఁ గడుపులోఁ గాఁ పడకున్నఁ దలనొప్పి వచ్చును. కాలుసేతులు లాగును. మతి చెడిపోవును. దేహ మంతయు దుర్బలమగును. ఈ దుర్ఘట నిత్యకర్మముల నన్నిఁటిని నెట్లు సరిగ నడుపుకొనఁ గలుగుదును? సంస్కృతములో వేళ్లు పెట్టితిని. ఆంగ్లమునఁ గాలు పెట్టితిని. ఆంధ్రమునఁ గేలు పెట్టితిని. కాని, బాల్యమున శ్రద్ధలేమి నేనియుఁ బట్టుపడినవి కావు. తెలివి యెంతయైనఁ గలదు. ఏకసంథగ్రాహిని. అయిన నేమి ప్రయోజనము? చిన్ననాఁటినుండియు సోమరితనము మెండు. అందుచేఁ జదువు గుండ సున్నయైనది. ఇంక దవ్వెక్కడ నుండి వచ్చును? ఏ సేవకవృత్తికైనఁ బ్రవేశింతు మన్న స్వతంత్రేచ్ఛ యాత్మాధికమై దానిని సాగనిచ్చినది కాదు. నోటి దురుసు హెచ్చు. ఎచ్చటికిఁ బోయినను సున్నపుఁ గోపతి యెదురును. ఇట్టి నే నెట్లు సంసారసాగరము నీఁదఁగలను. (ఒక నవ్వు నవ్వి) దైవకృపచే నీ విదూషకత్వ మొకటి నాకు లభించినది. ఈ వేషముతో స్వేచ్ఛగఁ దిరుగవచ్చును. మాట్లాడవచ్చును. నన్నెవ్వరుఁ గోపింపరు. నా వంటివాని కిది సర్వవిధములఁ దగిన యుద్యోగము. (ఆలోచనతో) శృంగారశేఖరులు, రసికశేఖరులు, వేశ్యావాటికలు బాగుగ నున్నంతకాలము హాయిగఁ గాలము గడచుటకు నన కష్యాంతరము లేదు. అయ్యో! ఆలస్యము చేయుచున్నాను. శృంగారశేఖరునితో సంలాపప్రవేశము చేయకున్న నాకు కాఫీయుపాహార మెట్లు లభించును? స్నానముఁ గావించి వెలుపటికిఁ బోవలయును. (అని ముందునకు చూచి) అదిగో, కాఫీసాల. అల్లదిగో! కిల్లీదుకాణము. నానావర్ణములవారు నానా జాతులవారు కాఫీపుచ్చుకొనుచున్నారు. కావటివాఁడు మంగలి రంగఁడు, తమ బరువుల నచటనుంచి కాఫీ పుచ్చుకొనుచున్నారు. కాఫీ పనివాఁడొకఁడు కోరపాగాచుట్టి తాపీ చేతఁబూని "చిన్ని చిన్ని పూలదండ చేర్చి నా మెడనిండ అపనా తనా మనా మారోరి బైరనా" అని పాడుకొనుచు వచ్చి కాఫీ పుచ్చుకొనవచ్చుచున్నాఁడు. ఒకఁడు పాత్రములు మార్చి కాఫీ యొక్కింత చల్లార్చి త్రాగ నిచ్చుచున్నాఁడు. ఒకఁడు పదార్థముల నట్టియొకఁ దప్పించి యాకులలోఁ బెట్టి వచ్చువారి కిచ్చుచున్నారు. అటకుఁ బోవుదునుగాక. (ప్రస్థానము సూచించును.)



## రెండవ రంగము.

[యథానిర్దిష్టముగ నుపపానశాలాది ప్రదర్శనము]

వసం—(ప్రవేశించి ఉపపానశాలకడకుఁ జని) కటకటా! ఈ కాఫీసాలలో నెంగిలి హేయము ననునవి లేవుగదా!

ఆ. వె. వేశ్య కావిమోవి ♦ వెలయిచ్చు వారెల్ల
పంటఁ బట్టి పీల్చు ♦ భంగిగాను
యేక పాత్రమునను ♦ యెంగిలినాకరే
కాఫీ త్రాగుమందు ♦ కలసి జనులు. 12

ఇది శ్వేతద్వీపవాసులగు విబుధులద్వారముగా వచ్చిన యపరామృత మగుటచే దీని కెంగిలి లేదు కాఁబోలు. ఆహా! దీనిని బుచ్చుకొననివారే కాన్పింపరు. ఎంతలో దేశమునందంతటను నీ యపూర్వసదాచారము వ్యాపించినది!

ఉపపానము చేయువారు—దీనికిఁ గారణ మేమై యుండును!

వసం—ఒకటి కావలెను.

గీ. యజ్ఞయాగంబులందుఁ ద్రాగఁ ♦ నడఁగియుంట
సోమవల్లిక లభియించి ♦ సోముఁ గూర్చి
కాఫీ రూపంబు తుదకును ♦ గాంచెఁబోలుఁ
గాన సర్వజనులు దీని ♦ గారవింత్రు. 13

ఈకాలమున సోమలత గాన్పింపకుండుటచే నా యూహ సరియైనదే యని మీరును నంగీకరించెదరని తలఁచెదను.

ఉపపా—అట్లే కావచ్చును. కాని, మిత్రమా! నీ వేషము వింతను బుట్టించుచున్నది. నానాజాతివేషసాంకర్య మిందుఁ బొడకట్టుచున్నది. హిందువుల తలగుడ్డ, మహమ్మదీయుల టోపి, యైరోపియనుల హాటు, నీ శిరోవేష్టనమైనవి. చొక్కా చేతులలో నొక్కటి చీనావారి పద్ధతి నున్నది. మఱియొక్కటి యాంగ్లేయుల పద్ధతి నున్నది. అధఃకాయాచ్ఛాదనము మహమ్మదీయుల మాదిరి నున్నది. ఇన్ని భేదము లుండుటకుఁ గారణ మేమి?

వసం—మిత్రులారా! నా వేష రహస్యముం దెలిపెద వినుండు. ఇప్పుడు లోకము నాకర్షించుచున్నది సార్వలౌకిక సౌభ్రాత్రము. లోకాభివృద్ధిఁ గోరువారెల్లరు నీ సార్వలౌకిక సౌభ్రాత్రము నభివృద్ధిలోనికిఁ దీసికొనిరావలెను. ఇదియే మొదటి పని. ఈ సార్వలౌకిక సౌభ్రాత్రమును లోకమునకు బోధించుటకై పలువురు పలు

మార్గములఁ దొరకుచున్నారు. ఒక్కరు తమ మందిరముల నిర్మించుటలో సర్వ జాతుల మందిరముల పొందికను దీసికొనుచున్నారు. కొందఱీ సార్వలౌకిక సౌభ్రాత్రమును బోధించుటకై సర్వజాతుల వంటకముల ననుభవించుచున్నారు. నేను వేషములో దీనిని లోకమునకుఁ జూపుచున్నాను. సార్వలౌకిక సౌభ్రాత్ర బోధకై నే నీవేషమును వేసినాను. ప్రకృతి వైభవప్రధానమగు నిక్కాలమున సాంకర్యమే శోభించును గాని, మఱొండు శోభింపదని యోజించుకొనుఁడు.

ఉపపా—మేలు ! నీయూహ చాల గంభీరమైనది.

వసం—మీ రట్లు తలఁచుటచే ధన్యుఁడనైతిని. ఇప్పటికి శృంగారశేఖరుఁడుగారు దయచేసి, కాఫీ పానము చేసి వేంచేసినారా ?

ఉపపా—నేఁడు వారింకను రాలేదు. కాని మిత్రమా ! శృంగారశేఖరుఁడుగారి వర్ణనాదికము పూర్తిగఁ జెడినట్లు వినవచ్చుచున్నది. అది సత్యమా ?

వసం—(తనలో) అహా ! ఇట్టి తావుల నెట్టి రహస్యములైన నిట్టె బట్టబయలగును గదా ! (పైకి) ఆ!-స-త్య-మే-య-న-వ-చ్చు-ను.

ఉపపా—ఎంత గంభీరుఁ డెట్లు బయల్పడిపోవుచున్నాఁడు. ఈతని వంశ మెంతటిదనుకొనినారు. వీ రింటిపేరివారిలోఁ బూర్వము సంస్థానాధిపతులుఁ గూడ నుండెడివారు. వీరిపూర్వులును సంస్థానములలోఁ జేరి మంచిస్థితి గలిగి వెలింగిరి. కాన వీరు సంస్థానాధిపతులవంటివారే. ఇట్టివా రింతలోఁ జెడుట యెట్లు కలిగినది ?

వసం—అది వేశ్యాలోలతవలని ఫలము.

గీ. పణ్యభామినిచేఁ బడ్డ • పుణ్యశాలి, పుడమి గాంభీర్య హీనుఁడై • చెడకయున్నె
జలజలత యంటినంతన •• సరసు లోగిని, నమిత గాంభీర్యహీనత • నందినట్లు. 14

ఉపపా—ఏమి ! నీతివాచస్పతి యని పేరు పెట్టుకొనిన శృంగారశేఖరుఁడుగారు తుదకు ముండలమిండఁడై యశస్సునంతను బాడుచేసికొనెనా ?

వసం—ఆఁ—తుద కట్లే యాయెను.

ఉపపా—ఆమె యెవతె ? అది యెట్లు తెలిసినది ?

వసం—(మెల్లగ) ఒకతెయా ? పల్వురయిరి. అగుచున్నారు. ప్రస్తుతమున మన నీతివాచస్పతిగారి యశోధనహరణ మొనరించుచున్నది మంగతాయి. బహుకాలము వీరి తగులాటము రహస్యముగానే సాగిపోయినది. కాని, తుదకీ మదిపిటుఁడు మోహాతిశయపరవశుఁడై యామెను గూర్చుండఁ బెట్టుకొని ప్రతిబింబపటమును దీయించుకొనియె. తద్ద్వారముగా రహస్య మంతయు బయల్పడినది.

ఉపపా—మన నీతిబోధకు లిప్పుడు తాయి నుంచుకొనిరా ?

వసం—వా రుంచుకొనువారు కారు. అచట నతినుధర్మము సాగించు నాచార్యులై యిష్టార్థసిద్ధి నందుచుందురు.

ఉపహా—వేశ్యలనామములు డాబు గలిగియుండును గదా. మంగ కీ వింత పే రెట్లు వచ్చినది ?

వసం—దానికి పెద్దకారణము కలదు. ఈమె బాల్యమునుండియు మంచిరూపము, తెలివితేటలు కలది యగుటచే తల్లి కధిక ప్రేమాస్పదురాలుగ నుండెడిది. ఇట్లుండ దైవయోగముచే స్వస్థత పోయి రూపు చెడి బ్రతుకుటనను నాశయే లేకుండు దురవస్థ చిన్ననాట కలుగ యీమె బ్రదికి బాగుపడి జట్టు కట్టినచో, నీ భార్యపేరు పెట్టెద ననియు, నీకు ముడుపులు చెల్లింతు ననియు వేంకటనాయకునకుఁ దల్లి మ్రొక్కుకొన్న వెంటనే యాతని కటాక్షముచే నామె బాగుపడినది. కాన నామెకు మంగ యను పేరు తల్లిచేఁ బెట్టఁబడినదఁట.

ఉపహా—అట్లాగునన్నా ! బాగుగ నేయున్న ! . (తమలోతాము) నేఁడు సినీమా, సర్కసు, నాటకము చాల బాగుగ నుండునఁట, పోయి చూడవలెను.

(అనుకొనుచు వెళ్ళిపోవుచున్నారు.)

వసం—(ముందుకుఁ జూచి) వారుగో ! శృంగారశేఖరులవారు వీధిని వచ్చుచున్నారు. నేను బోయి యాతనిఁ గలిసికొనియెదను. (అని నడచుచు) ఇతని మందగమనంబు గన డెందమున నేదో యాలోచన మున్నట్లు తోఁచుచున్నది. తోఁచుచున్న దన నేల ? మనస్సు కార్యాలోచన మందు నిమగ్నమైపోవఁ బైవారు విందురేమో యన్న నాలోచనము లేక తన యూహలఁ బైకి వెల్లడి చేయుచున్నాఁడు. ఏమి పలుకుచున్నాఁడో విని యాపై నతనితో ముచ్చటింతును గాక !

(వసంతకుఁడు ముందునకు రాఁగ)

శృంగా—(ప్రవేశించి తనలోఁ బైకి వినఁబడునట్లు) ఆహా ! లోకచర్యం గన నద్భుత మగుచున్నది. పైనుండి యీ లోకపాలన మొనర్చుచున్న ప్రభుండగు నాజగన్నాటక సూత్రధారుఁడు మాయ యను నటిఁగూడి యీ లోకరంగమున జీవులచేఁ జిత్రవిచిత్రములగు నాటకము లాడించుచున్నాఁడు. ఈ నాటకము లనంత భేదములు కలవి. ఏ పాత్రమున కే వేషము రుచించునో యా పాత్రమున కా వేషము నీయక యా మహాసూత్రధారుఁడు తన యిచ్ఛవచ్చినరీతిగాఁ బలవంతపెట్టి జీవులచే వేషముల వేయించుచుండును. కావున నీ లోకరంగమునఁ గొంత రసాభాసము గూడఁ దటస్థించుచున్నది. అట్లు కాదా ? అవును. నే ననినది నిజమే.

వసం—ఈతఁడు పెడత్రోవఁ బడుచున్నాఁడు, నేను మార్గమునఁ బెట్టెదను. (అని శృంగారశేఖరుని సమీపించి) మిత్రమా! నీ పలుకులు సత్యములు కావు. జీవులు వేయు వివిధవేషములకు నా జీవులే కారణము గాని దేవుఁడు కాఁడు.

శృంగా—(వసంతకుని వైపు చూచి) నా యనుంగుమిత్రుఁడగు వసంతకుఁడా! నీకు నా పల్కులు వినఁబడినవా? నీ రాక రాకవలె నా నేత్రచకోరములను విందుం గూర్చుచున్నది. వయస్య! మం దుపపానములు చేసి యెదుట నున్న మా ప్రియకారిణీపాఠశాలాభవనమునఁ గూర్చుండి వలయు ప్రసంగము కావించుకొందము. నేఁడు సెలవుదినము కావునఁ బాఠశాలలో నెవ్వరు నుండరు.

వసం—అట్లే చేయుదము. రమ్ము. (అని పోయి పానము చేసి విడియము వేసికొని ఆపణస్థులు వస్తులు వ్రాసికొనుచుండఁగ యీవలకు వత్తురు.)

(తెర పడును.)

వసం—మిత్రమా! నేఁడు సెలవుదినమగుటచే మీ పాఠశాలాభవనము మూసివేయఁబడి యుండునేమో?

శృంగా—మూసివేయఁబడి యుండలేదు. నే నచటినుండియే యిటకు వచ్చినాను. నేఁటి మధ్యాహ్నమొక సభ యచట జరుపఁబడును. తత్సన్నాహమునకై పాఠశాలాభవనము తెరువఁబడియే యున్నది. ఇదిగో సమీపించినాము. లోపలికిఁ బోవుదము రమ్ము.

[తెర యెత్తఁబడును.]



## మూఁడవ రంగము.



పాఠశాలాభవనప్రదర్శనము.

[ఉభయులును భవనములోఁ బ్రవేశించి కుర్చీలలోఁ గూర్చుండురు.]

శృంగా—మిత్రమా! ఇఁక మన ప్రసంగములోనికిఁ బోవుదము. ఏమి? నేఁ జెప్పినది సత్యము కాదందువా? నీవు లోకచర్యం గని పలుకలేదు. నా యుదాహరణము నే తీసికొందము. నే నాదినుండియు నీతియందత్యాదరము గలవాఁడను. నీతివాచస్పతులగు పురాణవిద్యాగురువుల బోధామృతక్షాళితబుద్ధివైభవము గలవాఁడను. సంఘసంస్కారప్రియుఁడను. కవివరుండను. ఇట్టి నేను ముండలమార్గమై గండు మిగిలియున్నానను సంగతి లోకమునకుఁ దెలియకున్నను నీకు విశదము. దీనికిఁ గారణ మేమందువు?

వసం—నీ వేశ్యాప్రియత్వమునకు నీవే కారణము గావా ? నీతివిశారదుఁడ నని చెప్పు
కొను నీ కీ యదృష్ట మెట్లు పట్టినది ?
శృంగా—ఎట్లు పట్టినదో చెప్పెదను, సావధానముగ వినుము.
వసం—అవహితుఁడనై యున్నాను.
శృంగా—దైవవశమున బాల్యమునందే దుర్వ్యసనములు గల బాలకుఁ డొకఁడు తోడివయ
స్సువాఁడు చెలికాఁ డైనాఁడు. అతని కాటపాటలయందుఁ గల శ్రద్ధ విద్యాబు
ద్ధులలో లేదు. అట్టి వాని సహవాసము బాల్యమునందే లభించుటచే వాని మూల
ముగా నాకును జీట్లాటయందుఁ గొంత యభిరుచి కలిగినది. చినికి చినికి గాలివాన
యైనదన్న ట్లా చీట్లాట డబ్బు పెట్టి యాడు జూదముక్రింద మాఱినది. మొదటఁ
జింతగింజలతోనే ప్రారంభించితిమి గాని గింజలు గవ్వలై, గవ్వలు డబ్బులై,
డబ్బులు పెద్దలై దినదినాభివృద్ధి నందినవి.
వసం—అంతవఱకు వచ్చినదా ? అవును. జూదముయొక్క గమనిక యట్టిదే.
శృంగా—అంతటితోఁ బోలేదు. నాకుఁ జీట్లాటలో రుచి హెచ్చినతరువాత నా
యాటకు వాటమగు చోటునకే నా మిత్రుఁడు నన్నుఁ దీసికొనిపోయినాఁడు.
వసం—ఏది యాచోటు ?
శృంగా—నీ వెఱుఁగని దేమున్నది ? చీట్లాటకు వాటమగుచోటు వేశ్యవాటముకాదా ?

గీ. ఆటవెలఁదుల యిండ్లును ♦ నమ్మవారి
గుడులు గాలి గోపురములుఁ ♦ గోవెలలును
దోఁటలు పురమందిరములు ♦ పూఁటకూటి
యిండ్లు జూదంబునకుఁ దగు ♦ నిక్క మరయ. 15

వానిలో,

గీ. ఆటదేవత యనఁ దగు ♦ నాటవెలఁది
యాడుచుండును దాను ప్ర ♦ త్యక్ష మగుచుఁ
గాన బయలును జాటును ♦ గామి నాట
కాటవెలఁదుల వాటమే ♦ వాట మగును. 16

వసం—అవు నది యందులకు న్యాయస్థానమే. పైన ?
శృంగా—మా చీట్లాటయందలి రక్తి ముదిరి క్రమముగాఁ బణ్యపాటలాధరలతోడి
చీట్లాటలోనికి దింపినది. కీలికి గాలి తోడైన ట్టి దుస్సహవాసమునకుఁ బాండిత్య
ము సంపాదించుకొనువారి కనివార్యమైన శృంగారగ్రంథపఠనము తోడైనది.
అంతకు వచ్చినతరువాత నాపైనఁ జెప్పెడి దేమి ?

వసం—అంతకు వచ్చినను నీతివాచస్పతులు వారనారి వారినుండి యీవలఁ బడినవారు లేకపోలేదు.

శృంగా—అట్టి శుకతుల్యు లెవరైన నుండిన నుందురేమో. వారైనను వేశ్యవాటికిఁ బోయినతరువాత నిజముచేతఁ దప్పించుకొని రాఁగాలరు. దైవానుగ్రహముచే శుకుఁడు వేశ్యవాటికలోఁ గా చిక్కలేదు. కాని యీ భాగ్యమే పట్టిన నా శుకుఁడు లీలాశుకుఁడు గాకుండునా? పెలమెలంగుల వలలం బడి బుఱ్ఱలొంగు నంతటి యమాయకుం డేమాయెనో యెఱుంగవా? ఆ యటుండి నిమ్ము. ఈ విధముగా దుష్టసహవాసము వలన నేను వేశ్యవాటి కావాగురులం దగులుకొనిన పక్షి నైనాను. వేశ్యాసంఘసంసర్గము చేయుచు నను మిమువిూద నొక్కతె నొక్కతెనే క్రిమ క్రిమముగాఁ జూచుచున్నాను. ఇది యంతయు దైవవశము గాదా? నా తప్పేమున్నది? ఇందులకు నా బాల్యస్నేహితుఁడు నిందార్హుఁడు కాని నేను కాను. ఇట్లు బాల్యమునుండియు వేశ్యాప్రియుఁడ నైనను నా గుట్టు చెడకుండ లోకము కనుగప్పి శుకతుల్యుఁ డనుఖ్యాతి నందుచున్నాను. నీ వెఱుంగని దేమున్నది?

వసం—ఆహా!

గీ. ధారుణి స్వయంకృతాపరా ♦ ధముల బుద్ధి, హీనులు పొరలిం త్రితరుల♦నైన నెపుడు వైఁగ నిందఁగావిం(తురై ♦ వంబుఁ గూడఁ, గాని, యెన్నరు స్వకుమతి♦ కారణమని.

మిత్రమా! నీ యట్టి ఘనవిద్వాంసు లెవ్వరును నీవలె వెలయాండ్ర మోహంబునఁ దగులుకొని యపకీర్తిపాలు కా లేదు. నీ గుప్తవర్తన మెవరికిఁ దెలియ దనుకొనుచున్నావు. అది పైకేఁ బొక్కినది. విద్వద్వరేణ్యులగు నీ మిత్రులెల్లరును నిన్నుఁ బరిపరివిధములఁ బరిహాసించుచున్నారు.

శృంగా—అవును. నేనును నల్లే విన్నాను. వారు మంగతాయితోడి పరిచయము లేక పోవుటచే నట్టి యవివేకోక్తులు పల్కుచున్నారు. వా రొక్కసారి మంగతాయిం దర్శించిరా వారి మూఢత యంతయు వాతూలహతి తూలమ్మున కేగతి తెమ్మనో యాగతి నందును.

వసం—అట్లనుట ధర్మము కాదు. వా రెల్లరు దిట్టలు. వా రట్లు లొంగిపోవువారు కారు.

శృంగా—నీ వాలోచింపకయె మాటలాడుచున్నావు. నీ వొకింత సాహాయ్యమిడిన వారి నందఱను మంగతాయి యింట నాట్యమాడించెదను. చూడుము.

వసం—(తనలో) ఇతఁడు చెడుటయే గాక స్వరక్షణార్థమని తోడివారిం గూడఁ జెఱుపఁ దలంచుచున్నాఁడు. ఇది పాపకృత్యమే కాని, యీ ద్వారముగా

వీనితో నేదో యొక పని కల్పించుకొనక యుండిన నాకు డబ్బు చేపడు. కావున వీనికిఁ దోడయ్యెదను. (పైకి) మిత్రమా! నే నేమి చేయవలెను?

శృంగా—చెలికాఁడా! నన్ను వేశ్యాలంపటుఁడని పరిహసించుచున్న వారిలో నగ్రగణ్యుఁడు నా శిష్యుఁడే యగు రసికశేఖరుఁడని వినియున్నాను. వానిని మంగతాయి యింటికి బంటుం జేయవలెను. అతఁడు నీకును మిత్రుఁడే కాన నిందులో నీ సాహాయ్య మత్యవసరము.

వసం—అది యెటులు సాధ్యమగును? ఆతఁడు పామరుఁడు కాఁడు. నాగరకుఁడు. విశేషించి హూణవిద్యావిద్వాంసుఁడు. ద్విగుణీకృతకళానాథుఁడు. అంతకుఁ బైఁగా సంఘసంస్కార ప్రియుఁడు. 'ఆన్ టి నాచ్ పార్టి' లోఁ జేరినవాఁడుగా నున్నాఁడు. పైఁగా సంస్థానాధిపతి. కలికాలఋషుల బోధలు తల కెక్కియున్నవి.

శృంగా—వాని సంఘసంస్కారప్రియత్వము మనకే యనుకూలించును. నేను మాత్రము వేశ్యానిషేధకసంఘములోనివాఁడను గానా? ఎందుఁ జేరినను నలుని యందుఁ గలి యొక స్వల్పావకాశము నాధారముగాఁ దీసికొని కలి యాతనియందుఁ బ్రవేశించి నట్లే మన రసికశేఖరునందు వేశ్యాప్రియత్వముఁ బ్రవేశపెట్టుట కొక చిన్న యవకాశము గలదు.

వసం—అది యేది?

శృంగా—వాని గానకళాప్రియత్వమే. దాని నాధారము చేసికొని మనము మంగతాయి యింటి కాతని లాగవచ్చును. ఆమె గానకళాకుశల యని నీ వెఱుఁగుదువు కదా. రసికశేఖరుఁడు గానమనినఁ జెవి కోసికొనును. ఈ నడుమ శ్రవణానందకరమగు గానము వినఁబడమిఁ బిచ్చివానివలెఁ దిరుగుచున్నాఁడు. వాని నెట్లయినఁ బట్టి తెచ్చితివా సంగీతమిషపై వానిని మంగతాయి యింటికిఁ దీసికొనిపోవచ్చును.

వసం—నీ యూహ బాగుగనే యున్నది. వానికి గానకళాప్రియత్వము మితిమీఱి యున్న దనుమాట సత్యము. లలితకళాభివృద్ధి గావలెనని యాతఁడు సమయాసమయములు విచారింపక సదా యుపన్యాసములు గొట్టుచుండును. నేను పోయి యాతని నిప్పుడే యిటకుఁ దీసికొని వచ్చెదను. (దృష్టి నిగుడించి చూచి) మిత్రమా! నీవు సిద్ధసంకల్పుఁడవు. అతఁడుగో! రసికశేఖరుఁడు 'ఆర్ యల్ అండ్ సన్స్' (R. L. & Sons) షాపులో నుండి యిటే వచ్చుచున్నాఁడు. ఆతనిఁ గలిసికొని మాట్లాడుదము.

శృంగా—అవును. అడఁబోయిన తీర్థ మెదురైనది. (తనలో) కటకటా! నామంగల విద్యాబుద్ధుల మంటఁగలిపి తుదకు తార్పుడుగుల్ల నగుచుంటిని గదా! (ఆలోచించి) అవును. అయిన నేమి? స్వకార్యార్థమై యిందాద్రిదు లంతటివారే యమాయికులగు ఋషివర్యుల తపోవిఘ్న మొనరించుటకై వేశ్యలం దార్చుపనిలో నిమగ్నులైనప్పుడు నా యట్టివారు గర్వాంధు లగువారి గర్వభంగ మొనర్చుటకై యిట్టిపని నొనర్చుట గౌరవలోప మెంతమాత్రమును గాదు.

గీ. నిర్మలం బైన యింద్రియ ♦ నిగ్రహంబు
సాధుశీలంబుఁ గల బ్రహ్మ ♦ చారుల ఘన
తపము చెఱుపంగ ముండలఁ ♦ దార్చు పనుల
విబుధనాథుండు మెలఁగుట ♦ విశదమె కద. 18

(పైకి, మెల్లగ) మిత్రమా, వీనిని బుట్టలో వేసెదము. చూడుము.

వసం—చూతును గాక!

శృంగా—రసికశేఖరుఁడు సమీపమునకు వచ్చుచున్నాఁడు. మనము పోయి యాతనిఁ గలిసికొందము రమ్ము. (ఉభయులు ముందుకు వచ్చుచున్నారు)

(వీధి తెర పడును.)

[రసికశేఖరుని ప్రవేశము.]

రసిక—(చేతులు మోడ్చి) ఇదిగో! బహుకాలమునకు మీ దర్శన మైనది. మీరు క్షేమముగా నున్నారా?

శృంగా—శిష్యా! దైవకృపచే మేము క్షేమముగనే యున్నాము. నీవుఁ గుశలమా?

రసిక—(తనలో) ఈతఁడు గురువే యైనను ముండలమిండఁడై నాఁడని విన నా యొడలు మండుచున్నది. ఈతనితో నీ విషయమై గట్టిగ మాట్లాడవలెను. (పైకి) గురువర్యులారా! మీతోఁ గొంత ముచ్చటింపవలసి యున్నది. ఎచ్చట ముచ్చటించుకొందము?

శృంగా—ఏమి? మన మిచ్చట మాట్లాడుకొనఁ గూడదా?

రసిక—ఇచ్చట నడువీధిలో ముచ్చటించుకొనఁ దగినది కాదు. కొంత రహస్యముగఁ బ్రసంగించుకొనవలయును.

శృంగా—అదిగో! మన పార్థివమందిరము. దాని ముంగిటఁ జేరి మన మెంతసేపే విషయమై మాట్లాడుకొనినను నట్లు చేయవచ్చును. ఆ యావరణములోని కెవ్వరును రారు.

రసిక—అట్లు చేయుదము రండు.

వసంత — నేను సెలవు తీసికొనెదను.

రసిక — అదేమి మిత్రమా ?

వసంత — మీ రేవో రహస్యవిషయములం గూర్చి ముచ్చటించుకొందురు గదా !

రసిక — నీకుఁ దెలియని రహస్యము కాదు. నే నుడువఁదలంచినది నడువీథిలో నుడువఁ దగినది కాదు. కాన రహస్యస్థలమునకుఁ బోవుప మంత్రని. మనము మువ్వురముఁ బోయి యీ ప్రార్థనమందిరప్రాంగణమున నిలిచి ముచ్చటించుకొందము. రండు.

## నాలుగవ రంగము.

ప్రదేశము: ప్రార్థనమందిరపు ముంగిలి.

రసిక — (కోపావేశముతో) గురువర్యులారా ! వందనములు. (అని చేతులు జోడించి) నీతివాచస్పతులై లోకమునకు నీతిపాఠముఁ జెప్పు నాచార్యవర్యులగు మీరే తుదకు తుచ్ఛ వేశ్యాలంపటత్వములోఁ దగుల్కొనుట ధర్మమా ?

శృంగా — (తనలో) ఆహా ! ఇతఁ డెంత దుందుడుకుఁదనము గలిగి యున్నాఁడు. అయిన నితఁడు ప్రథమకోపి. క్రమముగాఁ గోపము తగ్గి సౌమ్యతలోఁ బడును. (ఆశ్చర్యముతోఁ బైకి) రసికశేఖరా ! అట్లనుచుంటి వేమి ? నీ నోట రాఁగూడని మాటలు వచ్చుచున్నవే ! నేను తుచ్ఛవేశ్యాలంపటత్వ మొందితి నని నీ కెవ్వరు చెప్పిరి ? నీ వది యెట్లు నమ్మితివి ?

వసం — (ఆత్మగతముగా) ముంజేతి కంకణమున కద్దమేల ? (పైకి) నీ శిష్యుఁడు నీతి యం దపరిమితాదరము గలవాఁడగుటచే గోపోద్రిక్తుఁడై పలికినాఁడు.

రసిక — (చేతులు జోడించి) గురువర్యులారా ! ధర్మవిషయములో గురువుతో నైనను గ్రుద్దులాడవచ్చు నని మీరు సెలవిచ్చియున్నారు. కాన నే నింత తీవ్రముగా ముచ్చటించుచున్నాను. ఎక్కడ నేయక్రమము కనఁబడినను నాది సహించి యూరకుండెడి స్వభావము కాదు. అందులో నీతివిషయమున బొత్తుగ సహింపఁజాలను. మీరు మంగతాయి యను వేశ్యయింటికిఁ జనుట లేదా ?

శృంగా — రసికశేఖరా ! నీవు భ్రమాక్రాంతచిత్తుఁడవై సత్యమును గనుఁగొనఁజాలక యట్లు పలికితివి. నేను మంగతాయి యను వేశ్యయింటికిఁ దఱచుగఁ బోవుచున్న మాట సత్యము. కాని, యామె మోహములోఁ బడి పోవుట లేదు. ఆ విద్వాఁసురాలికిఁ దగు బోధము చేసి తద్ద్వారముగా వేశ్యాలోకములో నీతిని వ్యాపింపఁజేయుటకై పోవుచున్నాను.

రసిక—కలికాలమహాశాస్త్రి గారును యీరీతినే సెలవిచ్చుచున్నారంటి. ఈ సమాధానము నా కంత తృప్తికరముగాఁ గాన్పించుట లేదు.

శృంగా—మర్త్యులఁ బరు నవనిల సుధగందుచుఁ నయును దప్పా? అదియుంగాక మంగతాయి సామాన్యవేశ్య కాదు. ఆమెను వేశ్యయనుటయే ధర్మము కాదు.

రసిక—ఏమి, యామె వేశ్యాకులజాతిదే కాదా?

వసం—కాదు. ఆ మాటను నే నొక్కి చెప్పఁగలను. వంశపరంపరగా వచ్చు జాతి యెక్కడ? వేశ్య యెక్కడ?

గీ. బయటి పుర్వులఁ దాఁ దెచ్చి ♦ భ్రమర మట్టె
గూటిలోఁ బెట్టి నిజకుల ♦ కీటములుగ
మార్చునట్టుల పరుల కు ♦ మారికలను
బడపుఁబడఁతులఁ గావింతురు ♦ పణ్యసతులు. 19

శృంగా—రసికశేఖరా! నా పలికినదానిని యథార్థముగాఁ గ్రహించుట న్యాయమా? ఆమె వేశ్య కాదనిన వేశ్యాకులసంభూతయే కాదని నా తలంపు గాదు. ఆమె యా కులమందుఁ దప్పి పుట్టినది. కులముచే వేశ్యయైనను గుణముచే నట్టిది కాదు. సౌశీల్యాదిగుణముల కామె ఖని యని చెప్పవచ్చును.

రసిక—ఆహా! ఏమి యీ వింత! పరవంచనమే స్వభావముగాఁ గల వేశ్యలందు సౌశీల్యాదిగుణములు గూడ నుండునా?

ఉ. పిల్లికి శీలముం బులికిఁ ♦ బేశలశాంతగుణానురక్తి వె
ల్లుల్లికిఁ జారుసౌరభము ♦ నుత్తమభావము నీచజాతికిం
గల్లన కాత్మశాంతి నిడఁ ♦ గన్గెడిలక్షణ ముండు నేర్పునే
కల్ల నయంబుఁ జూపు గణి ♦ కామణికా గుణ ముండు పూజ్యుఁడా? 20

శృంగా—వేశ్యాకులమందుఁ దప్పి పుట్టినదని చెప్పియుంటిని గదా.

గీ. దైత్యులందటి వలె బలిఁ ♦ దలఁపఁ దగునె
హీనఫణులను బలె శేషుఁ ♦ నెన్న నగునె
అసురతతి యందునను బలి ♦ యార్యుఁ డాయె
నగములందున శేషాహి ♦ యోగ్యుఁ డాయె. 21

గీ. భీకరాంబుధి రత్నముల్ ♦ వెలసినట్లు
బురదలోపలఁ బద్మముల్ ♦ పుట్టినట్లుఁ
గలుగుచుందురు దుర్మార్గ ♦ కులములందు
యోగ్యు లగువార లరుదుగా ♦ నుర్వియందు. 22

కులమును బట్టియే గుణనిరూపణము చేయరాదు.

వసం—అవునది సత్యమే. యోగ్యకులమం దయోగ్యులును నయోగ్యకులమందు యోగ్యులును గూడఁ బుట్టుచుందురు.

చ. అమృతముఁ జందురుఁడుఁ గ్ సిరి, సు ♦ రాశ్వము నెచ్చటఁ బుట్టె నట్టి సం
దరియునసె పుట్టెఁ గాదె ? యతి ♦ దారుణమైన విషంబు మిత్రమా !
కుమతులు పంక్తికంఠుఁడును ♦ గూరతరాత్ముఁడు కుంభకర్ణుఁడున్
సముదయమైన యింట నుత ♦ జన్మముఁ గాంచఁడె వారి తమ్ముఁడున్ ? 23

రసిక—మీ మాటలు పాటింపఁ దగినవి కావు.

శృంగా—రసికశేఖరా ! అట్లంటివేమి ? మాకు యుక్తాయుక్తవివేకము లేదందువా?

రసిక—(కోపముతో) దుష్కృత్య మధ్యస్తమైన నా యభ్యాస మెంత వివేకినైన దోషాదోషపరిజ్ఞానశూన్యునిఁ జేయును గాన నీ విషయమున మీ బుద్ధి సరిగ నూహించుట లేదు. కావున నిప్పట్టున మీ మాటలు పాటింపఁదగినవి కావు.

గీ. వెలకు మానంబు విలిచెడి ♦ వెలఁదియంటు
వినుత సౌశీల్య యుక్త యై ♦ వెలయునంట
కట ! కలవె యిట్టి వింత లే ♦ కడలనైన
వాదమేల దీనికిని వి ♦ ద్వాంసులార! 24

శృంగా—శిష్యవర్యా ! ఈ విషయములో మా బుద్ధి సరిగ నూహించుట లేదని నీకెట్లు తెలిసినది ? మాకు దురభ్యాసమున్నట్లు నీవెట్లు గ్రహించితివి ? నా చెప్పిన జవ్వని యయోగ్యత రూఢిపడినప్పుడు గదా నీ వన్నది సత్యమగును. నీ వని యెఱుంగుదువా ? సత్యము తెలిసికొనఁ దలఁచిన యెడల నీ వొకసారి మామె గృహంబునకు వచ్చి తత్త్వముఁ దెలిసికొనుము.

వసం—తత్త్వము తెలియకయే తత్త్వాలు పాడినట్లు ఏదో పట్టి మృషావాదము చేసిననేమి లాభము ? యథార్థము తెలిసికొని యాపై నడువవలెను.

రసిక—ఇది యొకటి గూడనా ? తాఁ జెడ్డ కోఁతి వనమెల్లఁ జెఱచిన దనునట్లు మీరు చెడుచుండుటయే గాక నన్నుఁగూడ జెఱుప నెంచుచున్నారా ? కుక్కతోఁకకుఁ గౌటిల్య మెట్లు సహజమో వేశ్యలకు దుర్వృత్తు లట్లు సహజము. దానికి ఋజువు వేరె యక్కఱలేదు. కాన నే నచట్టికి రాఁ బనిలేదు.

శృంగా—నీవు చెప్పినది సాధారణధర్మమైన మాట నిజము. అయినను బ్రతి సామాన్య విధికిని విశేషవిధి యుండు ననుట లోకవిదితమే.

వసం—రసికశేఖరా! నే నొక పెద్ద ఋజువు నిచ్చెదను. మంగతాయి యోగ్యతను దెలిసికొనుము. అది యేదియన నాపె నన్ను బహువిధముల ధనధాన్యములిచ్చి కాపాడుచున్నది. ఎంత మంచిదియుఁ గాకున్న నట్లు చేయునా?

రసిక—అట్లయిన నీ సాక్ష్యము విలువ కలదియే.

శృంగా—శిష్యవర్యా! ఇంత యేల. వేశ్యాసాంగత్యమునందుఁ గొంతహాని కలదనియే తలంచుకొందము. అంటిన మంటగలుపు దారుణశక్తి గలది యగు నగ్నిశిఖను సదా వర్జించుచున్నామా? కడు జాగరూకులమై సర్వదా దాని సంపర్కము నందుచునే యున్నాము. అగ్నిశిఖవంటిదే వేశ్య. దానిని జాగరూకతతో వాడుకొనిన బహువిధముల నిష్టార్థసిద్ధి గలుగును. కావున, మంగతాయి యింటికి వచ్చి, దాని స్థితిగతుల నరసి, యాపై నీ యభిప్రాయము నొసంగుము. జాగరూకుఁడవయియే యుండుము.

వసం—వేశ్యాగృహములోఁ గాలుపెట్టుటకే యింత జంకనేల? ఇంత భీతిని వహించుట పురుషలక్షణము గాదు. నాల్గు మూలలుఁ జూచినవాఁ డెవఁడో వాఁడే పురుషుఁడు. ఒకవేళ నచటికిఁ బోయిన దోసఁగు పొసఁగు జాడలు కాన్పించినచోఁ దత్క్షణమే మానుకొనవచ్చును గాదా?

రసిక—అడుసు త్రొక్కనేల? కాలు కడుగనేల?

శృంగా—ప్రియశిష్యా! నీ వట్లు పలుకకుము. రెండు కారణములచే నిన్నక్కడకు రమ్మనుచుంటిని.

రసిక—అవియేవి?

శృంగా—నేను వేశ్యామోహపంకములోఁ దగులుకొంటి నని గదా నీవు తలంచుచున్నావు!

రసిక—ముమ్మాటికిని నట్లు తలంచుచున్నాను.

శృంగా—నేను నీ కాప్తుఁడనే కదా!

రసిక—అవును. మీరు నా కాప్తులగు గురువరులు.

శృంగా— గీ. అడుసులోనఁ బడిన పర ♦ మాప్తుఁ బైకిఁ
దీయకుండఁగ నెట్టులఁ ♦ దీరునయ్య
అడుసులోఁ గాలుపెట్టమిం ♦ చనెడు నెడల
నుద్ధరించుట యెట్లు మ ♦ మ్మోయి శిష్య? 25

వసం—అడుసులోఁ జిక్కిన మిత్రుల లేవఁదీయక పైనుండి పకపకలాడుట మిత్రధర్మము కాదు.

గీ. తమ మనెడు పంకమున రాత్రిఁ ♦ దగిలియుండు
జీవరాసులఁ గరముల ♦ లేవదీయు
బుద్ధితోఁ బూర్వపంకిలాం ♦ బోధినుండి
మిత్రుఁ డుదయించు నెప్పుడు ♦ మిత్రవర్య ! **26**

రసిక—గురువర్యా, మి మ్ముద్ధరించుటకు నే నెంతవాఁడను.

శృంగా—అట్లనకుము. మేధావులగు శిష్యులు గురువుల లోపములను దిద్ది వారి నుద్ధరింపవలసిన సమయములును దటస్థమగుచుండును. మేధావి యను విప్రబాలుఁడు తన గురుఁడగు జనకుని నుద్ధరించిన సంగతి భారతమునందలి పితాపుత్రసంవాదము వలన మనము వినమే ? అదిగాక నేను నా గురువుల దోషముల దిద్దు వ్యాపారము నందే నిమగ్నుఁడనై యున్న వాఁడను. అట్టి నేను మేధావంతుఁడవును నా ప్రియ శిష్యుఁడవును నగు నీ వలన దిద్దఁబడుటకు సర్వవిధముల సిద్ధపడక పోను. ముందు నాయందు దోష మున్నదియు లేనిదియును నిర్ధారణము చేసికొనుము. మూఢలో కాపవాదమును నమ్మకుము. నీవు తాయి యింటికి స్వయముగ వచ్చి చూచిన సత్యము బోధపడ గలదు. సత్యము తెలిసికొని నాయందు లోపములఁ జూపిన నట్లైన నీ హితోపదేశమును నేను విని తీరుదును. తాయిని దిద్దుము. వేశ్యాకులము నుద్ధరింపుము. నా యీ పావనకార్యమున నీవు నాకుఁ దోడైన నా కది యశస్కరము కాదా ?

రసిక—గురువర్యా, మీరు చెప్పఁగలఁచిన దంతయుఁ జెప్పుఁడు. రెండవ కారణ మేది?

శృంగా—నీవు రసికశేఖరుఁడవు గదా ! నీ పేరు సార్థకము చేసికొనవలయు ననిన నా రసికురాలి రసికత్వము రుచిచూచుట యవసరము.

వసం—అత్యవసరము. వేశ్యాసాంగత్యము లేనివాఁడు రసికుఁ డెట్లు కాఁగలఁడు ?

రసిక—ఓహో ! రసికత్వమున నిదియా ?

వసం— గీ. కొసరి చెంపకాయ యెవనిఁ ♦ గొట్టు వేశ్య
యతఁడె రసికుఁడని సరసు ♦ లండ్రు భువిని
ఎవఁడు వేశ్యాగృహమునందె ♦ యీల్గు వాని
రసికశేఖరుఁ డందురు ♦ ప్రాజ్ఞులెల్ల. **27**

రసిక—మాయామోహవాగురలఁ బన్ని యువకమృగంబుల వలలందుఁ దగుల్కొనఁ జేసి మానప్రాణముల హరించు వేశ్యాకిరాతీపాళులా, రసమున కునికిపట్టులు ? రసము నునది మిక్కిలి పవిత్రమైనది. పరాత్పరుఁడు రసస్వరూపుఁడు. "రసో వైసః" అని

వేదము ఘోషింపుచున్నది. అది నొక్కమిచ్చి చిక్కించుకొనఁ దలఁచినఁ జిక్కునది కాదు.

క. వేశ్యాసంగంబెప్పు డ, వశ్యంబుగ మతిని జెఱచి ♦ వ్యర్థునిఁ జేయుఁగా
వశ్యమె మతిహీనులకును, శాశ్యపి సదౖసవిశేష ♦ గరిమ ? వయస్యా ! 28

శృంగా — శిష్యవర్యా, నేను వేశ్యాసంగప్రశంస చేయుటలేదు. వారలందుఁ గల లలిత కళావిశేషములం గూర్చి యుచ్చరింపఁబోవుచున్నాను. నీవు గానరసలోలుఁడవు. వారు గానకళాధురీణలు. కాన లలితకళాగౌరవార్థమై, తదనుభవార్థమైయును నీయట్టి యుత్తమరసికు లవశ్య మా వేశ్యాగృహములకు రాఁ దగినవై యున్నది. మంగతాయి లోకప్రసిద్ధి నందిన గాయనీమణి. ఈ కారణముచేఁ గూడ నీ వొక్కసారి యామె గృహము పావనము చేయఁదగును.

రసిక — (తనలో) ఆమె గానకళాకుశల యని నేనును వినియున్నాను. అయినను నీ విషయమై యింకను దెలిసికొనవలెను. (పైకి) ఏమీ ! మంగతాయి యంత గానకళాకుశలయా ?

శృంగా — సందేహమేమి ? ఈ తాయి బహు రాజాధిరాజుల మెప్పించి బహుమతుల నవలీలగాఁ బొందియున్నది.

సీ. వీణియఁ జేకొని ♦ వెలఁది వాయించుచో, నారదతుంబురుల్ ♦ నాసఁగాంతు
కలగళమెత్తి కో ♦ కిలవలె లలిఁ బాడఁ, గిన్నరీబృందంపుఁ ♦ గీర్తి చెడును
మురళి చేఁ గీలించి ♦ తరళాక్షి యూఁదుచో, గోపాలకృష్ణుని ♦ గొడు తగ్గు
మద్దెలఁ జేఁ బట్టి ♦ ముద్దియ వాయింప, వాణీశుగర్వంబు ♦ వమ్ముఁగును
గీ. యవనవాద్యము వాయింప ♦ యవనగాయ
కాళి యవనతాననతను ♦ నందు మందు
శిశు, పశూరగములు వేడ్కఁ ♦ జెవుల నొగ్గ
హాయిమీఱంగ నల మంగ ♦ తాయి పాడ. 29

వసం —

సీ. హార్మోనియముఁ బట్టి ♦ హాయిగా వాయించు, జలతరంగిణియందుఁ ♦ జాల జాణ
గోటువాద్యమునందుఁ ♦ బాటవం బదిహెచ్చు, ఫిడేలు సారంగి లోఁ ♦ దెలివిమెండు
రుద్రవీణ పయి కు ♦ రుచిరంపుఁబని సేయు, స్వరబతు వాయించు ♦ సరసముగను
కిన్నరిఁ బలికించు ♦ నెన్నికమీఱంగ, సాంప్రు ఫిడేలాలఁ ♦ జూపు మిగుల
గీ. ఘటము వాయించుశక్తియు ♦ గణ్య మరయ
ననుపమ లయాధిదేవత ♦ యనఁగ వచ్చుఁ

గానే నీ గాణ సరి జాణఁ ♦ గాన, గాన
కళను నీయఁగాన జగాన ♦ గానలోల. 30

రసిక—అతిశయోక్తికి మన భారతవర్ష మాలవాలము. కావున గానకళావ్యక్తీకరణమునకు నెన్ని యుపకరణములు గలవో యన్నిట మంగతాయి జాణ యని చెప్పితిరి. అది సంభవము కాఁగలదా ?

శృంగా—ఏల కాఁగూడదు ? కొన్ని వ్యక్తుల శక్తి యతిమానముగ నుండును. ఆ నిరుపమానశక్తిని వర్ణించుటలో స్వభావోక్తి కూడ లోఁతెలుఁగనివారికి నతిశయోక్తిగాఁ గాన్పించును. పసిబాలుఁడగు నాచార్యునోహారబర్వి బహువిధ గానవాద్యములందు నేర్పరియైయున్న సంగతి యెఱుఁగమా ? వానిని బ్రత్యక్షముగాఁ జూచితిమి గాన వాని కౌశల్యమునందు నమ్మకము పుట్టుచున్నది. ఆమె సంగీతసాహిత్యములకై తన జీవితము నంతయు ధారవోయుచున్నది. గానకళాకుశలత్వము సంపాదించుటయే ప్రధానముగాఁ జేసికొనినది. తల్లి పటుల వంచించి ధనము లంకించుకొనుమని యెంత చెప్పినను, బోధించినను విననొల్లదు. గానవిద్యాసాధన సర్వదా చేయుచుండును.

సీ. శ్రీరాగ సాధన ♦ చేయుమా యనఁ దల్లి, శ్రీరాగసాధన ♦ చేయుఁ బడఁతి
భూపాల రాగంబు ♦ పొసఁగింపు మన నమ్మ, భూపాలరాగంబు ♦ మొనసి పాడు
దివ్యమణ్యాప్తికై ♦ దివురుమా యన మాత, దివ్యమణీరాగ ♦ మెత్తుఁ బూను
ధేనుకాప్రాప్తికై ♦ పూనుమా యన నంబ, ధేనుకారాగంబుఁ ♦ దెల్విఁబాడు

గీ. అతివ ! యేరూపకంబున ♦ నలరుతు విటు, గాయకావళినని యాయి ♦ కడకు పలుక
నింతి రూపకతాళమం ♦ దేపు మాపుఁ, గాను మింతయు మదిలోనఁ ♦ గలుగనీదు.

వసం—అంతయును గానము !

గీ. ఆమె హృదయంబునను లేదు ♦ కాను మింత, వేనియందును గాగడ ♦ వెట్టిచూడ
పరగ లక్ష్మీసనాథు స ♦ పర్య చేసి, పడయ సర్వార్థసిద్ధిని ♦ పడఁతి కోరు. 32

శృంగా—ఆమె లలితకళాసక్తయై యుండుటయే గాదు. రక్తిప్రధానముగు లలితకళలందే కాక ముక్తిప్రధానముగు భక్తిమార్గమునందును నామెకు నాసక్తి మెండు. భక్తియందు రక్తి, రక్తియందు భక్తి గల విమలచరిత. సదా నియమములందు నిష్ఠలందుఁ బూజలందు నిషణ్ణయై యుండును. భగవదారాధనపరాయణ.

సీ. కాంచనాంబరుఁ గాని ♦ గానంబు సేయదు, శ్రీనాథునకె గాని ♦ సేవ లిడదు
భూతిభాసితుఁగాని ♦ భూషింప నొల్లదు, రజితాద్రివరుఁగాని ♦ రహిఁ బొగడదు.

భగ్నగర్భుని గాని ♦ భాషింప నొల్లను, శ్రీపతిసుతు గాని ♦ చేరఁబోదు
భగవంతునే గాని ♦ ప్రార్థింపనొల్లను, భూచక్రపతి గాని ♦ పొందఁబోదు
గీ. ముక్తిమార్గంబునందె ♦ రక్తి మాన్పు, పలువురఁ బార్థివప్రాజులు ♦ సంతతంబు
నామె సాంగత్య మబ్బిన ♦ యంతలోనఁ, బాసి సంసారసాగర ♦ బాధ తొలఁగు.

వసం — గీ. పొలఁతి నడకలు హంసహం ♦ సలనుబోలు
కలికి పలుకులు శుకాలాప ♦ ఘనతఁ గాంచు
గరితహృదయంబు నానంద ♦ గిరిని మించుఁ
జెప్పనేటికి ! కామిని ♦ చేష్ట లింక. 34

రసిక — ఆర్యులారా, ద్వ్యర్థిగా మాట్లాడుచున్నట్లున్నారే ? మీ పలుకులందు సూది తో దారము వలె రెండవ యర్థముఁ గూడ వచ్చుచున్నది. ఏది నిజము?

వసం — ఎన్ని యర్థములైన నామె ధరింపఁ గలదు.

శృంగా — రసికశేఖరా! అనుమానముచే డోలాయమానమానసుండ వైనకతన నీకుఁ దేట మాటలందు ద్వ్యర్థి గాన్పించుచున్నది.

రసిక — ఉద్దేశింపకున్న ద్వ్యర్థి పట్టునా ?

శృంగా — పట్టును. కవు లుద్దేశింపని శ్లేషల వ్యాఖ్యాత లెన్ని తమ నేర్పుచేఁ బుట్టించుచున్నారు కారు ? నేను ధాగాశయుఁనే మాట్లాడుచున్నాను. ఆమె నిక్కముగ గానకళాకుశల. సర్వశాస్త్రాభిజ్ఞురాలు. ఆమాట నటుండనిమ్ము. కళకొఱకుఁ గళయని భావించి యామె లలితకళానైపుణిం గనుటకైన నీ వచటికి రాఁదగినది. ఆమె చేష్టలజోలి నీకేల ? అవి చెడ్డవేయనుకొనినను,

గీ. కంటకములున్నను గులాబి ♦ కడకుఁ బోయి
చారు పుష్పంబుఁ జేకొను ♦ సరణిగానె
కుటిలవేశ్యలు గల వేశ్య ♦ కూటములకు
సరససంగీతలోలతఁ ♦ జనఁగవచ్చు. 35

వసం — ఎచట నున్నను గళను గ్రహింపవలసినదే.

రసిక — ఎచట నున్నను గళను గ్రహింపవలసినదే కాని, యీ ముఱికికొంపలకు నన్ను రమ్మనెదరా ?

శృంగా — ఏమి ? యామె మందిరము ముఱికికొంపయా ? అనుభవము లేకపోవుటచేఁ బిచ్చిమాటలాడుచున్నావు. ఆమె సుందరమందిరముఁ బోలు మందిరమ్ము బృందారకపురంబునఁగూడ లేదు. దానిని వర్ణింప నలువకైన నలవి గాదు.

గీ. ఆమ్మె సౌధంబు సన్మార్గ ♦ మడ్డగించు
నున్నతస్థితిఁ; గల్మిచే ♦ నొప్పు మిగిలి
దేవమందిరానీకంబు ♦ ధిక్కరించు;
గదులు సుమసఃప్రబంధసం ♦ కలితములగు. 36

మఱియును,

సీ. వరసురాలయమని ♦ పాజ్ఞులు భావింతు, రచటి వైభవముల ♦ నరసిరేని
ధర్మాలయంబని ♦ తత్త్వజ్ఞు లూహింతు, రచ్చటి సుఖరీతి ♦ నరసిరేని
హరినివాసంబని ♦ యార్యాళి తలఁతును, నచటి వారి గతుల ♦ నరసెనేని
నాగవాసంబని ♦ నయవిదులెన్నుదు, రచటి భోగమహిమ ♦ నరసిరేని
గీ. స్వస్థతను గూర్చు విద్యా ప్ర ♦ చార మచట
వలలు చుండును గన్నుల ♦ పండు వగుచు
నచటఁ జేరిన వారల ♦ కందఱకును
స్వర్గసుఖమెన్న నతి సమీ ♦ పంబు గాదె ? 37

ఆ వైభవముఁ గన్నులారఁ జూచితీరవలెఁ గాని వినఁదీరదు. నీ వనుభవము లేని మాటలు పలికిన నే నేమి చెప్పఁగలను ?

రసిక—నాకు వేశ్యాగృహముల పరిచయము లేనిమాట సత్యము. ఒకవేళ నవి సుందర మందిరములే కావచ్చును. అయినను నపాయకరములగు తావులకుఁ బోవుట యుపాయము గాదు.

గీ. కుటిలభోగవక్రగమన ♦ గూఢపాద
భీకరభుజంగ శేఖర ♦ వ్యాకులంబు
సకలరోగద కామినీ ♦ సంకులంబు
నఘ విదుష్టకులంబు వే ♦ శ్యాకులంబు. 38

మంగతాయి పాట వినఁదగినదే గాని యామె మందిరమునకు మనము చనుట కంటె నామెను మన యిండ్లకు రప్పింపఁజనదా ?

శృంగా—ధీరుఁడా! మనము త్యజింపవలసినది వేశ్యయా, వేశ్యాగృహమా? వేశ్య వాటికలో మనము చేరరా దనుటకుఁ గారణము దుష్టయగు వేశ్య యందుండుటను గదా! మనదేహము పోయి నిప్పును సోఁకినను నిప్పు వచ్చి మన దేహమును సోఁకినను రెండును సమానార్థములే. వేశ్యయింటికిఁ జన నభ్యంతర మున్నపుడు వేశ్య నింటికి రప్పించుకొనుటకును నభ్యంతర ముండవలసినదే. అది య ట్లుండనిమ్ము. వేశ్యాగృహమునకే మనము పోయిన, నేవాద్యగానము కలయు ననిన నది మనము

వినవచ్చును. వేశ్యాగృహ మెట్లుండునో గనవచ్చును. వారికి, నీతిబోధ గావింప వచ్చును. ఎందఱు పెద్దలు నీతిబోధ చేయుటకయి వేశ్యాగృహములకుఁ బోవు చున్న వారు కారు? వా రెల్లరును జెడుచున్నారా? నీయట్టి దిట్ట కేల యీ లేని పోని భయము? అదియుఁగాక గానసభకుఁ గావలసిన సామగ్రి యంతయు నచట సంసిద్ధముగా నున్నది. కావున మన మచట్టికిఁబోవుటయే యుచితము.

వసం—భయము వలదు. గానము వినుటకుమాత్రమే పోవుదము రమ్ము. వేశ్య నింటికి రప్పించుకొనిన బహువిధరసాభాసములు సంఘటిల్లవచ్చును.

రసిక—(తనలో) శృంగారశేఖరులు గానకళానిపుణులు. నా పూజ్య గురుపాదులు. కాన వీరిమాటల నా మనసు నమ్మి యీ గాయనీగానవిశేష మారయ నిచ్చను బ్రేరేపించు చున్నది. (పైకి) అచట్టికిఁ బోయిన నా చిత్తలంజలు నన్ను మోహసముద్రమునందుఁ బడవేయుదు రను జంకేకోశమునందును లేదు. వేశ్యలకు జంకను గాని యపవాద ములకు జంకెదను. అచట్టికిఁ జనినయెడల నాజాడ తెలిసి మన సంఘసంస్కార ప్రియు లేమందురో? ఏమందురో యన నేల? పరిహసింపక మానరు.

వసం—ధర్మశూరులు మూఢాపవాదమునకు జంకవచ్చునా?

రసిక—(తలపైకెత్తి కొంత యాలోచించి) ఏవిధమునఁ జూచినను నే నటకుఁబోవు టయే ధర్మము. లలిత కళాకుశల యన నాయొడ లుబ్బుచున్నది. అట్టి విద్వాంసు రాలు పడపుఁబడఁతి యగుట శోచనీయము. ఆమె నడతను బాగుచేసికొనుటకై నేనును దగు బోధచేసి యామెను సత్ప్రవర్తనము గలదానిగఁ జేయుట నాప్రథమ కర్తవ్యము. ఆ పాటలగంధి పాట విని యామెకు నీతిపాఠము చెప్పి బాగుచేయుదును గాక! (ప్రకాశముగా) ఆర్యవర్యా, యామె గానకళాకుశల యని నే నిదివఱకు వినియే యున్నాను. మీరు చెప్పినది దానిని రూఢిచేసినది. నాకు గానమునందుఁ బిచ్చిమోహము కలదని మీ రెఱిఁగియే యున్నారు. అదిగాక, మీరు తాయి యోగ్యురా లనియు, భక్తురా లనియుఁ గూడఁ జెప్పుచున్నారు. కాన నే నచ్చటికి వచ్చి, యామె గానము నాలించి, నీతులు బోధించి, పడపుఁదనమునుండి యామెను దప్పింపఁదలఁచుకొనినాను. ఆలంజెమోహములో నేను బడిపోవుదునని జంకుచున్నా నని మీ రెన్నఁడును దలఁపఁబోకుఁడు. నా మనఃపంజర మంత దుర్బలమైనది కాదు.

వసం—నీ మనఃపంజర మయోమయ మనుసంగతి మాకుఁ దెలియదా? కాననే యటకు రమ్మనుచున్నాము.

రసిక—సరియే. ఎప్పు డచట్టికిఁ బోవుదము?

వసం—శుభస్య శీఘ్రమ్మనినాఁడు. ఇదియే మంచిసమయము.

రసిక—ఇట్టి పగటిపూఁటనే పోవుదమా? అది యనుమానమున కాస్పదము కాదా?

వసం—అట్లు కాదు. మనము దుర్వృత్తులతో నచట్టికిఁ బోవుటలేదు. పావనములైన మంచియూహలతోఁ బోవుచున్నాము. కాన నిర్భయముగను బహిరంగముగను నచట్టికిఁ బోవుటయే యుచితము. రహస్య సమయములందు రహస్యముగఁ బోయినను నెవ్వరికంటను బడకుండుట దుర్ఘటము. ఒక్కరుచూచిన నది యూరంతయు వ్యాపించును. మఱియు ననుమానమున కాస్పద మగును. కావున నిరాతంకముగ నిప్పుడే పోవుదము. ఇది యుదయసమయము గావున నిప్పుడును ప్రజ లంతగా సంచరించుచుండరు.

రసిక—సరియే. అట్లే పోవుదము. (తెరలోనికిఁ జూపి) నా గుఱ్ఱపుబండి యచ్చట నున్నది. దానిమీఁద బోవుదము రండు.

శృంగా—(తనలో) బెబ్బులి బోనుకడకు వచ్చుచున్నది. (ప్రకాశముగా) శిష్య శేఖరా! నీ వచట్టికి రాఁజేసికొనిన సిద్ధాంతము నా కానందము గలిగించుచున్నది. నీ యట్టి దిట్టఁడచట్టికిఁ బోయిన నేమో మోసము వచ్చునని తలంచుట తగదు. కాన నిశ్శంకముగఁ బోవుదము. ఆపెసౌధ మావలివీధి నున్నది. మీ బండిమీఁదనే పోవుదము రమ్ము. (రహస్యముగా వసంతకునితో) వసంతకా! నేను సంఘసంస్కారప్రియుఁడగు నీ నవనాగరకుని మంగతాయి యింట్టికి రప్పించి యితనిచే మెప్పింప నెంచి నవనాగరకులు మెచ్చు నలంకారములతో మందిర మంతయును నలంకరింపించితిని. దైవభక్తురాలై నట్లు నటింపవలయు నని మంగతాయితోఁ జెప్పితిని. ఇదంతయు మనము చేయించినట్లు కాన్పింపకుండుటకై కొంత పూర్వాచారపరాయణత్వము చూపు మంటిని. ఆపె యట్లు చేయునుగదా!

వసం—(జనాంతికముగా) అందుకు సందేహ మేమి? మంగతాయి సమయజ్ఞతగల వివేకవతి. నీ శిష్యురాలు. నీ చెప్పినచొప్పున నటించును.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

[తెరలో]

ఇదె వేశ్యవాటిక సమీపించినాము. బండి నాపుము. రసికశేఖరా! తాయి భవనము సమీపించినాము. బండి యీ చెట్టుక్రింద నాపి మనము వేశ్యావాట్టికిఁ బోవుదము రమ్ము.

రసిక—గురువర్యా! అట్లె కానిండు.



## ఐదవ రంగము:— వేశ్యవాటిక.

[వసంతక శృంగారశేఖర రసికశేఖరుల ప్రవేశము.]

రసిక—(కలయఁజూచి) ఇదియా వేశ్యవాటిక ?

సీ. వీధి సెవ్వరు లేరు ♦ వేశ్యకై యాశించి, వేశ్యాగృహము ముందు ♦ వెదలు బుధులు
ముసుఁగులఁ దాలిచి ♦ వెస గణికాంగనా, భవనంబులందుండి ♦ వచ్చు ఘనులు
తమ రసికత జన ♦ తతి గన హాయమెప్ప, వెలయాలి యిల్లు క ♦ దలు సుకవులు
వలపు తీరుట కేగి ♦ కిలమూడి రుజలంటు, లంజకొంప కడఁ గ ♦ లంగు మూఖ్య

గీ. లడర నుదయంబునను వెల ♦ యాండ్రవాడ
చూడఁదగు వేడుకల జాడఁ ♦ జూపుచుండు
కన్ను గలవారలకు నెల్ల ♦ నన్ని గతుల
నాడలు నీరగుచున్న దీ ♦ కడల నిలువ. 39

శృంగా—ఇట్టి తావుల మనము బాగు చేయవలెను.

వసం—మిత్రులారా, గ్లాస్గోమల్లు పంచెలు గట్టి, బనియనులు తొడిగి, రెండువందల నెంబరు కండువాల తలకు కుచ్చుపాగాలుగ చుట్టి హాయమొప్ప పాడుచు చీఁపుళ్ళంబూని యిదె వీధియూడ్చువాండ్రిద్దఱు వచ్చుచున్నారు. కనుఁడీవినోదమును.

[వీధియూడ్చువాండ్రు ప్రవేశించి వీధి నూడ్చుచు నిట్లు పాడుదురు.]

ప్రథముఁడు—శిల్కలాగుంటాది ♦ శిన్ని బోగంలంజి
శిగురు సోకాబుడ్డి ♦ శిట్టి లంజి

ద్వితీయుఁడు—దోర శింతోట్టిరా ♦ దొడ్డ బోగంతొత్తు
శిగరెట్లు కట్టురా ♦ సిడిపి తొత్తు

ప్రథముఁడు—ఫుల్లిపాయలపుల్చ ♦ కల్లు గుమాగుమలు
దగ్గిరెత్తె వవ్వ ♦ దాని కంపు

ద్వితీయుఁడు—శేతిలో దుడ్డుంటె ♦ శేరనిత్తుందోరి
రోగమంటిస్తాది ♦ బోగియిస్తె. 40

(అని చివరపాదమువే మరల నిద్దరు పాడుచు సెగురుచు నాడుచు ఊఁహాఁహాఁ !! ఊఁహాఁహాఁ !! అని యొకఁడును తదనుగుణముగ నీలవేయుచు నొకఁడును గం తులువేయుదురు.)

వసం—ఆహా! ఇందులో నెంత మనోహరమైన కవిత్వ మున్నది!

రసిక—కవిత్వమున కేమి గాని యిట్టి మందులకుఁ గూడ వేశ్యాసంభోగము వలన నష్టము గలదని తెలియవచ్చుచున్నది.

శృంగా—కావుననే మనము పోయి వేశ్యారులమును సంస్కరింపఁ బ్రయత్నము చేయ వలెను. (అని యందఱును ముందునకు నడచి) ఇటు. ఇటు. ఇదె వచ్చినారము.

(మంగతాయి యింటి తెర చూపఁబడును.)

శృంగా—(సౌధమునుఁ జూపి) ఇదియే మంగతాయి సౌధము.

రసిక—(కలయఁజూచి) ఏమి రామణీయక మేమి రామణీయకము! ఎంత యెత్తు!

వసం—దీని యెత్తు వర్ణనీయము! ఎంత యెత్తుపై నీయెత్తు వచ్చిన దనుకొనినావు!

రసిక—తెల్లఁగ వెండికొండ వలెఁ గాన్పించుచున్నది.

వసం—ఈ మహాపట్టణమందలి—పట్టణమున నేల? యీ మండలమునందలి వెండినం తను నిదియే మ్రింగినది. ఇది వెండికొండవలెఁ దోఁచుట వింత కాదు. ఎంద ఱైశ్వ ర్యవంతులనో యియ్యది భూతిభూషితులఁ గావించుచున్నది.

రసిక—ఈ దివ్యభవనము మా గురువరులే కట్టించిన దంటరే!

వసం—ఔనది సత్యమే గాని యితరుల ద్రవ్యమును గూడ మ్రింగినది.

శృంగా—భర్తలు లేక యుండు నిర్కికామినుల సంస్కరించి బాగుచేయుటకై యీ మందిరమును గట్టించినాను.

రసిక—(పరికించి చూచి) ఈ కనకాక్షరవిలాస మేమి? (చేవెలుఁగు పెట్టుకొని చూచి) ఆనందమందిరమా? గృహనామము తగియే యున్నది కాని,

గీ. గణిక యను నూర్ణనాభి య ♦ గణ్యశక్తి, యువకనామకమశకాళి ♦ నొప్పఁబట్ట
భువికి దివికిని మోహాంపుఁ ♦ బోఁచ ల్లి, పన్ని యున్నట్టి వలవలె ♦ వఱలు నిద్ది. 41

వసం—అట్లు కాదు.

గీ. విటుఁడనెడు పట్టుపుర్వు వి ♦ వేకమెడలి, యాత్మనాశనమునకయి ♦ యాత్మనుండి
పుట్టు రమ్యతరంబైన ♦ మోహపాశ, ములను గట్టిన పట్టునాఁ ♦ బొదలు నిద్ది. 42

శృంగా—అట్లును గాదు.

గీ. సరససంగీతసాహిత్య ♦ శాస్త్రకలిత, మర్మ మెల్లను బోధింప ♦ మదనుఁ డనెడు
కులపతీంద్రుఁడు గట్టింపఁ ♦ గొమరు మిగులు, విమలతరకళాశాలనాఁ ♦ వెలయు నిద్ది.

వసం—కామకళాశాల యనుము.

రసిక—అట్లనిన నృత్యమునకుఁ గొంతసమీపమున నుండును.

వసం—అదిగో! నాట్యవిద్యాబోధ గావింపఁబడుచున్నట్లున్నది.

రసిక—ఒక్క నాట్యవిద్యాబోధయే గాదు. వివిధనాదములును గలిసి మెలసి వినవచ్చుచున్నవి. (వీణ్య ఫిడేలు, గాత్రము, మురళి మొదలగు వానినుండి వచ్చు సభ్యాసక నాదము వినఁబడును.)

శృంగా—వసంతకా ! తలుపు తీయింపుము.

వసం—ఆజ్ఞ—(సమీపమునకుఁబోయి తలుపుఁ దట్టి) ఓ చీటిక శృచకోరాక్షీ ! ఓ ముక్కులేని మోహనాంగీ ! (అని పిలుచును.)

[తెరలో] ఎవరది ?

వసం—నేనే.

[తెరలో] నే నన ?

వసం—సర్వనామము.

[తెరలో] ఆత్మనామయుం జెప్పినఁగాని తలుపు రాదు.

వసం—ఆత్మ నామరూపములు లేనిది.

శృంగా—వసంతకా ! వేళాకోళముల కేమి. త్వరగఁ దలుపుఁ దీయింపుము.

వసం—పెద్దపెద్ద రసికులు చాల రొక్కము తెచ్చియున్నారు. త్వరగఁ దలుపుఁ దీయుము.

[తెరలో]

వసంతక శృంగారశేఖరులవలె నున్నది. చకోరాక్షీ ! జాగు చేయక త్వరగఁ దలుపుఁ దీయుము.

[తెర యెత్తఁబడును.]



ఆఱవ రంగము.



[మంగతాయి సభాభవనము]

చకోరాక్షి—(శృంగారశేఖరాదులంగని వినయముతో) దయచేయుఁడు, దయచేయుఁడు.

శృంగా—రసికశేఖరా ! లోపలికిఁ బోవుదము రమ్ము.

రసిక—(నవ్వుచు) రమ్మందురా ?

వసం—సందియ మేమి, కుడికాలు ముందు పెట్టుము.

రసిక—(నవ్వుచు) న న్నీయింటి పెండ్లికొడుకుగఁ జేయఁదలఁచుకొంటివా ?

వసం—జీవదయాపరుని దయయుండిన.

రసిక—అది యెన్నటికిని సంభవము కాదని తెలిసికొనుము. నీచాతినీచమగు పడఁపుఁ బడఁతి వలలోఁ బడునంతటి యవివేకిని గాను.

[అందఱు సభాభవనమునఁ బ్రవేశింతురు.]

రసిక—(నలుదిక్కులు చూచి) ఏమి రామణీయక మేమి రామణీయకము !

వసం—రామణీయకమునకు లోటేమి ? దీనిని నానాదేశానీతవస్తు ప్రదర్శనశాల యని చెప్పవచ్చును. లోకమునందలి సుందరవస్తువుల నెల్ల నేర్చి కూర్చి విరించి తిలోత్త మను జేసినట్లుగా నీ మండలమునఁ గల సంపన్నగృహస్థుల సభాభవనముల నుండు సారమునంతిను విటవిశ్వకర్మ యేర్చి కూర్చి యీ సభానిర్మాణముం గావించెను. ఇది రమణీయముగా నుండకుండిన నిఁక రమణీయముగానుండునది యెద్ది ?

చకో—దయయుంచి యీ యాసనముల నలంకరింపుఁడు. (అని యాసనములఁ జూపును. అందఱు నాసనముల నలంకరింతురు.)

రసిక—ఆర్యవర్యా ! మన పని త్వరగఁ దేలునట్లు చేయుఁడు.

శృంగా—అట్లే. (అని చకోరాక్షివైపు చూచి) ఓసీ, మంగతాయి యేమి చేయు చున్నది ?

చకో—(తనలో) ఆమె యొక విటునితోఁ గాలక్షేపము చేయుచున్నది. అది రహ స్యముగ నుంచఁదగినది కదా ! భక్తిమార్గము తేలునట్లు గదా నేను పలుకవలెను ? ఇట్లు పలికెదను. (పైకి) ఆర్యా, దేవమందిరమున భుజంగతల్పసేవలో నున్నది.

రసిక—(తనలో) గంజాయివనమున దులసిమొక్కవలె వేశ్యాగృహంబున దేవమంది రము కూడఁ గలదా ?

శృంగా—ఆ సేవ కెంతసేపు పట్టును ?

చకో—పదిపదునైదు నిముసములలో సేవ పూర్తిచేసికొని యీవలకు వచ్చును.

వసం—తాయిది నిక్కంపుభక్తియే కాని పిచ్చిలోఁ బడుచున్నది.

శృంగా—ఆమెకుఁ దీటికరైన వెంటనే మారాక నామెకుఁ దెల్పుము.

చకో—చిత్తము. (అనిలోనికిఁ బోయివచ్చి యథాస్థానమున నిలచినది.)

రసిక—(ముందుకు చూచి) ఎవరో వచ్చుచున్నట్లున్నది.

శృంగా—(అటుచూచి) ఆవచ్చునది వేశ్యమాత.

వసం—విటులపాలిటి యమదూత.

వేశ్యమాత—(ప్రవేశించి) క్రొత్తగ విచ్చేసినవా రెవరు? (చేవెలుఁగుఁ బెట్టుకొని చూచి) వీరు శృంగారశేఖరులు. ఈతఁడు వసంతకుఁడు. వారెవరు చెప్పుమా ?

వసం—వారు గొప్పవిద్వాంసులు.

వేశ్యమా—విద్వాంసులా ? (అని పెదవి విఱచుచున్నది.)

వసం—విద్వాంసులే కాదు.

వేశ్యమా—మ రేమి ?

వసం—నీతివాచస్పతులు.

వేశ్యమా—(రోఁతతో) నీ- తి- వా- చ- స్ప- తు- లా.

వసం—విశేష విత్తవంతులుఁ గూడ.

వేశ్యమా—(తనలో) నీతివాచస్పతులగుట కేమి ? అది యుచటికి వచ్చిన వెంటనే యదృశ్యమగును. (పైకి యానందముతో) దయచేసి కూర్చుండుఁడు ! కుట్టని వచ్చుచున్నది.

రసిక—(రోఁతతో) ఎవ రీయనవసరవిగ్రహము ?

వసం—అనవసరమే కాదు. అనర్థదాయకముఁగూడ. అమృతమునకై వేచియున్న బుధులకు ముందుగాఁ బెద్దమ్మ దర్శన మిచ్చినటుల ముందుగ మాకు నీదర్శనమైనదేమి?

శృంగా—(నవ్వుచు వేశ్యమాతం గని) నీవు పోయి మీపిల్ల నిటకుఁ ద్వరగఁ బంపుము.

వసం—ఇవిగో! ఈ చుట్టలు తీసికో. (అని యిచ్చును.)

వేశ్య—దానకర్ణులు. (ఆనందముతోఁ జుట్టలు తీసికొని) చిత్తము (అని వెళ్ళుచుఁ దనలో) మా పిల్ల నన్నిచటికిఁ బోవద్దనియే పలికినది. క్రొత్త విటుఁడు వచ్చినాఁడన నాతఁడెట్టివాఁడో చూడవచ్చితిని. క్రొత్త విటుఁడు చాలడబ్బు గలవానివలె నున్నాఁడు. వానిని మా పిల్ల యెట్లు మోహపాశబద్ధునిఁ జేయునో ! నేఁ బోయి దానికి బోధలఁ గావింపవలెను. అదిగో ! పట్టుబట్ట కట్టుకొని భర్తృరాలి వేసము వేసికొని, సభలోనికిఁ బోవుటకు సమయము చూచుచుఁ జుట్టకాల్చుచు నీగదిలో నిలిచియున్నది. (అని దగ్గఱకుఁ బోయి) పిల్లా ! క్రొత్త పెండ్లికొడుకును జూచి వచ్చినాను. ఎట్లు వానిని యూయలోఁ బడవేసెదవో.

గీ. బంధుశాస్త్రాదిబోధ య ♦ న్నాబుమంగు
క్రొత్త విటుపాలి తనువులఁ ♦ గూడియుండి
విమలకామాగ్నిఁ దగ్గించి ♦ వేసి చెఱచుఁ
గాన, కామాగ్ని హెచ్చించి ♦ మేను నిలుపు
మోహరసమును జల్లవ ♦ దేహమందుఁ
జాపు సూదుల మఖమునఁ ♦ జొరఁగఁజేసి
మందు తనువెల్ల సెక్కంగఁ ♦ బొందు మీఱు
చేష్టలెల్లను వగలొప్పఁ ♦ జేసి చేసి
పైఁట సవరించు మిషమున ♦ వక్షసిరి
తేటపడునట్లు చేయుచుఁ ♦ దెల్పిమీఱ

భావగుంఫితహాస్యోక్తి ♦ పఱపి నగుచు
మేను మెల్లఁగ నిమురనా ♦ మెలఁతమిన్న. 44

ఇది యేమి బైరాగి దాని వేషము వేసినావు. వైరాగ్యమునకును శృంగారమునకును జుక్క యెదురు. మన కురూపములు, చుట్టవాసనలు మొదలగు వానిని గప్పు వేషము లుండవలెను.

గీ. చీర మిసిమిసి తళుక్కు కం ♦ చెలబెడంగు
చెక్కుల మెఱుంగు పౌడిసౌరు ♦ చీఁకటిఁదెర
స్వర్ణభూషలు నత్తరుల్ ♦ వఱలు విడెము
గణిక హేయరూపముఁ గప్పి ♦ కాంతిఁ దెచ్చు. 45

చుట్టకాల్చుగనే సభలోనికిఁ బరుగెత్తెదవు సుమా! కంపు, కంపు ; విడెము వేసుక మఱి వెళ్లు.

మంగ—(చుట్టతీసి, నోరు నొక్కుకొని) తల్లీ, పూర్వకాలపుదానవు. నిన్నచ్చటికిఁ బోవద్దన నెందుకుఁ బోయితివి ? నీ బోధలు నాకుఁ గొత్తవి కావు. పూర్వసంగతు లిప్పుడు పనికిరావు. ఇప్పటి రుచులు వేఱు. పూర్వపు మాయోపాయముల నన్నిటిని గవులు నవలలలోను, నాటకములలోను, గావ్యములలోను బట్టబయలు చేసినారు. కాన నవి యిప్పు డొప్పవు. అదియుఁ గాక దేశములో నవనాగరకత పెచ్చుపెరిగి నది. మనపైఁ గలికాలనీతిబోధకుల దాడి హెచ్చయినది. ఇప్పటి వారిని మోహాబ్ధిలో ముంచు నుపాయములు వేఱు. వినుము.

ఉ. నీతులు గుప్పిమ్మరింపవలె ♦ నేమముఁ బెంచుచుఁ బణ్యభామినీ
జాతిని దూఱఁగావలెను ♦ జారతఁ దిట్టి పతివ్రతామణీ
జాతము మెచ్చఁగావలెను ♦ జారుకకౌశలత్వమెంతయో
ఖ్యాతిగఁ జూపనౌ నవవి ♦ టాళిని లాగఁగ వేశ్య లీయెడన్ . 46

మనము పూర్వపు వేషముల మార్పవలెను, నీ కీ గొడవ యెందుకు ? లోనికిఁ బొమ్ము. నీ కీర్తికిఁ భంగముఁ దీసికొని రాను. దేవపూజ నుండి వచ్చుచున్నట్లు నటించు నేను విడెము వేసికొనుచుండిన బాగుండదు. నోరు శుభ్రముగఁ గడిగికొని, హారతికర్పూరపు పొగమ్రింగి పిమ్మట సభకుఁ బోవుదును.

వేశ్యమా—(తనలో) నేనుమాత్రము నవనాగరకత రుచి యెఱుంగనా ? (అని గొణుగుకొనుచు లోనికిఁ బోవును.)

మంగ—(లోనికిఁ బోయి వచ్చి సభకు బోవుటకు సమయముఁ జూచుచున్నది.)

శృంగా—రసికశేఖరా ! ఈ వేశ్యామందిర మెట్లున్నది ?

రసిక—చాల రమణీయముగ నున్నది. ఇట్లుండునని నే ననుకొన లేదు.

శృంగా—నీవు మృచ్ఛకటికములోని వసంతసేనామందిరముఁ గూర్చి యీ నాటకరాజమునఁ జదివియుండ లేదా ? దాని ముందర నిదియెంత ?

రసిక—ఇదియు ఘనమైనదే ! ( అని యంతటను గలయఁ జూచి) ఇవిగో ! శ్రీరాజా రామమోహానరాయల యొక్కయు, బరోడా మహారాజుయొక్కయు, దక్షిణహిందూస్థాన విద్యాసాగరుని యొక్కయుఁ జిత్రపటంబులు గూడ నిందుఁ గట్టఁబడినవే. ఇవిగో, శంకర రామానుజాదుల పటములు. ఇది శ్రీ శంకరులవారు శిష్యుల కుపనిషత్తుల బోధించుచున్న పటమా ! ఈ యాశ్రమములో పులియు మేకయు నొక్క చెఱువున నే నీళ్ళు త్రాగుచున్నవియే. ఈ బల్లపై నున్న పుస్తకములేమి? (అని యొకదానిని బట్టి విప్పి చూచి) భక్తవిజయము ! ఈ చిన్ని పాత్రమో ? (అని చేఁగొని చూచి) భగవద్గీత !!

గీ. ఫణికి శిరమున రత్నంబు ♦ వఱలుచున్న, జెనఁటి చేతను ఖడ్గంబు ♦ చేరియున్న వాని హెచ్చగు జగతికి ♦ నట్లు గానె, వేశ్యకడ నుండు మతవిద్య ♦ వెతలఁ బెంచు.

మూలబల్లలపై నున్న యీ బొమ్మలేమి ? (అని చూచి) సీతారాములా ? ఈ విగ్రహము కృష్ణవిగ్రహమా ? ఈ ప్రతిమ మెడలో ననేకాలంకారములు వేయఁబడియున్నవి. మీఁదఁ బుష్పములున్నవి. మంగతాయికి శ్రీకృష్ణుఁ డిష్టదైవతమా యేమి ?

వసం—అవును. ఆమె యెప్పుడును గీతగోవిందములఁ బాడుచుండును.

రసిక—(పైకి చూచి) అంతయు స్వదేశీమయముగాఁ గాన్పించుచున్నది. బల్లపై వేసిన యీ చిత్రవస్త్రములు స్వదేశీయములా యేమి ? (చేతఁబట్టి చూచి, యాశ్చర్యముతో) ఆహా ! స్వదేశీయవస్త్రములే ! ఇందలి లతా, పుష్ప, ఫలాదులు బాగుగఁ గుట్టఁబడియున్నవి. ఇవి కుట్టిన వా రెవరు ?

చకో—మా యక్క మంగతాయి కుట్టినది.

రసిక—నా గురువులు శృంగారశేఖరులు చెప్పినరీతిగా నీమె లలితకళాకుశలగాఁ గాన్పించుచున్నది. ఇది వేశ్యాగృహమైనను బచ్చిశృంగారమును దెల్పు చిత్రపటాదు లేవియు నిందు లేకుండుట వింతగ నున్నది. స్త్రీ పురుషాదుల మోహాదులం దెలుపు చిత్రపటాదులు సంసారుల మందిరంబులఁగూడఁ గానవచ్చుచున్నవి. కాని, యిందు లేవు. ఎచ్చటఁ జూచినను దైవభక్తిని దేశభక్తిని సూచించు వస్తువులే గాన్పించుచున్నవి. ఇది చోద్యమే ! ఈయాదర్శవచన మేమి ? 'ఆనందో బ్రహ్మ' అనుపవిత్రవాక్కు చక్కఁగ లిఖింపఁబడి పటము గట్టింపఁబడి యున్నది.

శృంగా—మంగతాయి యోగ్యత నీ వెఱింగియున్నచో నీ కింతవింత పొడమకుండును.

రసిక—ఇవిగో! గోడల ప్రక్కల పియానో, వీణె, ఫిడేలు, మృదంగములోనుగాఁగల సంగీతోపకరణములు గాంలుచున్నవి. మందిరమంతయు వర్ణనీయముగ నున్నది. (జేబుగడియారముఁ దీసి చూచుకొని) ఓహో! ఎనిమిది గంట లైనదే! శృంగార శేఖరులారా! మంగతాయి యింకను వచ్చుటలేదు. కాలయాపన మగుచున్నది.

శృంగా—అవును. (అని చకోరాక్షివైపు చూచి) ఆమె వచ్చుట కింకను నెంత యాలస్య ముండును?

చకో—ఆలస్యము లేదు. అదిగో, మా యక్క వచ్చుచున్నది.

శృంగా—

సీ. వెన్నునఁ బెన్నెఱుల్ ♦ చెన్నెసలారంగ, శిరమున నక్షతల్ ♦ చెలఁగుచుండ
నుదుట శ్రీమార్గంబు ♦ పొదలంగ భ్రూమధ్య, మునఁ గుంకుమపుబొట్టు ♦ పొలుపుగాంచ
గళమునఁ దులసితా ♦ వళములు తరళహా, రములకు నవశోభ ♦ గ్రాలఁ జేయ
పసపుఁ బాదములందు ♦ మిసిమియారుచుండంగ, పట్టుపుట్టము తను ♦ ప్రభలఁ బెంప

గీ. శాంతరస మొల్కు చూడ్కుల ♦ సౌరు మెఱయ
మందయానంబు నెమ్మది ♦ పొందుఁ దెలుప
సొగసు లీన మోమునఁ జిఱు ♦ నగవు తనర
మంగతాయి వచ్చెడు నిదె ♦ రంగు మీఱ. 48

వసం—

గీ. మదనుఁడను వేఁటకాఁ డొగి ♦ మాటు గట్టి, రసిక శేఖరులను మృగ ♦ రాజములను
గొట్టవేసిన నునుసన ♦ గోల యనఁగ, మంగతాయి వచ్చెడుఁ గంటె ♦ సంగడీఁడ.

సీ. పచ్చరంగీను న ♦ ప్పడము కోమలి మోము, చక్కెరబిళ్ళలు ♦ చెక్కు లౌర
బూరె లత్తివయీడు ♦ బోధజేసెను జోడు, ఆజ్యంపుబుండ మీ ♦ యతివ బొడ్డు
బొబ్బట్లు ధొంతరల్ ♦ పుష్పకోమలి వళుల్, వరకరతలము ల ♦ ప్పంబు లరయ
మంచిజిలేబీలు ♦ మదవతి కర్ణముల్, మధురమై తగు కాజ ♦ మగువ మోవి

గీ. సన్నబియ్యపు మెదుకులు ♦ చాన పండ్లు, అన్ని వడ్డించిన యనంటి ♦ యాకు వీఁపు
హాయి మీఱంగ నీమెను ♦ ననుభవించు, భాగ్య మబ్బిన వానిదే ♦ భాగ్య మిలను.

రసిక—మేలు.

గీ. కలికి చూపులు ప్రౌఢత్వ ♦ గరిమఁ దెలుప, మందయానంబు బోధింప ♦ మార్దవంబు
వేష మేఁతో నాగరకత ♦ వెలయఁ జేయ, వచ్చునది మంగతాయియే ♦ మెచ్చవచ్చు.

(తనలో) ఈమె దేహగేహములను గనఁ శుద్ధియే కాన్పించుచున్నది. ఊహ లెట్లుం

డునో ? (రోఁతతో) పాపము. విగ్రహారాధనమునందు భక్తి హెచ్చుగా నున్నదే. కానిమ్ము. ఆ స్త్రీకరాలుగదా. త్వరగ మన మతములోనికిఁ ద్రిప్పుకొన వచ్చును.

శృంగా—(వసంతకునితో రహస్యముగా) శ్రుతి రాగమునఁ బడుచున్నట్లున్నది.

వసం—(రహస్యముగా) ఎవరికోసరము ? అదిగో మంగతాయి వచ్చినది.

మంగ—(వచ్చి, చేతులు జోడించి) మహాత్ములారా! దండములు. మీ పవిత్రపాద రజముచే మా కుటీరము పావనమైనది. తొల్లి శబరిని కృతార్థురాలిని జేయుటకై రామలక్ష్మణు లామె కుటీరమునకు వచ్చినట్లుగా నేడు మా కుటీరమునకు మీరు దయచేయఁ గరుణించినందులకుఁ జాల సంతోషముగా నున్నది.

వసం—నీ యింటికి నేడు వచ్చినవారము మువ్వురము గదా ! రామలక్ష్మణులని యిద్దఱనే సూచించితి వేమి ?

మంగ—వచ్చిన పురుషసింహు లిద్దఱే కనుక.

వసం—మూడవ వా రెవరు ?

మంగ—వారు స్త్రీ తుల్యులు.

వసం—మా మువ్వురిలో నెవరి పౌరుషము హరింపఁ దలఁచినావు ?

మంగ—ఇప్పుడు మాటలాడు వారిదే.

వసం—నన్ను స్త్రీని జేసితివా ?

మంగ—నేను చేయలేదు.

వసం—మ ఱెవరు చేసిరి ?

మంగ—శాస్త్రకారులు.

వసం—అదెట్లు ?

మంగ—స్త్రీలను ద్విజబంధులను సమానులఁ జేసి వారికిఁ బ్రాకృతమును శాస్త్రజ్ఞులు విధించిరి. నీవు ద్విజబంధుఁడవు. కావున స్త్రీసముఁడవే.

రసిక—(తనలో) ఈమె మంచి ప్రౌఢగాఁ గాన్పించుచున్నది. (పైకి) శృంగారశేఖరులారా ! మనము వచ్చిన పని తేలునట్లు చేయుఁడు.

శృంగా—అట్లే చేయుదును.

మంగ—ఆర్యులారా, నేడు మా యింటి విందులైతిరి. కావున మా సపర్యలఁ గొని మమ్ముఁ గృతార్థురాండ్రఁ జేయుఁడు.

శృంగా—మే మందులకే వచ్చినాము. (రసికశేఖరుని వైపు చూపి) వీరెవ్వరో యెఱుంగుదువా ?

మంగ—వీరి దర్శనభాగ్య మింతవఱకు నాకుఁ గలుగలేదు. కనుక వీరెవ్వరో మీరు తెలుపుఁడు.

శృంగా—వీరు గానకళారహస్యజ్ఞులగు రసికశేఖరు లనుప్రసిద్ధవిద్వాంసులు. మా ప్రియశిష్యులు. గొప్ప సంస్థానాధిపతులు.

రసిక—సరి, యది యొకటియా ?

మంగ—వీరి ప్రసిద్ధి విని యున్నాను. ఇదివఱకు దర్శనము చేసికొని యుండలేదు. నేఁడది కలుగుట మహాభాగ్యము. ఇప్పుడీ దాసురాలు చేయవలసిన దాస్యమేమో యానతిండు.

శృంగా—నీవు గానకళారహస్యజ్ఞవని యొరులవలనను మావలనను విని మాకోరిక ననుసరించి నీగానకళాకౌశలమును బరిశీలింప విచ్చేసి యున్నారు. త్వరఁగ వారు వచ్చిన పనిఁ గొనసాగింతువని నేను నమ్మెదను.

వసం—నీ పాడుశక్తి చూపు సమయము వచ్చినది.

మంగ—(ఆలోచించి) అ- ట్లా- గు- న- నా.

శృంగా—సందేహించుచుంటివేమి ?

మంగ—ఆర్యవర్యా! మఱేమియును లేదు. కాని, రసికశేఖరులవంటి ప్రౌఢవిద్వాంసుల నీ యవిదగ్ధ మెప్పింపఁగలదా యను సందేహము పొడముచున్నది.

రసిక—సరి, సరి, నా పాండిత్య మెంత !

శృంగా—మంగతాయీ, నీ కా సందేహముతోఁ బనిలేదు. నీ ప్రజ్ఞ నీ వెఱుంగవు. కాని, నే నెఱుంగుదును. నీ వీ పండితశేఖరుని మెప్పింపఁ గల సామర్థ్యము గలదానవు. కావున నే నిన్నా పని నొనర్పఁ గోరియున్నాను.

వసం—హనుమంతునివలె నీ బలము నీ వెఱుంగకున్నావు.

మంగ—చిత్తము. ఏమి సెలవు ? వీణ పలికింపుమనియా ? మురళి ప్రయోగింపుమనియా ? ఫిడేలు వాయింపుమనియా ? లేక పాట పాడుమనియా ? మఱి యేవాద్యమునైన వినియోగింపుమనియా ? నా యెఱింగిన వన్నియు మీకుఁ దెలియును. సెలవేమి ?

శృంగా—రసికశేఖరా ! ఏమి చెప్పెదము ?

రసిక—గురువర్యా, మన భారతవర్షములో గానవిషయమున ననాదినుండియుఁ బూనొందుచున్నది వీణియ. సంగీతదేవత యగువాణి పాణి నలంకరించినది వీణె. కావున వీణాగానము మొదటఁ గావింపఁ దగినదని నా తలంపు.

శృంగా—నీ యూహ సమాదరణీయముగా నున్నది. ముందు దేశీయవస్తుసేవం జేయఁదగును గదా ?

మంగ—పెద్దల యాజ్ఞ ననుసరించి వీణియనే మొదట వాయించెదను. ఓసీ చకోరాక్షీ! మోహనాంగీ! వీణాది సంగీతసాధనముల నన్నిటి నిటకుఁ దెండు. సభకుఁ గావలసిన యుపవాద్యాదికములన్నియు సిద్ధము చేయుఁడు.

(చకోరాక్షియు మోహనాంగియు మంచిదని పోయి తెచ్చి వీణాదికముల నచ్చటఁ బెట్టుచున్నారు. మృదంగాదికముల వాయించుటకుఁ దగిన యేర్పాటులు గావింపఁ బడినవి.)

మంగ—(వీణియ చేతఁ గీలించి రసికశేఖరునిపై దృష్టి సారించి) ఏమి వాయింప సెలవు?

వసం—(నవ్వుచు) కొంచెము కాఫీ.

చకో—నీకెప్పుడును దిండిమీఁదనే దృష్టి.

వసం—ఓసీ! వెఱ్ఱిముఖమా! కాఫీరాగమును బాడుమనినాను. నీకు దిండి తప్ప మఱియొకటి తెలియదు కావున మఱియొకలాగున నెంచికొనినావు.

రసిక—అది నీకుఁ దోఁచినట్లు కానిమ్ము. దానిని బాడెడివారి యుత్సాహమునకే విడిచిపెట్టుట మంచిది. (వీణియ చేతఁ గీలించి మంగతాయి గజాననస్తవ మయినతరువాత రాగము వాయించుచున్నది. తన కౌశలము వీణపైఁ జూపును.)

వసం—సంగీతసభలో సభ్యుఁడు ముఖ్యముగాఁ జేయఁదగినది తలఁ ద్రిప్పుట. నడుమ నడుమ 'మేలు' అనుచుండుట. ఇవి యెంత హెచ్చుగఁ జేసిన నంత హెచ్చగు ప్రవేశము సంగీతమునందున్నట్లు లోకము గ్రహించుకొనును. కావున నేను మొదటి నుండి తుదివఱకుఁ దలఁద్రిప్పి 'మేలు' 'బాగు' మున్నగు కేకలు హెచ్చుగా వేసి గొప్ప పండితుఁ డనిపించుకొనెదను. (అని తలఁ ద్రిప్పుచున్నాఁడు.) (కొంతసేపైన తరువాత మంగతాయి రాగమును బూర్తి చేసి తానముఁ బ్రారంభించినది.)

రసిక—మేలు, తానము మిక్కిలి ప్రౌఢముగా వాయించుచున్నది.

శృంగా—వీణియపై తానము చాల మనోహరముగా నుండును. అదిగో, పల్లవి వాయించుచుఁ గలిపి కంఠమెత్తి కూడఁ బాడుచున్నది.

గీ. గిరికయు వరూథినియుఁ దొల్లి ♦ సరసగతుల
వీణ వాయించు విధముఁ గ ♦ వివరు లెట్లు
పొగడియున్నారొ యారీతిఁ ♦ బొలఁతి నేఁడు
వీణ వాయించుచున్నది ♦ వింతె సరిగ. 52

రసిక—ఈ పల్లవపాణి వీణానాదము మనోహరముగా నున్నది.

ఉ. ప్రాణము లేని కట్టెయును ♦ బల్కఁగఁ జేయుచుఁ జిల్కపల్కులన్
జాణతనంబు మీఱ స్వర ♦ సంపద యెంతయు సొంపు నింపనీ
గాణ యఖండగానకళ ♦ గానఁగఁ జేయును నేర్పుమీఱఁగా
వీణియమీఁద నేఁడు కడు ♦ వీనుల విందొనరించుచున్ బళే. 53

(అని వ్రేలి రవలయుంగరముఁ దీసి మంగతాయి మీఁద విసరుచున్నాఁడు.)

వసం—

ఉ. వీణియ కీవధూమణి న ♦ వీనముగాఁ గను నేర్పుఁ గానమున్ ;
వాణిని బట్టి సుస్వరము ♦ బాడక యుండిన నొక్కుచున్ జెవిన్
రాణ దలిర్ప నంగుళుల ♦ రాయిడి వెట్టుచుఁ జెంపఁ గొట్టుచున్
గాణ యనల్ప సుస్వరపు ♦ కల్పన పుట్టఁగఁ జేయుచున్ బళా. 54

(అని కెంపాయపెంపుటుంగరము మంగతాయిపై విసరివేయుచున్నాఁడు) ఆహా !
ఏమి వింత !

గీ. కట్టె, యినుముఁ గూడఁ ♦ గడు రమ్యతరమగు
రాగ మదరఁ బాట ♦ రక్తి పుట్టఁ,
బాడఁజొచ్చె గణిక ♦ పాణిపల్లవ మంట
లోలబుద్ధు లీపె ♦ పాలఁ బడరె ? 55

రసిక—ఆహా ! పల్లవి యుల్లమున నుల్లాసముఁ గలిగించుచున్నది.

ఉ. ఉల్లము పల్లవింప, రసి ♦ కోత్తము లొయ్య శిరంబుఁ ద్రిప్ప, రా
గిల్లి శుకీమతల్లికలు ♦ కీరవ మొప్పఁగఁ జేయుచుండఁగా
జల్లఁగఁ బల్లవాధరము ♦ సౌరడఁ జక్కఁగఁ బాడుచున్న యీ
పల్లవి యెల్లవారలను ♦ బామరతన్ బడఁద్రోయు చుండు నే. 56

వీణాగాన మతిమనోహరముగా నున్నది. ఇంక వీణియను విడిచి వేణువుఁ బుచ్చుకొ
నఁదగు.

శృంగా—అట్లే యగుఁ గాక.

మంగ—(వీణియను విడిచి, మురళిఁ జేకొని పాడుచున్నది.)

శృంగా—హాయ్ ! హాయ్ !

గీ. వీణమీఁదను బాశ్చాత్య ♦ వీణ నెంత, పనిని జేయంగనౌ నంత ♦ పనిని మురళి
మీఁదఁ జేయుచున్న దీ ♦ మీననేత్రి, రసిక శేఖర ! కంటె యీ ♦ రమ్యగతుల?

రసిక—మ. మురళిం జేకొని కావిమోవి నిడి స ♦ మ్మోదంబు సంధిల్ల భా
సురతీలన్ స్వరకల్పనంబు, లయలో ♦ క్షోభిల్లఁగాఁ జేసి యా

మురవైరిఁ బురుడించి రాగమదరఁగఁ బూఁబోఁడి పాడఁగ నా
దరమొప్పఁగ జనపాళి మైమఱచి నా ♦ దబ్రహ్మముఁ జేరెడిఁ. 58

(అని మణిబంధమున నున్న బంగరుచేతిగడియారమును దీసి విసరుచున్నాఁడు.)

వసం—ఈ పాట వర్ణనీయము.

ఆ. వె. మురళి మోవిఁ బూని ♦ మురహరు హరువుగా
ముదిత యెదరు ముదము ♦ పొదువఁ బాడ
మనను కరఁగి కరఁగి ♦ మాయమై పోయెను
తెలుపలేను పాట ♦ తీపి యెల్ల. 59

(అని పాదుము తీసివేసికొని పొత్తి విసరుచున్నాఁడు.)

చకో—చెప్పఁ బ్రియత్నింపుము.

వసం—అట్లైనఁ జెప్పెద వినుము.

గీ. ఒడలిపైననుఁ బాడమిన ♦ చిడుముమీఁద, నుష్ణతర వారిధారల ♦ నోలిఁబోసి
శాతనఖముల గోకిన ♦ సంభవించు, హాయినిం బోలి సుఖమిదు ♦ తాయిపాట.

మఱియును,

గీ. పొలఁతి యను వింతసాన్నారి ♦ వలపుటగ్గి
రగులఁజేసి వేణువు నూఁది ♦ సొగసు విటుని
నందులో నునుపఁగ రాగి ♦ యాతఁడగును
కనఁగ నాతనియిల్లు బం ♦ గారమగును. 61

ఇంకను జెప్పెద వినుము.

గీ. మోక్షమిచ్చుచునున్న దీ ♦ మురళిపాట
కొంతసేపైన నా పాడు ♦ కొంపమీఁది
స్మరణముం ద్రోసిరాజని ♦ సానిమీఁది
భక్తి హెచ్చించె సానియె ♦ బ్రహ్మమాయె. 62

ఘంగ—(మురళిఁ గ్రిందఁబెట్టి) వసంతకుఁడు చెప్పిన దానిలో నొక్క సత్యము లేక పోలేదు. సా-రి-గ-మ-ప-ధ-ని యను సప్తస్వరములే ప్రత్యాహారవిధిచే సానిరైనవి. ఈ సప్తస్వరములే ఓంకారమనియు, సంగీతము మోక్షప్రదమనియు మోక్షసామ్రాజ్యముం జూఱగొనిన త్యాగరాయలవారి కృతి యిట్లు చెప్పుచున్నది.

కృతి.

సారమతిరాగము—ఆదితాళము.

ప॥ మోక్షము గలదా భువిలో జీవన్ముక్తులు గాని వారలకు॥

అను॥ సాక్షాత్కార నీ సద్భక్తి సంగీతజ్ఞాన విహీనులకు॥ మోక్ష॥

చ॥ ప్రాణానల సంయోగము వల్ల ప్రణవనాదము సప్తస్వరములై పరగఁగా ।
వీణావాదనలోలుఁడౌ శివమను విధ మెఱుఁగరు త్యాగరాజవినుత॥ మోక్ష॥

వసం—ఆ. వె. వనిత పాడు నేర్పు ♦ వర్ణింపఁ దరమౌనె
తలలు వేయి గల్గు ♦ చిలువకైన
రాగ మీపె పాడ ♦ రాగంబు విటుఁ డొందు
రాగ మతని యింటి ♦ రాణి యిడును. 63

రసిక—ఆఁ-ఆఁ-ఏమిపాట ! ఏమిసమయస్ఫూర్తి ! ఏమిప్రౌఢత ! అంతయు నానంద మయమై యొప్పుచున్నది. ఈ కృతిమీఁదిది సారమతిరాగము కాదా?

శృంగా—అవును. సారమతి మీఁదిదే. అది నటభైరవిజన్యము.

వసం—సంగీతములో నే మోక్షమున్నదని చెప్పుచున్నది.

రసిక—అవును. అందులకు సందేహమేమి ? నిజముగా సంగీతరహస్య మెఱుంగని వారు కేవల మూఢులు కదా !

The man that hath no music in himself,
Nor is not moved with concord of sweet sounds,
Is fit for treasons, stratagems and spoils.

అని షేక్స్పియరు మహాకవి చెప్పియున్నాఁడు. ఇట్టి మూఢులకు జ్ఞానైక సాధ్యమగుముక్తి యెట్లు వచ్చును ?

మంగ—భగవంతుఁడు గానలోలుఁడు.

శ్లో॥ నాహం వసామి వైకుంఠే న యోగిహృదయే రవౌ
మద్భక్తా యత్ర గాయంతి తత్ర తిష్ఠామి నారద॥

అని నుడివి యున్నాఁడు. దైవసాన్నిధ్యము సంపాదించుకొనుటకు గానము ప్రథమ పవిత్రసాధనము. గానమువలన ముక్తిగలుగుట వింతగాదు.

వసం—గానమువలన ముక్తి యున్నను లేకున్నను వేశ్యాగానలోలతవలన శుద్ధమోక్షము సంప్రాప్తమగును.

రసిక—నేఁటి గానసభ నాకుఁ బరిపూర్ణానందముఁ గలిగించినది. మంగతాయి పాటయేగాక ప్రక్కనున్న పాశ్చాత్యోపకరణగానమును, మృదంగనాదమును మిగుల నింపుఁ గలిగించినవి. వెదకి చూచినను లోపము గాన్పించుటలేదు.

మంగ—దాసురాలు ధన్యురాలైనది.

వసం—లేదు. లేదు. ఒక పెద్ద లోపము గలదు.

రసిక—అది యేదో తెలుపుము.

వసం—(మంగతాయి వైపు చూచి) చెప్పవచ్చునా ?
మంగ—సందేహమేమి ? అల్పజ్ఞతగల మాయందు లోపములుండుట యొక వింత కాదు. కావున మాలోపములఁ దెల్పుము. ముందైనను వానిని సవరించుకొందుము.
వసం—నీవు రాగ, తాన, లయాదులు తప్పిపోకుండ యథాశాస్త్రముగాను, మనోహరముగాను బాడినావు. పల్లవుల మెప్పించినావు. కృతులఁ బాడినావు. రసిక శేఖరుల కానందము గలిగినది. కాని శృంగారరస మొలుకు మనోహర మగు జావళి యొక్కటియుఁ బాడలేదు. జావళి పాడినదే జాణ.
మంగ—నీకు జావళీ కావలెనా ?
వసం—తప్పక కావలెను.
మంగ— గీ. సదమల మృణాళముల కంచ ♦ సరసుఁ జేర
మధుర మకరందముల కళి ♦ మదుఁగుఁ జొరఁగ
కొంగ నత్తగుల్లలకయి ♦ కొలనుఁ జొచ్చు
వారి వారికిఁ దగు రుచుల్ ♦ వఱలు నిల్లై. 64
వసం—ఏమి, కోపము వచ్చినదా ?
మంగ—నాకుఁ గోపములేదు. కాని గానకళ మిక్కిలి పవిత్రమైనది. మోక్షప్రదమైనది. అట్టి భావమెఱిఁగియుఁ గూడఁ బాడుజావళి పాడు మనుట శోచనీయము కాదా ?
చకో—మా యక్క జావళి పాడఁగ నెన్నఁడైన వినినావా ? ఆ పాడుసరుకు వేఱు. వలయునెడల నచ్చటికిఁ బొమ్ము.
వసం—ఓసీ ! పూనికొని వచ్చుచున్నావు. నీ కింత రోస మెందుకే ? ఆహా ! కలికాల మహిమ ! ఏమిదంభ మేమిదంభము !
గీ. విలువ గలవారు నిజమెన్న ♦ సలుప రిట్టి, దంభగంభీర వాగ్వివా ♦ దంబు నెపుడు కులట శ్రీరంగనీతులు ♦ గురిసినట్లు, కులసతీమణి జాణయై ♦ గురియఁ గలదె ?
•మంగ—నీకు దంభముగాఁ దోఁచినఁ దోఁచుఁ గాక. మేము జావళులఁ బాడము. చకోరాక్షీ ! ఒరుల మాట నెత్తెద వేమి ? ఒరుల నీచులనిన మనము ఘనుల మగుదుమా? అయ్యా, జీవదయాపరుఁడు ధర్మసాధనముగా దేహమును దయచేసి యున్నాఁడు. ఇట్టి దానిని సద్వినియోగము చేయవలయును గాని దుర్వినియోగము చేయరాదు. మేము తొలిజన్మమున నే ఘోరపాపకృత్యములం జేసియుంటిమో యీ పాడుకుల మందుఁ బుట్టి నిర్భాగ్యురాండ్రమై యున్నాము. ఇంకను నీచవిటుల వలపించు తుచ్ఛమైన జావళులఁ బాడవలయునా ? "శ్రీనాథు వర్ణించు జిహ్వా జిహ్వా" యని

భాగవతము ఘోషించుచున్నది. కావున జిహ్వ గలిగినందుల కింకనైన శ్రీనాథ వర్ణనము గావించి ధన్యతఁ గాంతుము గాక! మనము జీవించుకాలము మిక్కిలి తక్కువ. అందులో సగము నిద్రకుఁ బోవును. మఱికొంత బాల్యాదుల మూలముగాఁ బోవును. వ్యర్థ కాలయాపనము చేయక మిగిలిన స్వల్పకాలమైన శ్రీకాంతస్మరణమునకై వినియోగించుకొనుట లెస్సకాదా?

రసిక—(తనలో) మన మీమెకు నీతిబోధచేయుటకు వచ్చినాము. తుద కీమెయే మనకు నీతిబోధ గావించుచున్నది. దేహగేహముల వలెనే యీమె యూహలును బవిత్రములుగాఁ గాన్పించుచున్నవి. ఈమె రూప, రేఖావిలాసములు, కళాకుశలతలు, విద్యాబుద్ధులు, సరససల్లాపములు నా హృదయమును జూఱగొనినవి. సదా యీమెతో మాట్లాడవలయునను నూహయే పుట్టుచున్నది. (గోడనున్న గడియారము చూచుకొని, వింతతో గవాక్షముగుండ నెండ వైపు చూచి)

చ. కరముల ధాత్రి చేఁ బ్రజలఁ ♦ గ్రాఁగఁగఁ జేయుచు వేడి వెట్టుచున్<br>
సరభసలీల వేడ్కమెయి ♦ స్వైరవిహారము చేయునట్టి బం<br>
భరనివహంబుఁ గల్వచెఱ ♦ బంధముచేయుచు చండధాముఁడై<br>
కరమనురక్తి మిత్రముఖ ♦ కంజములొప్ప నినుండు వ్రాలెడిన్. 66

చాల వేళ యైనది. ఇప్పటి కింటికింజని మఱలవచ్చి యీమె పదవృత్తిని మాన్పింపఁ బ్రయత్నింతును గాక! (ప్రకాశముగా) శృంగారశేఖరులారా, మీరు మంగతాయి మూలముగ నా కమూల్యగాన వినోదముం గలిగించితిరి. తృప్తి నొందితిని. మీ కివె నమస్కృతులు. ఓ మంగతాయీ! నీ సరసగాన సల్లాపాదులు డెందమున కమితానందముం గూర్చినవి. ఘనవిద్యాంసురాలవైన నీతో మీ కులవృత్తిం గూర్చి కొంత ముచ్చటింప వలెనను నూహ కలిగినది. కాని కాలాతీతమై పోయినదని జంకుచున్నాను.

మంగ—ఇప్పుడు కాలాతీతమైన మాట సత్యము. దయయుంచి పునర్దర్శనము నొసంగి మాకుఁ దగుబోధలఁ గావింపఁ బ్రార్థించుచున్నాను.

రసిక—(జంకుచు) మరల నీయింటికి రమ్మందువా?

శృంగా—కటకటా! రసికశేఖరా! ఎందు కాభీతి?

వసం—వెడఁగువాఁడ! ఆ భీతియేల?

మంగ—ఆర్యులారా, అట్లనఁజనదు. రసికశేఖరులకు మరల మా యింటికి వచ్చుటకు జంకు పుట్టుటకుఁ గారణము లేకపోలేదు. మొత్తముమీఁద ప్రస్తుతపు వేశ్యాకు

లము ఘోరపాపసంకులమైపోవుచున్నది. వేశ్యావృత్తి యతి ఘోరమగు స్థితికి వచ్చుచున్నది.

సీ. క్షీణీకృతాఖిల ♦ క్షోణీస్థపల్లవ, విత్తాది సంపత్తి ♦ వేశ్య వృత్తి
బందీకృతానేక ♦ సుందరవరగుణ, విటసుమనోవృత్తి ♦ వేశ్యవృత్తి
లఘ్వీకృతామలా ♦ లఘ్వార్యమతనీతి, విధిలసదుష్పత్తి ♦ వేశ్య వృత్తి
భస్మీకృతస్మర ♦ బాధక ఘనదమ, విమలశమోత్పత్తి ♦ వేశ్య వృత్తి

గీ. విటుల జీవముఁ గొను మిత్తి ♦ వేశ్య వృత్తి, వినయవల్లి గోసెడు కత్తి ♦ వేశ్య వృత్తి
వివిధ దుష్ఫలముల గుత్తి ♦ వేశ్య వృత్తి, వీర్య మవియించు వెనుసుత్తి ♦ వేశ్య వృత్తి.

ఇది సామాన్య వేశ్యావృత్తి లక్షణము. అట్టియెడ వాఁరిచట్టికి వచ్చుటకు భీతిల్లుటలో వింత యేమున్నది. హా! పాపపుదైవమా! న న్నెంత పాడుకులమునఁ బుట్టించితివి? నీ కేమి యపకారము చేసితిని? నా బ్రతుకును, నా కలాకాలములను నీ దుష్టకులమునఁ బుట్టించి వ్యర్థము చేయుచుంటివే! కటకటా! ఎంత నీచకుల మెంత నీచకులము! తొలిజన్మమున సీతాది మహాపతివ్రత లేమిపావనవ్రతము లాచరించిరో గదా! పూతచరిత్రలై తమ్ముఁ దాము పునీతలఁ గావించుకొనుటయే గాక స్త్రీజాతి కంతకును ఖ్యాతిఁ దెచ్చుచున్నారు. ఎత్తిన నట్టి పవిత్రజన్మ మెత్తవలెను. (అని దుఃఖించుచున్నది.)

వసం—దుఃఖింపకుము, దుఃఖింపకుము. గతించిన దానికి వగచిన నొకచిల్లి గవ్వయైనఁ గలిసి వచ్చునా? ముందు జాగ్రత్త పడుము.

మంగ—హా! దైవమా! ఎంత చేసితివి. (ఆలోచించి) కటకటా! బుద్ధిహీనురాలనై పరమపూజ్యుఁడగు భగవంతుని నిందించుచుంటినేమి? నా యీ పాడుజన్మమునకు మూలకారణము నాపూర్వజన్మకృతదుష్కృతము గదా! కావున, నన్నే నేనే నిందించుకొనవలెను. (రసికశేఖరునివైపు దృష్టిఁబరపి) ఆర్యా! రక్షింపుము. రక్షింపుము. తగు ధర్మబోధఁ గావించి మా యీ పాడుకులమును సంస్కరింపుము. (అని సమీపమునకుఁ బోయి బ్రతిమాలును) మీ రెప్పుడు దయచేయుదుమనిన నప్పటికి మాకులము వారి నందఱిని నిచ్చటికి రప్పింతును. పండితవర్యులారా! మీ యట్టి దిట్టలు సద్వ్యుత్తితో మాగృహమునఁ బ్రవేశించినంతన మీ యమోఘమయ మనఃపంజరమును మా దుర్బలచేష్టలు పగులఁగొట్టఁ జాలవు.

సీ. ప్రవరాఖ్యు మోహాబ్ధిఁ ♦ బడఁద్రోయఁ గల్గెనే చారువరూధినీ ♦ చర్యలెల్ల
కవ్వడిఁ గామారుఁ ♦ గావింపఁ గల్గెనే, యూర్వశీ చతురత ♦ రోషలెల్ల

శుకయోగివర్యుని ♦ వికలాత్ముఁ జేసెనే, ప్రచుర రంభాసుసం ♦ వాదమెల్ల
రామకృష్ణాఖ్య ప ♦ రమహంస మనమును, గణికాళి భేదింపఁ ♦ గలిగినదియె

గీ. నిక్కమగు శీలమనియెడు ♦ నుక్కుటోడలు
పగులఁ గొట్టంగ వశమె యె ♦ వ్వారికైన
వారనారికి వశమౌనె ♦ ధీరవరుల
మనసుఁ జెడగొట్టివేయంగ ♦ మాన్యచరిత. 68

రసిక—ఓహో! ఈమె యెదురు తగుల్కొనినది. (ప్రకాశముగా) మంగతాయీ, నీవు చాల సుశీలవుగాఁ గాన్పించుచున్నావు. పణ్యభామ వగు నీకు నీతియందింత యాదర మెట్లు కలిగినది?

మంగ—పండితవర్యా, శృంగారశేఖరులు ప్రార్థనమందిరమునఁ జేయు ధర్మబోధలు వినుచు వారిని సదా సేవించుచుండుటచేఁ బాపపుటూహలు నాహృదయమునుండి పోయి నేను బవిత్రనైతిని.

రసిక—అట్లు చెప్పు. ఇట్టి నీకు మా బోధ లవసరములేదు. (తనలో) ప్రార్థన మందిరముల మా పెద్దలచేఁ గావింపఁబడు విమలబోధల తఱుచుగ విని, మనినది కాన, నీమె విశుద్ధచరిత్ర యగుటలో సందియము లేదు.

మంగ—పండితవర్యా, అట్లు సెలవీయఁ జనదు. ఈ దాసురాలు మాత్రము వేశ్య కాదా? అది యటుండ నిండు. నేను జీవదయాపరుని కృప వలనను, నీ శృంగార శేఖరుని బోధవలనను గొంత భక్తిమార్గమునఁ బడినాను. అందులకు మా వారెల్లరును నన్ను నిందించుచున్నారు. మాలో నందఱు హేయచరిత్రలు కారు గాని పలువు రట్టివారుగ నున్నారు. వారికొఱకై మీదర్శనములు నుపన్యాసములు నత్యవసరములు.

గీ. సూర్యపదము లేచోటులఁ ♦ జొరవొ యట్టి
కడలఁ దమములు వ్యాపింపఁ ♦ గలుగునట్లు
మిమ్ముఁ బోలు సూరులఁ జర ♦ ణమ్ము చొరని
తావు లత్యంధకారావృ ♦ తములు గావె? 69

మీరు తఱుచుగ వచ్చి ధర్మోపన్యాసముల నిచ్చి నన్నును మావారలను గృతార్థురాండ్రఁ గావింపవలెను. శృంగారశేఖరులవారు మాకు బోధలఁ జేయుచుండినను, మా కతి పరిచితులగుటచే మావారికి వారి యందుఁ గొంత యనాదరభావము గలుగుచున్నది. కావున మీయట్టి క్రొత్త పండితుల బోధ లత్యవసరములు.

వసం—రసికశేఖరా, నీ యుద్దేశమంతయు సఫలత నొందుచున్నది. నీ ధర్మోపన్యాస

ములను విని నీ యర్థమునంతను వారు గ్రహించునటులకు నీవు తఱుచుగ దర్శన మిచ్చు చుండవలెను.

రసిక—(తనలో) నే నీమెను విడువలేకున్నాను. (ప్రకాశముగా) నీవు ధీమంతురాలవు. నీకు బోధింప నెవరితరము ? అయినను వేశ్యకాంతలకు బోధలం గావించి వారల దుర్వృత్తులనుండి మఱలించుట మా ప్రధానధర్మము. కావున నేను మరల నిచ్చటికి వత్తును. నేను వచ్చునప్పటికి నీవు వేశ్యల నందఱ నిటకు రప్పింపుము.

మంగ—ధన్యాస్మి ! మీరు మరల నెప్పుడు దయచేయుదురు ?

రసిక—మరల నేఁడే భోజనానంతరమున వచ్చెదను.

మంగ—చిత్తము. దండములు. (అని చేతులు జోడించుచున్నది.)

రసిక—చింతితకార్యార్థ సిద్ధిరస్తు. మంగతాయీ ! నీ విద్యావైశద్యము, గుణాతిశయమునుం గనఁ జాల వేడుక యగుచున్నది. ఇప్పటికిఁ బోయి వచ్చెదను. (అని చేయి పట్టుకొని కదుపుచున్నాఁడు.)

వసం—(అయంపాణిగ్రహణ ముహూర్త స్సుముహూర్తోస్తు' అకటా ! ఎవరును 'తథాస్తు' అనరేమి ? తథాస్తుదేవతలు హైనున్నారు. వా రనక మానరు.

రసిక—ఇఁక నే నింటికిఁ జనెద.

శృంగా—నిన్న మేము సాగనంపుదుము. (మంగతాయితో రహస్యముగా) నే నింక పిగ్గుగానిని దీసికొని వచ్చెదను. వాఁడు పచ్చి పాశ్చాత్యాభిరుచి గలవాఁడు. వానిని బడఁద్రోయు నుపాయములో నుండుము. ఇందు నీకృషి విశేషశ్లాఘాపాత్రముగా నున్నది. కాని యీ రసికశేఖరుని నీ పాదదాసునిగాఁ జేసికొనవలసియున్నది సుమా.

మంగ—(రహస్యముగా) చిత్తమట్లే చేయుదును. చకోరాక్షీ! తాంబూలములు తత్క్షణము తీసికొని రమ్ము.

చకో—ఇవిగో సిద్ధముగ నున్నవి. (అని బంగరు పళ్ళెమునఁ బెట్టి తాంబూలములు తెచ్చుచున్నది.)

రసిక—మేలు.

మంగ—ఏవీ, యిటు తెమ్ము. (అని చకోరాక్షి చేతినుండి పళ్ళెమును బుచ్చుకొని శృంగారశేఖర, రసికశేఖర, వసంతకులకు తాంబూలముల నిచ్చుచున్నది.)

(తాంబూలములఁ గైకొని మువ్వురు నీవలకు వచ్చుచున్నారు.)

రసిక—చాల పొద్దెక్కినది. నా బండిమీఁద మీరు కూర్చుండ దయచేసి మా భవ

నము పావనముఁ జేసిన మిగుల సంతసించెదను. తప్పక మా యింటికి విందునకు దయచేయుఁడు. (అని చేయి పట్టుకొని లాగుచున్నాఁడు.)

వసం—అట్లే చేయుదుము. (అని శృంగారశేఖరుని వైపునకుఁ జూచుచున్నాఁడు.)

శృంగా—(తనలో) నేను ముండలమిండఁడనై యుంటినని నా భార్య నన్ను సదా కోసిపెట్టుచున్నదగుటచే సాధ్యమైనంతవఱ కింటికిఁ బోకుండుట తటకాళము కలిగినచో నా కది యత్యానందమును గూర్చును. (పైకి) అట్లే కానిమ్ము.

(అని ముప్పురును వెళ్లిరి.)

మంగ—చకోరాక్షీ! మా యమ్మ యెక్కడ?

చకో—ఇదిగో! వచ్చుచున్నది. (అని వచ్చుచున్న వేశ్యమాతఁ జూపుచున్నది.)

మంగ—(తల్లింగని) అమ్మా, నవసంస్థానాధీశుఁ డగు రసికశేఖరుఁడుగారిని బుట్టలోఁ బెట్టినామని చెప్పవచ్చును. అతఁ డిచట నున్నంతసేపు నావైపునకే చూచుచు నా యాలాపము లాలించి చొక్కుచు నన్ను విడువలేక, విడువలేక విడిచి భోజనార్థమై యింటికి వెళ్లినాఁడు. మరల వచ్చెద నని తెల్పినాఁడు. ఇఁక నొక విశేషము. ఈ యుంగరమును, జేతిగడియారమును నాకిఁ డిచ్చినాఁడు. ఇవి రెండువేల రూప్యముల విలువకుఁ దగ్గియుండవు. (అని చూపుచున్నది.)

వేశ్యమా—(ఆవస్తువులు చూచి సంతోషముతో) నా యశస్సు నిలుపఁ గలవు. అమ్మా! యీ పాటికి నిస్సారుఁడై యున్న శృంగారశేఖరుని యెడ నసహాయోద్యమమును సారవంతుఁడై యున్న రసికశేఖరుని యెడ సహాయోద్యమమును వినియోగింపుము.

మంగ—సందేహమేమి? తటిని బట్టి యట్లే చేసెదను. శృంగారశేఖరుఁడు విద్వాంసుఁడు. మన తలం పెఱిఁగి యతఁడే తప్పుకొనవచ్చును. అట్లు తప్పుకొనఁడేని తగిన రీతిని సాగనంపుదును. కాని, అమ్మా, శృంగారశేఖరుని వలన మనకు నష్టమేమి? అతఁ డీయకున్నను బరులిచ్చు మార్గమును నేర్పాటు చేయుచున్నాఁడు గాఁడా?

వేశ్యమా—(పండ్లు కొఱుకుచు, నెత్తికచిఱచి) నీ దగ్గరనున్న కర్మమే యిది. వేశ్యాకులమర్యాదను మీఱి యా శృంగారశేఖరునిపై మితిమీఱిన కనువెత్తి పెట్టుకొనినావు. వీని తావున నెవఁడు వచ్చిన వాఁడే మనకు ధనాకర్షణోపాయముల మనకు ప్పునకై చూపి తీరును. అదిగాక, నేటి విటధనలాభము మన తెలివితేటలు తెచ్చినవి గాని పరులు తేలేదు. నీకన్న శృంగారశేఖరుఁడు వచ్చెను, గాని మాయమ్మమ్మకు, మాయమ్మకు, నాకు నేశృంగారశేఖరుఁడు ధనాకర్షణోపాయములఁ జెప్పె?

మంగ—ఇంతయేల? తటిని బట్టి నీ యిష్టానుసారము చేసెదను.

వేశ్యమా—అమ్మా, ఒక్క సంగతి వినుము. క్రొత్త విటుల మద్యపానరతులఁ గావింప కుండిన మన యాటలు సాగవు.

ఉ. మత్తత పెంచి, జాతి మత ♦ మానము లందలి యోగ్యభావముల్
చిత్తమునుండి ద్రోలి యటఁ ♦ జిత్తసముద్భవరాగబీజముల్
విత్తి, విటాళి యెల్లపుడు ♦ వేశ్యలకొంపలు కాచు బంటులై
హా తఁగఁ జేయు మార్గముల ♦ కాదివి యౌఁ జుమి మద్యపానముల్. 70

అమాయికులగు విటులు తమ శ్రేయస్సును గోరు స్వజనమునందు రోతఁ జెంది మాయామోహమును జూపు మనయట్టి పరజనముపై భక్తి విశ్వాసము లుంచుకొనునట్లు చేయు నుపాయము లన్నిటి మన ముపయోగింపవలయుఁ జుమీ.

మంగ—అమ్మా! నీ కూఁతునైన నా కీ నీతులఁ గ్రొత్తగ బోధింప వలెనా? పిల్లచేఁపకు నీత నేర్పవలయునా? మన సోదరి నవనాగరకత యిట్టి యువకుల మద్యపాన రతులఁ జేయుచునే యున్నది. మన మావిషయమున నంతగాఁ బని చేయ నవసరము లేదు కాని యన్నియు సరిగ నడపెదను.

వేశ్యమా—అమ్మా, ప్రొద్దు పోయినది. నీ వింకను కూడు తినలేదు. తొరగ తినిరా.

మంగ—మంచిది. (అని వెళ్ళిపోవుచున్నది.)

చకో—(వీధి వైపు చూచి) వారుగో! వసంతక శృంగారశేఖరులు వీధిని వచ్చు చున్నారు.

(అందఱును వెళ్ళిపోవుచున్నారు. యవనిక పడును.)

## ఏడవ రంగము

పుర రాజవీధి.

[వసంతక శృంగారశేఖరుల ప్రవేశము.]

వసం—(పొడుము పట్టు పీల్చి) విందు డెందంబునకుఁ జాల మోదము కల్గించినది. (బొజ్జ నిమురుకొనుచు)

ఉ. కారపు వేపుకూరలును, ♦ గమ్మనిపప్పు, రుచించుపచ్చడుల్
చేరలకొద్ది గోఘృతము, ♦ శీతఫలంబులు, పిండివంటలున్
జీరమరీచికల్ చెలఁగు ♦ చేరును, మేల్వడియంబు, లప్పడాల్
సారతరాన్నముం, బెరుగు ♦ సాపడినా మిపు డెంత భాగ్యమో. 71

శృంగా—భోజనముస కేమిగాని, మిత్రమా! రసిక శేఖరుని విషయమున మనకు జయము కలుగునా?

వసం—(బొజ్జ నిమురుకొనుచు) నాకు చాల నాయాసముగ నున్నది. నే నిప్పు డేమి యుం జెప్పఁజాలను. ఒక సోడాబుడ్డి లభించిన బాగుండును.

శృంగా—(నవ్వుచు) అదిగో! 'సోడా' బుడ్లబండి వచ్చుచున్నది. 'సోడా' తీసి కొనుము.

('సోడా'బుడ్ల బండివాఁడు బండితోఁ బ్రవేశించి) రావయ్యా! రావయ్యా! సోడ క్కానికాని, సోడ క్కానికాని కానికాని (అని కేకలు వేయుచుండును.)

(ఉభయులును 'సోడా' తీసికొనిన డబ్బులిచ్చిన పిమ్మట)

శృంగా—ఇప్పు డేమైన కొంచ ముపశాంతి కలిగినదా? నా ప్రశ్నమునకు సమాధానము చెప్పఁగలవా?

వసం—(త్రేన్చి) అమ్మయ్య! ఆయాసము తగ్గినది. ఇంక నాయూహ చెప్పెద వినుము. మనము రసిక శేఖరుని తప్పక బుట్టలో వేయఁగలము. (తలయూచి) ఓ, అభ్యంతరమేమి? ఇంద్రునకు బృహస్పతి వలె నీకు నేను మంత్రినై యుండఁగాఁ గార్యసిద్ధి యగుట కభ్యంతరమేమి? మనమిత్రునికి బాగుగా టోపి వేయుచున్నాము.

శృంగా—అదే మట్లనుచున్నావు? మన మాతనిని బుట్టలోఁ బెట్టితిమా? ఉన్న యథార్థ మంతయు నెప్పటికప్పుడు సూచించుచునే వచ్చితిమి. మన తప్పేమున్నది? ఆతఁడు గ్రహించుకొనలేకుండిన మన మేమి చేయఁగలము?

వసం—మనయందలి విశ్వాస మా ప్రాజ్ఞుని దూర మాలోచింపనిచ్చినది కాదు. ఈ వేశ్యల విషయ మేమి, చెపుమా! మా యట్టి యపండితుల మాట యటుండ నిమ్ము. మీయట్టి విద్వాంసులు గూడ నిట్లగుదు రెందుచేత?

శృంగా—గీ. మోహసంధాయకంబులై ♦ పొలుచు కళల
నృత్త గానాభినయముల ♦ నేర్చి యెంతొ
వంచనక్రియ నిపుణలై ♦ వఱలు కతన
గణికల వలలఁ బడుచుందు ♦ ఘనులు కూడ. 72

వేశ్యాకాంతల జాణతనము మిక్కిలి ప్రోషితమమైనది. వారిని దర్శించిన మాత్ర మున నే చిత్తవైకల్యము కలుగును. వారి చేష్టాచమత్కారాతికముం గనిన నెంతవాఁడైన మోహాంధకారములోఁ బడును. అచ్చటఁ బాండిత్యములు గిండిత్యములు నేమియుఁ బని చేయలేవు. అదిగాక యిప్పటి పురాణపాఠశాలలలో నీతిమతబోధ

లేమింజేసి యీ లౌకికవిద్య నభ్యసించువారు జారత్వము పాపము గాదను స్థితిలో
నికి వచ్చిరి. కాన వీరియందు వేశ్యాప్రియత్వము హెచ్చుచున్నది. దానికేమి తరు
వాతి పనిని జూచుకొందము గాక.

వసం—నేను గర్భదరిద్రుఁడ నగుటచే న స్త్రీ వేశ్యాపిశాచములు సమీపించినను పోఁక
యున్నవి. అది యట్లుండనిమ్ము. ప్రస్తుతకర్తవ్య మేమి ?

శృంగా—పిగ్గుగాఁడేమో చాల గర్వోద్వృత్తులు బల్కుచు మన వేశ్యాలంపటత్వముఁ బరిహా
సించుచున్నాఁడఁట. వానినిగూడఁ బడఁద్రోయవలెను.

వసం—ఓహో ! వయస్యా ! నీవు సంకల్పసిద్ధుఁడవు. ఇతఁడుగో, మిస్టరుపిగ్గు, దొర
వేషముతో దిండిగల్లుచుట్ట కాల్చుచు నిట్లే వచ్చుచున్నాఁడు.

(పిగ్గు దిండిగల్లుచుట్ట కాల్చుచుఁ బ్రవేశించును.)

వసం—మిస్టరు పిగ్గు ! గుడ్ మోర్నింగ్ !

పిగ్గు—(అటుచూచి, నోటినుండి చుట్టతీసి చేతఁబట్టి) అల్లో ! వసంతక శృంగారశేఖ
రులారా ! మేలు, మిమ్ములఁజూడ నానందమైనది. మీరందఱు సేఫ్‌గానున్నారా ?

శృంగా—ఆఁ- క్షేమముగా నున్నాము. ఎచటికి వెళ్ళుచున్నావు ?

పిగ్గు—గమ్యస్థానము లేదు. నేఁడు సెలవుదినము గదా. న్యాయస్థానములు మూసివే
యఁబడినవి. వ్యాపారమేమియు లేదు. ఈ గొడ్డుదేశములో సత్కాలక్షేపమునకుఁ
దగు నవకాశమే లేదు. ఏమియుఁ దోఁచక తిరుగుచున్నాను.

శృంగా—ఇది గొడ్డుదేశ మంటివే. ఆఁగ్లదేశమందు సెలవుదిన మెట్లు గడుపఁ
బడును ?

పిగ్గు—ఓహో ! మహావైభవముతోఁ గడపఁబడును. ఎచ్చటఁ జూచినను నాగరకులు
బ్రహ్మానందరసనిమగ్నులై డాన్సులోఁ ద్రుటీకృతఘటికముగాఁ గాలము గడుపు
చుందురు. ఆ డాన్సుల వైభవముఁ జూచి తీరవలయును. మన పాడుదేశము
'డాన్స' అనిన నేదో యెఱుఁగనే యెఱుఁగదు.

శృంగా—మన దేశమునందును 'డాన్సు' కలదు. దానిని నీవు బాగుగ గుర్తించి
యుండలేదు. దానిని మనవారు నృత్తమనియుఁ దాండవమనియుఁ బిలుతురు.

పిగ్గు—ఏమి, మనలో డాన్సు కలదా ?

శృంగా—నిస్సంశయముగాఁ గలదు.

పిగ్గు—నాకుఁ జూపెదవా ?

శృంగా—తప్పక చూపెదను.

పిగ్గు—ఎచట నున్నది ?

శృంగా—మంగతాయి యను వేశ్య పాశ్చాత్యనృత్తములోఁ జాల పనిచేసినది. నీ వామె యింటికి వచ్చి చూతువేని నేను జూపెదను.

పిగ్గు—తూ! భోగమువాండ్రి యాటయా! అది వట్టి బూటకము. వాళ్ళాడునది డాన్సు కాదు. సుఖరోగబాధచేతఁ గాఁబోలు వాండ్రు కాలు సేతులు దిన్నగఁ గదుపనే లేరు. కీలుబొమ్మలవలెఁ జిటుకుచిటుకున నడుగు లిడుదురు. (అని యాడిచూపి) వీళ్ళాడునది 'డాన్సు' కాదు. నృత్యం- 'డాన్సు' అనఁగాఁ దాండవము. తొల్లి శివుఁడు మున్నగువారు చక్కఁగాఁ దాండవము చేసిరి. ఇప్పుడు మనలో లేదు. భరతశాస్త్రము దీనిని గొంత బోధించుచున్నదఁట. కాని దాని నిప్పు డభ్యసించువారు లేరు. వేశ్యల యభినయ మనిన నాకుఁ దలనొప్పి. పాశ్చాత్యు లెవ్వరును దానిని మెచ్చుకొనరు.

వసం—అభినయ మర్థబోధకము. పాటలోని పదముల యర్థము తెలిసిన గాని హస్తనేత్రాదుల యభినయము బోధపడదు. పాశ్చాత్యులకో, పాట యర్థము కాదు. కావున హస్తాద్యభినయము తెలియదు. అట్టి యజ్ఞుల మెప్పునలేకుండిన నభినయమున కగౌరవము రాదు. దానికేమి గాని, కోయవాం డ్రిప్పటికిని మంచి తాండవమాడుదురు. అదియే కాదా 'డాన్సు'.

పిగ్గు—సరిగ నదే 'డాన్సు'. శ్వేతముఖులు దానిని జాల మెచ్చుకొందురు. అది పాశ్చాత్యుల 'డాన్సు' ను బోలి యుండును.

శృంగా—ఆ తాండవమునే మంగతాయి తాను బాగుగా నేర్చికొని తన సోదరీమణులకు బాగుగ నేర్పినది.

పిగ్గు—'నాన్సెన్సు'. భోగమువాండ్రు 'డాన్సు' చేయలేరు. నీవు విద్యావంతుఁడవై యుండియు భోగమువాండ్రి మరగినావని విన్నాను.

పద్యము.

వేశ్యలందు వలపు చాలు
వేసిమాడెఁ గాగడాలు
లేదు గణిక నీచురాలు
దానిఁ బొందఁ వట్టి ఫూలు
ధనము లిచ్చి తుదకు గూలు
నేడ్చుచుండ నింట నాలు
అటకుఁ జనఁగ రాదు నూ
దానిఁ బొంద వలదు నూ.

వసం—ఆ. వె. ఖ్యాతి, జాతి, నీతి ♦ గంగలోఁ గలుపును
గౌనము, మనము, ధనముఁ ♦ గూలఁ జేయు
నాలి జాలి నోలిఁ ♦ దూలిపోఁ జేయును
పడపుఁబడఁతి పడక ♦ పుడమిఁ దడక. 74

శృంగా—ఇసీ! ఎందుల కీ యధికప్రసంగములు. ఇచట వేశ్యాసంభోగ ప్రశంసలేల? వారిఁ గూడుమని నేఁ దెల్పుట లేదు. మంగతాయి పాశ్చాత్యనృత్తములలోఁ జాల ప్రవీణురాలు. పాశ్చాత్యులు గూడ నామె నృత్తముఁ జూచి మెచ్చుకొని బిరుదములు బతకములు నిచ్చి యున్నారు. ఆమె వర్తన మెట్టిదైన నీకేమి? నృత్తములోఁ బ్రవీణురాలు. నీ కిష్టమైన నానృత్తమును జూడుము.

పిగ్గు—ఏమి, పాశ్చాత్యులు మెచ్చుకొని యామెకు బతకములను నిచ్చిరా?

శృంగా—ఆఁ- ఇచ్చిరి. అవి యామెకడ నున్నవి.

వసం—అవును. ఇచ్చిరి. నే నెఱుఁగుదును.

పిగ్గు—అట్లయిన మన మచటికిఁబోయి యామె 'డాన్సు' చూచి యానందింతము రండు. ఆమె వేశ్యయైన మనకేమి? గిశ్యయైన మనకేమి? తాండవముఁ జూచి వచ్చి వేయుదము.

శృంగా: వసం— ఔనౌను. (అని యందఱు నడుచుచున్నారు.)

శృంగా—(పిగ్గు వైపు తిరిగి) మిత్రమా 'పిగ్గు' అను పేరు బెట్టుకొంటివేమి? ఆంగ్ల నామమే కావలసివచ్చునెడల మంచి యర్థము గల పద మేదియుఁ గాన్పింపలేదా?

పిగ్గు—(నవ్వుచు) నీకుఁ గూడ నీ సందియము కల్గినదా? చెప్పెద వినుము. 'పిగ్గు' అనఁగా పందియని కదా నీ భావము?

శృంగా—అవును.

పిగ్గు—జంతువులలో నెల్ల బలిసి యందముగ నుండునది 'పిగ్గు' కావున నే మనవారు పిల్లలకు నుగ్గుపెట్టి 'నందిలా నడిచి, కుందిలా కూర్చొని, పందిలా పరుగెత్తి' యని యాశీర్వదింతురు. అదిగాక 'పిగ్గు' అను పేరు నాంగ్లేయులు వాడుకొందురు. ఆ చిన్ని పేరు నాకెంతో మనోహరముగా నున్నది. మనలో మాత్ర మిది వాడుకలో లేదా? వరహాలు, వరహాల రాజు అను పేర్లు మనలోఁ గలవు. వరాహ శబ్దమే వరహా యైనది. పూర్వము మనదేశమును బరిపాలించిన చాళుక్యులు వరాహమునే లాంఛనముగాఁ బెట్టుకొనిరి. దానినే తమ బంగారునాణెములపై వేయుట గాఁగ నవి వరహాలైనవి. ఇంతియేల? హిందూదైవమగు విష్ణువు వరాహావతార మెత్తలేదా? మన మిప్పుడు శ్వేతవరాహకల్పములో నుండలేదా? కావున వరాహము ఘనమైన

చిహ్నమే. నా పేరు వరాహనరసింహము కాదా ? ఇప్పుడు పేర్లు సంగ్రహపఱచుకొనుట గలదు. మిస్టరు రావు, మిస్టరు చార్లు మున్నగు నామములు నీవు వినుచునేయున్నావు. నేను వరాహ నామమే కలవాఁడను గాన 'పిగ్గు' అను చిన్న యింగ్లీషు నామము నుంచుకొంటిని. తప్పేమున్నది ?

వసం—అబ్బో, సంస్కృతశబ్దజాలపరిశోధన విషయములో నపరమోక్షమూలరుభట్టాచార్యులైనావే ?

పిగ్గు—కా కేమి ? నా ఆప్షనల్ లాంగ్వేజి సాంస్క్రిట్టే.

శృంగా—నీ యూహలు కాలానుగుణముగానే యున్నవి. తప్పేమియును లేదు. ఇదిగో, మంగతాయి మేడకడకు వచ్చినాము. వసంతకా ! తలుపు దీయింపుము.

పిగ్గు—(టోపీని జేతితోఁ బట్టుకొని, పైకి చూచి) అబ్బా ! ఎంత యెత్తుమేడ!

పద్యము. ఆకస మంటెడు బురుజుల చాల్
పలువురు మెచ్చఁగ నొప్పెడు మేల్
నానావర్ణ విశేషపు శ్రీల్
నయ మెసలారఁగ నిచ్చటఁ గాల్
అంచుల మించెడు లతికల డాల్
పరిశీలించెడు చూపుల నేల్
గని యార్యుల వర్ణింపఁగఁ జాల్
కవి యీ దిక్కున లేఁడనఁ జాల్
సౌధము పైనను నొప్పెడు హోల్
పెద్దనఁ గా దిది హైపర్ బోల్.

వసం—చకోరాక్షీ ! తలుపు తీయుము.

చకో—(తెరలోనుండి) వచ్చె (అని కేక వేయును. తెర యెత్తఁబడును)

## ఎనిమిదవ రంగము.



ప్రదర్శనము:—మంగతాయి చావడి.

[అందఱును లోపలఁ బ్రవేశింతురు]

వసం—మిష్టరు పిగ్గు ! ఈ చావడి చూచితివా ?

పిగ్గు—(ఇటు నటుఁ జూచి) చూచి యున్నాను. చాల మనోహరముగా నున్నది. మంగతాయి యెచ్చట ?

శృంగా—చకోరాక్షీ! మంగతాయి యేమి చేయుచున్నది? నీవు దొరసాని వేషము వేసితివేమి?

చకో—నేడు మాకు మా యక్క యూరపియన్ డాన్సు నేర్పఁబోవుచున్నది కావున నే నీ వేషము వేసితిని. మా యక్కయు నిట్టి డ్రెస్సే వేసికొనుచున్నది. దయచేయుఁడు. ఆమె యిప్పుడే వచ్చును. నేను లోపలకుఁ బోయి మీ రాకఁ దెల్పెదను. (అని లోనికిఁ జనును)

పిగ్గు—(చావడిఁ గలయఁ జూచి) ఈ చావడి వైభవము చాల యింపుగా నున్నది. ఇట్టి 'డెకరేషన్' అనఁగా నలంకారము లండన్‌లోఁ జూచినాను. ఇదిగో, గుమ్మమున కీవల నావల రెండు ప్రక్క లున్నవి. ఈ గోడలకు లౌవ్ పిక్చర్సు అనఁగా కామవిశేషముఁ దెల్పు పటములు తగిలింపఁబడి యున్నవి. నిండు మాలితో నున్న లేడిపై బెబ్బులిపడి గర్భము చీల్చివైవ పిల్ల యూడిపడు చున్నట్లున్న యీ పట మెంత సుందరముగా నున్నది! అదిగో ఆ నడుమ గుండ్రె బల్లపై విస్కీ, బ్రాంది మున్నగు సారాయములుగల బుడ్లు శోభించుచున్నవి. ఈప్రక్కను పియానో యున్నది. ఈ పూలకుండ్లతో మనోహరముగా నున్నవి. ఇవిగో మన చక్రవర్తి కుటుంబపటములు. ఇవిగో యీ ప్రక్క ఘోరయుద్ధ సన్నాహమును దెలుపు పటము లెన్ని యున్నవో! ఆహా, యీ పటము నందలి మరతుపాకి యొక్క ప్రేటుతో నెందఱి యోధులఁ బడఁ గొట్టుచున్నది! ఈ శతఘ్ని సుందరమందిరముల నెన్నిటిని నాశనము చేయుచున్నది. ఓహో, యీ గన్ను దైవాలయమునే భస్మము చేయుచున్నదే! వాడికొమ్ముల యెద్దుల తలలు, సూది కొమ్ముల లేళ్ళ తలలు, దీర్ఘశృంగముల దున్నల తలలు గోడలకు నిటునటుఁ దగిలింపఁబడి యున్నవి. ఈ గుఱ్ఱపు డెక్క పటము సొగసుగ నున్నది. ఆ ప్రక్క డ్రాయరుపై నున్న పాలశిల కాంతుల నీనుచున్నది. ఇదిగో యీ నిలువుటద్ద మెంత సొగసుగ నున్నది! చావడి యంతయుఁ జాల రిఫైన్డుగా నున్నది. మిత్రమా, మంగతాయి వచ్చుట కాలస్య మగునా?

శృంగా—అదిగో, దొరసాని వేషముతో వచ్చుచున్నది.

గీ. వెండి యట్టుల పద్మారి ♦ ఖండ మట్లు
స్వచ్ఛమగుచును దేహము ♦ చ్ఛాయ మిగుల
చారుగీతసాహిత్యావ ♦ తార మగుచు
వచ్చునిదె మంగ యిట కాంగ్ల ♦ వాణి వలెను 76

పిగ్గు—(మంగతాయి వైపు చూచి)

పద్యము.

మంచు కంటె నెన్న వైటు
మించు కంటెఁ జాల బ్రైటు
రూపు చూడఁ జాల క్వైటు
సుందరీ మనోహారీ! సుందరీ మనోహారీ! 77

వసం— పద్యము.

చేయుచుండు నెపుడు ట్రిక్కు
చేష్టలెల్లఁ జాల క్విక్కు
బ్రెయిను జూడ వట్టి బ్రిక్కు
నాతి కాదు క్రోఁతి నూ! నాతి కాదు క్రోఁతి నూ! 78

[మంగతాయి ప్రవేశించును]

మంగ—గుడ్ మోర్నింగ్! (అని మువ్వురతోడను హస్తచాలనము చేయును.)

శృంగా—మంగతాయీ! యైరోపీయవేషము వేసితి వేమి?

మంగ—ఇప్పుడు కులముల లోనికి యూరపియన్ డాన్సు గూడఁ దీసికొని రాఁబడుచున్నది. మా వాండ్రకుఁ గొంతకాలమునుండి యూరపియన్ డాన్సు నేర్పుచున్నాను. అది పరీక్షించుటకై నేఁ డందఱమును నీ దుస్తుల వేసికొని యాడను న్నాము. కొందఱు దొరవేషములను గొందఱు దొరసానివేషములను వేసికొని యున్నారు.

శృంగా—అడఁబోయిన తీర్థ మెదురైనది. (పిగ్గు వైపునకుఁ జూపి) నా మిత్రులు పిగ్గుగారు లండన్ వెళ్ళి ధర్మశాస్త్రములో వ్యావహారిక కాండోత్తమపరీక్ష నిచ్చిన న్యాయవాదులు. ఇచ్చట న్యాయస్థానములలోఁ బని చేయుచున్నారు— వీరికిఁ బాశ్చాత్య వేషభాషలన్నను గ్రీడాదివినోదములన్నను మిక్కిలి మక్కువ. వీరిని మీ పాశ్చాత్యతాండవము చూపుట కిక్కడకుఁ దీసికొని వచ్చినాము. వీరు కూడ మీతో నాడుదురు.

పిగ్గు—సందేహమేమి?

శృంగా—పరిపూర్ణ నవనాగరకుఁడవు. సీమ వెళ్ళి వచ్చినవాఁడవు. నీకు జంకుండునా?

మంగ—మా వాండ్రలో జట్లు యేర్పడిపోయినవి. మీ మిత్రులు వారితోఁ గూడి యాడవచ్చును. రౌండెల్ (Roundel) హే (Hay) ట్రెంచిమోర్ (Trench more) టిగ్గు (Tig) డమ్ప్ (Dump) సెల్లింగర్స్ రౌండు (Sellingor's Round) బ్రాల్ (Brawl) నింబిల్ గాలియర్డు (Nemble Galliard) వార్టి

(Volte) కోరంటా (Coranta) అల్లమండా (Allamanda) అల్మన్ (Alman) కానరీ (Canary)) అను వానిలో నేడాన్సు నొనరింప సెలవు. పిగ్ గారు పశ్చిమదేశము కూడ వెళ్ళివచ్చిన నిపుణులని చెప్పుచున్నారు. వారితో సరిగ నాడఁగలనో లేదో తెలియదు.

శృంగా—ఆ సందేహముతోఁ బనిలేదు. పిగ్ గారూ, మంగతాయి చెప్పిన తాండవములలో నేది యెంచెదరు ?

పిగ్గు—(Allamanda) 'అలమండా' డాన్సు చేయుదము.

వసం—నాతో నాడునది యెవరు ?

మంగ—ఎవ్వరును మిగులలేదు.

వసం—నీ తల్లియును మిగుల లేదా ?

మంగ—ఆమె మిగిలియే యున్నది. ఆమెతోఁ గలిసి యాడెదవా ?

వసం—నీతో నాడుట కంటె నీతల్లితో నాడుట విశేషము కాదా ! కాని యామె డాన్సు చేయఁగలదా ?

మంగ—నీకంటె బాగుగ డాన్సు చేయఁగలదు.

వసం—అల్లైన జట్లన్నియుఁ గుదిరినవి. అందఱు సిద్ధముగ నున్నారా?

మంగ—అందఱు సిద్ధముగ నున్నారు.

వసం—'హరిః ఓమ్' అని ప్రారంభింపుఁడు.

మంగ—ముందుగా జ్ఞానరసము పుచ్చుకొనకుండఁ దాండవ మాడవచ్చునా ?

వసం—(వ్రేలు కఱచుకొని) బుద్ధిలోపము వచ్చినది. ముందుగా రసపానముచేయుటవిధి.

(అని బుడ్డి విప్పి మద్యపానము చేయుచున్నారు.)

వసం—అందఱును బుచ్చుకొనుట యైనది గనుక నిఁక తాఁడవము గావింపుఁడు.

(తాండవప్రదర్శనము జంటుజంటలుగాఁ గూడి యాడుదురు.)

శృంగా—ఆహా !

గీ. తోలుబొమ్మలయాటలోఁ ♦ దోఁచు బొమ్మ
లెట్లు కాళ్లేతు లాడించి ♦ యెగురుచుండు
నటె యీ నృత్తమం దాడు ♦ నట్టి వారు
గంతు లిడి యాడుచున్నారు ♦ వింత తోఁప. 9

వసం—కా కేమి ?

గీ. కాళి నృత్యమట్లు, శివుని ♦ కేళియట్లు
లాహవావని దయ్యంబు ♦ లాడునట్లు
భృంగిరిటపటుతాండవ ♦ విధముగాను
నేఁటి లాస్యంబు చెస్నారు ♦ సాటి లేక. 80

శృంగా—ఈ తాండవము యొక్క హొయలు పాశ్చాత్యులకుఁ దెలియవలెను.

[తెరలో] మంగతాయి యెక్కడ ?

మంగ—(ఆలించి) చంపకగంధీ ! యెవరది ?

[తెరలో] మునిస్వామినాయడుగారు వచ్చుచున్నారు.

(దీర్ఘములగు కఱకు మీసములును, ఎఱ్ఱనిమిడిగుడ్లును, భీకరాకృతియుఁ జేతముద్దును గల మునిస్వామినాయఁడు ప్రవేశించి, తనలో) మంగతాయి యిద్దేసురాలంట. జోరుగా మాట్లాడాలి. (పైకి) మంగతాయి చేయి పట్టుకొని—తాయీ! నీ సేయి జాయగ హోయి సేస్తోంది. (అని చేతి నూపుచు) తాయీ, నీ మొగసెకోరాల్ని నూడాలని నా మొగారయిందం యెప్పుడా ఆసపడుతోంటే ఈయేళది శార్ద్ధమైంది. (తనలో) నేను సెప్పుకున్నది సరిగ్గా సెప్పేనా ? ఆఁ- సరిగ్గా సెప్పేను.

మంగ—నాయఁడుగారు గీర్వాణములు మాట్లాడుచున్నారు.

ముని—(నవ్వుచు) నీవేమో యిద్దేసిరాలవంట. యీ సోకం యేంటో సెప్పు.

శ్లో. తమ చ్ఛమం లచద్దతు వత్తు నామాచ్చర త్తరం
గకారది కకారంతం వట్టుసూ సింతయే బుదహ.

మంగ—ఇది యేభావమో తెలియవచ్చుట లేదు.

శృంగా—(ఆలోచించి) అది యీ క్రిందిది గావచ్చును.

శ్లో. తమస్సమం లసద్వస్తు వస్తునా మాక్షురత్రియం
గకారాది కకారాంతం పట్సమా శ్చింతయేద్బుధః.

పిగ్గు—మూడక్షరముల పదమా ? గకార మాదిని కకార మంతమందును గలదా ? చీఁకటితో సమమైనది. మఱల మనోహరమైనదా ? అది యేది చెప్పుమా !

వసం—ఆ- తెలిసినది- తెలిసినది. గణిక-గణిక.

మంగ—(విదూషకుని జూచి) గణిక చీఁకటితో సమమా ? నిన్నింత కన్నుగానని స్థితి లోనికిఁ దెచ్చినదా ? (అని నవ్వుచున్నది.)

వసం—దమ్మిడీ లేనివానిని నన్నేమి చేయఁగలదు ? ఆ చీఁకటిలోఁ బడిన మహనీయులను (శృంగారశేఖరాదుల వైపు చూపుచు) కన్ను మిన్నుఁ గాననీయదు.

మంగ—ఆ విద్వాంసుఁడు ప్రశ్న యిచ్చుటయు నీ విద్వాంసుఁడు సమాధానము చెప్పుటయు సరిపోయినవి. అంధకారసమమైనది యువకుని మోహము గాని వేశ్య కాదు. ఇది పాండిత్యము తెలిసికొనెడి మార్గమా ? (తనలో) ఈ మోటువాఁడు మిక్కుటముగఁ జుక్క వేసి యున్నాఁడు. ఏమి యల్లరి చేయునో !

[తెరలో] వేరీజ్ మంగతాయీ ? (Where is Mongathayee)

మంగ—చంపకగంధీ ! వారెవరు ?

[తెరలో] హాగ్ దొరవారు వచ్చుచున్నారు.

శృంగా—ఓహో! అరతుకభటాధ్యక్షులగు హాగ్ దొరవారా ?

హాగ్—(ప్రవేశించి) ఏమీ యీ వేసములు ? (అని మంగతాయి చేయి పట్టుకొని యూపును.)

మంగ—మేము వినోదార్థమై మీ డాన్సు చేయుచున్నాము.

హాగ్—సంతోసము. నేను నీతో ఆడ్తాను.

మునిస్వా—పెనిగాడి లాగ యీడొచ్చాడా ? (అని వెళ్ళిపోవును.)

పిగ్గు—ఆమెతో నే నాడుచున్నాను.

హాగ్—(కోపముతో) యూ ఫూల్ డోంటాక్ !

పిగ్గు—(కోపముతో)యూ స్టుపిడ్ హోల్డు యువర్ టంగ్.

(ఇద్దఱు తన్నుకొనుచున్నారు.)

వసం—ఓహో !

ద్విపద. శునకంబు లొకరెండు ♦ శునినిమిత్తముగ
పనిఁగొని కాట్లాడు ♦ భంగినిగాఁనె
సుందసోదరు లొక్క ♦ సుందరి కొఱకు
పొందేది మూఢతఁ ♦ బోరిన యట్లు
వీర లీ యెడను వి ♦ వేకహీనతను
వారికై పోట్లాట ♦ నడుపుచున్నారు. 84

ఈ ద్వంద్వయుద్ధోపశమన మెట్లగునో !

హాగ్—(పోరుడిగి, తనలో) దిస్ రెచ్చి సీమ్సు టు బి మోర్ దాన్ ఎ మేచ్ టుమి. (పైకి) బ్రదర్, లెట్ దేర్ బి నో క్వారల్ బిట్వీనస్. లెటస్ ఆల్ సెపరేట్లీ డాన్స్.

పిగ్గు—(నవ్వుచు) దొరగా రందఱమును వేఱువేఱుగా నాడుదమనుచున్నారు. వారని నట్లగుగాక. (అందఱు వేఱువేఱుగ నాడుదురు.)

శృంగా—పిగ్గుగారూ! మీ కీతాండవ మెట్లున్నది?

పిగ్గు—మిత్రమా, శృంగారశేఖరా, తాండవము నాకుఁ జాల ప్లెజర్ గలిగించినది. నేను మంగతాయి హైందవనృత్యమందే జాణ యనుకొంటిని గాని, పరిపూర్ణనాగరకత గల పాశ్చాత్యుల తాండవమందును విచక్షణురాలని యెఱుంగక నీతో మొదట నిరసనపుమాటలు పలికితిని క్షమింపుము. నే నిప్పుడు హోమ్‌లో నున్నట్లే ప్లీజ్ అయెను. నీకు థాంక్సు (మంగతాయి నుద్దేశించి) మంగతాయీ, నీ వీ పురమణివి. యు ఆర్ ది జమ్ ఆఫ్ దిస్ టౌన్. చక్కని తాండవము గావించితివి. మెచ్చితిని. (అని జేబులోనుండి నూఱురూపాయల కాగితముఁ దీసి) పుచ్చుకో (అని మంగతాయి కిచ్చును.)

మంగ—(కాగితము పుచ్చుకొని) నన్ను ధన్యురాలిఁ జేసితిరి. పునర్దర్శన మగుగాక.

పిగ్గు—నీ ప్రజ్ఞనంతను బరిపూర్ణముగఁ జూడవలెనని యే నామన సభిలషించుచున్నది. అవకాశ మున్నప్పుడెల్ల నే నిచటికి వచ్చి నీ సహవాససుఖ మనుభవించెదను. ఇప్పటికిఁ బోయి వచ్చెదను. (అని చేయి పట్టుకొని యూచి, దొరవారిని చూచి) ఆర్ యు ప్లీజ్డ్ ?

హాగ్—యస్. ప్లెసెన్లీ.

పిగ్గు—వాట్ బ్రాట్ యూ హియర్ ప్లీజ్ ?

హాగ్—(కొంతసే పాలోచించి) ఆల్ సార్ట్స్ ఆఫ్ క్రైమ్సు ఈవెన్ మర్డర్సు ఆర్ కమిటెడ్ ఇన్ దీజ్ పార్ట్స్. సొ వుయ్ ఫ్రిక్వెంట్లీ విజిట్ దీజ్ ప్లేసెస్ లెటస్ గో. (అని యిద్దఱును వెళ్ళిపోవుచున్నారు.)

శృంగా—మంగతాయీ, ఈకార్యములోఁ గూడ నాకు విజయము కలిగించినావు. ఇఁక రాఁబోవునది యన్నిటిని మించిన దుర్ఘటకార్యము. అది నీకే తెలియును. నే చెప్పినట్లు చేసితివా ?

మంగ—తగు నేర్పాటులఁ జేసినాను.

శృంగా—వసంతకా, మనము పురములోనికిఁ బోయి తక్కిన పనిని బూర్తి చేయుదము రమ్ము.

వసం—అదేమో నాకుఁ దెలియదు. నీ వేది చెప్పిన నది చేయుదును. రమ్ము. కటకటా! వేశ్యాగృహము లెంతకశ్మలములు. హద్దులేదు.

గీ. త్రాగుసాలయు జూదంపు+తావు, పతిత, కొట్టుపాకయు, వెలయాలి+కొంప, రంగ
పుజనముల బసయును, వంట+ పూటి యిల్లు, సర్వవిధజడసందోహ + సంకులములు.

(అని వసంతకశృంగారశేఖరు లిరలకు నత్తురు. తెర వ్రాలును.)

# తొమ్మిదవ రంగము.

---

రాజవీధి.

[ప్రవేశము: వసంతక శృంగారశేఖరులు.]

వసం—శృంగారశేఖరా, మనము చేయవలసిన పని యేమి ?

శృంగా—మనము చేయవలసిన కార్యములలో మిక్కిలి దుర్ఘటమేదో యది మిగిలినది. నీ నేర్పెట్లు చూపెదవో ?

వసం—అది యేది ?

శృంగా—మన మిఁక కలికాలమహర్షి గారిని సంఘసంస్కారప్రియతండమునంతను మంగతాయి యింటికిఁ దీసికొని రావలెను.

వసం—(ఆశ్చర్యముతో) అది యసంభవ మసంభవము. కలికాలమహర్షి గారిని సంఘసంస్కార ప్రియతండము నంతను నీ వెన్నఁడును భోగముదాని యింటికిఁ దీసికొని రాఁజాలవు. కలికాలమహర్షి భోగము దాని మాటఁ దలపెట్టిన 'అగ్గిఫైర్' అయి పోవును. ఇందులో నీ కపజయము తప్పదు.

శృంగా—(నవ్వుచు) అట్లాగునా ! చూడు! నేఁ డాసంఘసంస్కారప్రియతండముఁ దత్ప్రకాండసహితముగాఁ బణ్యాండజయానామండపమునఁ దాండవ మాడునట్లు చేసెదను.

వసం—(ఆశ్చర్యముతో) అదెట్లు మిత్రమా ?

శృంగా—రసికశేఖరుఁడు మంగతాయి యింటికి వచ్చుననియు, నాతఁడు నీతిబోధ చేయఁదలఁచిన సంగతియు, నవి వేశ్యలు వినఁదలఁచిన సంగతియు నీ వెఱుఁగుదువు కదా. ఇదియే మనకుఁ బాశుపతాస్త్రము.

వసం—అదెట్లు ?

శృంగా—రసికశేఖరునిచే వేశ్యలు తమ వృత్తిని వదలుకొని వివాహములాడి కులాంగనలు కావలెనని యుపన్యాస మిప్పింతుముగదా !

వసం—అవును. అయిన నేమి లాభము ? కలికాలమహర్షి యెట్లు వచ్చును ?

శృంగా—తొందరపడకుము. రసికశేఖరుని యుపన్యాసరాజమును విని, పరిపక్వహృదయులైనట్లు నటించి, వేశ్యలు పుల్లి యను గణికకు వివాహము తలపెట్టుదురు. పుల్లికి రూపము కురూపము. స్వరము గార్దభస్వరము. కావున గణికగానుండిన జీవయాత్రను దిన్నఁగఁ గడుపుకొనఁ జాలదు. నృత్య మెంతకాలము నేర్పినను వచ్చినది కాదు. పాట పట్టుబడ లేదు. ఆ హేతువుచే దానికిఁ బెండ్లి చేయఁబడును. ఇది

యిదివఱకుఁ జేసికొనిన నిశ్చయమే. దాని నిప్పుడు సంఘసంస్కారప్రియుల బోధల ఫలమైనట్లుగా వేశ్యలు నటించి యీ పెండ్లి యుపన్యాసాంతమున నేఁడు గావింతురు. ఇది యపూర్వవేశ్యారజస్వలావివాహము కావునను, నది తమబోధల ఫలమను భ్రమ యుండును గావునను, గలికాలమహర్షి సహితముగా సంఘసంస్కారప్రియులు తండోపతండములుగా విద్యార్థుల వెంటఁ బెట్టుకొని వత్తురు. ఈ వివాహము మంగతాయి యింటఁ గావింపఁబడును.

వసం—మేలు! నాగరకశేఖరా! మేలు! నీ యూహ మిక్కిలి లోఁతైనది. విజయప్రదమై ప్రకాశించుచున్నది. ఎంత యూహ చేసితివి! ఈ కర్చంతయు మంగతాయి పెట్టుకొనఁనా?

శృంగా—వెఱ్ఱివాఁడా! మంగతాయి కిది యొక ధనాకర్షణోపాయము. యువకుల కందఱకు నాహ్వానములఁ బంపి, కర్చు లేని స్వంతమేళములఁ బెట్టును. వందలు, వేలు, కట్నములు వచ్చి కురియును.

వసం—బాగు! బాగు! ఏమి యుపాయ మేమి యుపాయము! ఇప్పుడు నేఁ జేయవలసిన పని యేమి?

శృంగా—నీవు రసికశేఖరుని యొద్దకుఁ బోయి పురమందిరమున నేఁడు మా యుపన్యాస మను ప్రకటనము గావింపఁబడిన దనియు, నీవు తత్క్షణము బయలువెడలి మంగతాయి గృహమునకు రావలసినదనియుఁ జెప్పి యాతనిని దీసికొని రమ్ము.

వసం—మంచిది. (అని పోవుచున్నాఁడు.)

శృంగా—(తనలో) ఏజన్మ మెట్లు వెళ్ళవలెనో యెవ్వరికిని దెలియదు. కళానాథపరీక్ష నిచ్చితిని, శాస్త్రములఁ గఱచితిని. పెద్దల సహవాసము నందితిని. నీతుల నేర్చితిని. హృదయమునకుఁ గావలసిన సంస్కారము లన్నియు నైనవి. గురువులు సంఘసంస్కారప్రియాగ్రగణ్యులు. సదా ధర్మబోధఁ గావించిరి. సదా నీతులు గ్రుమ్మరించి నీతిబోధకుఁ డనిపించుకొంటిని. అట్టివాఁడను నేను, శుక్లపక్షక్షపాకరునివలె దినదినాభివృద్ధి నొంది, కువలయానందకరుఁడను గళానిధిని నగుటకు మాయగ్రహచారవశమున వేశ్యాదినామక పాపగ్రహ పీడితుండనై కళాహీనుఁడనై, కాంతి తఱిగి యుండు కళానిధినై లోకమునకు వింతను బుట్టించుచున్నాను. జీవుని బాగుచేయునది యేది చెప్పుమా! సన్మిత్రులు, సద్గ్రంథపఠనము, సద్విద్యాస్వీకారము, అన్నియు నాకుఁ బూర్తిగాఁ గలవు, కాని మోహపాశముచే నీడ్చివేయఁబడుచున్నాను. అహా! పూర్వకర్మనిశ్చయముగాఁబోలు. లోకమాయ. (అని యిటునటుఁ జూచి) అదిగో! రసికశేఖరసహితముగా వసంతకుఁడు వచ్చుచున్నాఁడు.

[వసంతక రసిక శేఖరులు ప్రవేశింతురు.]

రసిక—వసంతకా, మనము ధర్మోపన్యాసముల నిచ్చి వేశ్యల బాగుచేయ లేమా ?

వసం—మీయట్టి పండితులకు స్వాధీనము కానిదేది ? యుష్మన్మనోభవ సంకల్పము లకు విజయము కలిగి తీరునని నా నమ్మకము. అదిగో, శృంగారశేఖరుఁడు. పోయి కలిసికొందము.

రసిక—(అటుపోవుచు, తనలో) నామనస్సు తాయిపయి లగ్నమగుచున్నదే; కొంప మునుఁగదు గద ? ఊఁ— ఏమియు హాని లేదు. ఆమె కళాకౌశలమును ముఖపరిచ యమును స్నేహభావమును గూర్చుచున్నవి. ఆ పావన స్నేహసద్భావము చేతనే నా దృఢమన స్సామెపయిఁ జనువును వహించుచున్నది. ఇందేమి హాని యున్నది ! (అనుకొనుచు నడచుచున్నాఁడు)

శృంగా—మిత్రులారా, ఇంత యాలస్యము చేసితిరేమి ? మంగతాయి ధర్మోపన్యాస మునకుఁ దగుసేర్పాటుల నన్నిటిని జేయుచున్నది. ఆమెతో ముందుగ మాట్లాడి యామె మనస్సునకుఁ దృప్తిని గలిగించినఁ గార్యసిద్ధి కాఁగలదు. అచటికిఁ బోవుద మురండు. ఇటు. ఇటు. (అందఱును బోవుచున్నారు.)

తెర యెత్తఁబడును.

పదవ రంగము.

---

[మంగతాయి పడకగది.]

శృంగా—ఇదిగో, మంగతాయి గృహమునకు వచ్చినాము. లోపలికిఁ బోవుదము రండు. ఇదిగో, మంగతాయి! మంగతాయీ, రసికశేఖరుఁడుగారు వచ్చినారు.

మంగ—దయచేయుఁడు. దయచేయుఁడు. ఈ మందిరమునకు దయచేయుఁడు.

రసిక—(తనలో) ఈమె క్రొత్తవేషము మనోహరముగా నున్నది.

గీ. కనులు నీలోత్పలములు, ము • ఖమ్ము తమ్మి
రదనములు కుందములు, మోవి • రక్తకాంతి
చెన్నునందు నశోకంబు, • చేడె పుష్ప
తామ్రి, మతను తూణీర మీ • యతివ చూడ. 84

మఱియు,

గీ. జిలుఁగుపావడ హొంబట్టు • కలువపూలఁ
దనరు చీనాంబరమ్ము పట్టు • నసల హైక

యుళ్ళరుదండలు మణిభూష • లదరు నీమోఁ
గాంచినంతనె కన్నుల • కఱవు తీరె. 85

కటకటా! నా మనస్సు నన్ను వంచించి తాయి మీఁదికిఁ బరువు లిడుచున్నది. నన్ను వంచించిన దననేల? నిక్కమగు సౌందర్యముం దిలకించినప్పుడు మనస్సు మెచ్చుకొనుట యుక్తమే గదా! సౌందర్యమును గని యానందింపని మనస్సు మనస్సే కాదు. ఆమె సౌందర్యమును దెలివితేటలును జూచినకొలఁది నా మనస్సామె యందు స్నేహాతిశయ మందుచున్నది. దాన హాని యేమున్నది? అయినను నతి పరిచయము కూడదు. అది మోహాంధతను గలిగించినఁ గలిగింపవచ్చును. (ప్రకాశముగా) పడకగదిలోనికా? (అని జంకి నిలువఁబడుచున్నాఁడు.)

వసం—చీటికి మాటికి జంకుచుందువేమి? గదిలోనికి వచ్చుటకు గర్భాదానపుఁ బెండ్లికూఁతు వలె వగలు మిగులఁ జూపుచున్నావు. శుకతుల్యుండవగు నీకీ జంకేల? ఎచటికిఁ బోయిన నీ జితేంద్రియత్వమునకు భంగము వచ్చును? నీవు వేశ్యాగృహాంతరముఁ జూడకున్న వారి రహస్యము లెట్లు బోధపడును? అదిగాక మీ ధర్మోపన్యాసము సఫలమ్ము సేయుటకయి తాయి యుద్యమించుచున్నది. ఆ విషయమయి కొంత రహస్యాలోచనను చేయవలసి యున్నది. అది యితర వేశ్యలకుఁ దెలిసిన నుద్యమమునకు భంగము కలుగును. కాన నీ రహస్యస్థల మేర్పాటు చేయఁబడినది. రా. (అని చేయి పట్టుకొని లాగుచున్నాఁడు.)

రసిక—(రహస్యముగా) ఆచెత్తతొత్తు నన్ను మోహాబ్ధిలోఁ బడఁద్రోయు నను జంకు నాకుఁ గలదని తలంపకుము. (అని కూడఁ జనుచున్నాఁడు.)

[అందఱును గదిలోఁ బ్రవేశింతురు.]

రసిక—(గది కలయఁ జూచి) ఏమి రామణీయక మేమి రామణీయకము. ఒకదాని నొకటి మించిపోవుచున్నదే! ఇది సాక్షాల్లక్ష్మి కాటుపట్టు వలెఁ గాన్పించుచున్నది. (మంచముకడకుఁ బోయి చూచి) ఏమీ! ఈ బంగరు మంచమునకుఁ గట్టినది మంచిముత్యముల జాలరా?

వసం—అవును. నాగపూడి సంస్థానాధిపతిగా రీమె ముత్తవ్వకు కట్టించి యిచ్చినారు.

రసిక—ఈ పట్టు తన్నుపరుపుల రత్నఖచిత కాంచన శయనాసనము చాల మనోహరముగా నున్నది.

వసం—ఈ సోఫాను నాగవరపు జమీందారుగారు చేయించి యీమె మాత కిచ్చిరి.

రసిక—ఓహో! నిలువుటద్దములు. ఇంత పెద్దయద్దములనే నెచ్చటను జూచలేదు.

వసం—కాల్హూర్ సంస్థానాధిపతిగారు వానిని దెప్పించి యీమె యవ్వమ్మ కిచ్చిరి.

రసిక—ఓహో, బహు సంస్థానాధిపతుల నిజరూపపటము లిందున్న వే!

వసం—వారి పటములే గాదు. వారి నిజరూపములే యిందుఁ దాండవమాడినవి.

మంగ—దయచేయుఁడు. మనకుఁ గార్యక్రమము చాల కలదు.

వసం—శృంగారశేఖరా! ఈగది యందుఁ గల రెండు కుర్చీలమీఁదను మనము కూర్చుందము. రసికశేఖరుఁడును మంగతాయియు నా సోఫాపైఁ గూర్చుందురు. ఇంక వేఱుగ నాసనములు లేవు.

శృంగా—అట్లే చేయుదము. (అని యిద్దఱును గూర్చుందురు.)

రసిక—(తనలో) కూర్చుండుటకే నా మనస్సు పురికొల్పుచున్నది. (పైకి) శయనాసనముపై నెందుకు? నాకొక పీఠము లేదా?

శృంగా—ఈ గదియందు రత్నఖచితములగు వస్తువులు తప్ప తదితరములగు వస్తువు లుండఁగూడదని యేర్పాటు కలదు. కాన సామాన్యాసనము లిందు లేవు. తప్పేమి? నీ వచటఁ గూర్చుండుము.

వసం—ఇందు రత్నఖచితములగు వస్తువులే కాని యుండవు. మీ రా శయనాసనముపై దయచేయుఁడు. దీనిలో నేమి యున్నది? అదియుఁ గుర్చీ వంటి యాసనమే. మనస్సు మంచిదైనప్పుడు యువతులఁ బడకగదిలోఁ బరుండఁ బెట్టుకొనవచ్చును. ఏకాసనమునఁ గూర్చుండఁ బెట్టుకొనవచ్చును. దానిలోఁ దప్పేమియు లేదు. పెద్దలట్లు చేయుచునే యున్నారు. మనసు పదిలమైనచో లంజెపొందుగునఁ గాపురము సేయవచ్చునను సామితె వినలేదా!

(రసికశేఖరుఁడు సందేహించుచున్నాఁడు.)

మంగ—వారికి సందేహముగా నున్నట్లున్నది. నేను గ్రిందఁ గూరుచుండెదను. (అని క్రిందఁ గూరుచుండఁబోవుచున్నది.)

శృంగా—సందేహ మెందుకు?

రసిక—గురువుల సెలవయినది గావ నిఁక సందియ మక్కఱలేదు. (అని శయనాసనముపై మంగతాయితోఁ గూర్చుండును.)

వసం—(తనలో) మన నీతిబోధకులు తుదకుఁ బడకగదిలో నుండతో నేకశయ్యాసను లైరి. కాముని యద్భుతశక్తి వర్ణనీయముగదా! (అని శృంగారశేఖరుని వైపు చూచి నవ్వుచున్నాఁడు.)

మంగ—ఇందున్న యమూల్య వస్తుజాలమున్నియు మా తల్లియు నవ్వలును గడించిరి. వారల సామర్థ్య మద్భుతమైనది. ఈ కాలములో వారు సంపాదించిన సంపాదనము లలో సహస్రాంశమైన నేను సంపాదింపలేకపోయినాను.

శృంగా—నీవు యశోధనము గడించితివి.

వసం—నీవు విద్యాధనమును, యశోధనమును విశేషముగా గడించి యున్నావు. వీని ముందర ధనసంగ్రహ మెంతటిది ?

శృంగా—నీతిధనమో, దానిని విశేషముగా నీమె గడించినది. అన్నిటిని మించినది నీతి ధనము.

వసం—(తనలో) వెలనాతికి నీతియఁట. తన్నాశ్రయించిన కులటలఁగూడ నీతఁడు మహాపతివ్రత లనును. తన్నాశ్రయింప కుండిన మహాపతివ్రతలఁ గూడ లంజెలని నిం దించును. (పైకి) ధనసంపాదనమునను నీమె తరువాయిలేదు. ఉద్యానసహితమగు నీదివ్యభవన మీమె నీవలన సంపాదింప లేదా ?

మంగ—మా సంపాదనముల మాటకేమి ! (రసికశేఖరునిం గని) ఆర్యవర్యా, మీరు మా కులముంగూర్చి యేమో ముచ్చటించెదమని యిదివఱలో సెలవిచ్చియున్నారు. అదేమి ?

రసిక—మీ వేశ్యావృత్తి హేయమైనదని నీవే యంగీకరించితివిగదా ? దానిని మీ రెల్ల రును వదలుకొని పెండ్లిచేసికొనరాదా ?

మంగ—(తనలో) ఈయన పెద్దవాదమునకే దిగుచున్నాఁడు. ఊపి చూచెదఁగాక. (పైకి) అయ్యా, అది మా కులవృత్తి. ఎవరికులవృత్తిలో వారుండఁదగినదేకదా ! ప్రస్తుతమునఁ జెడియున్న వేశ్యలవృత్తిని హేయమంటి నే కాని శాస్త్రవిహితవృత్తిని నేను నిందింప లేదు. అది సరికాదని మీరు ఋజువుచేయుచో మాలో వివాహ ములఁ దప్పక నేర్పాటు చేయించెదను.

వసం—"కం. ఇల విద్య లెన్నియేనియుఁ, గులవిద్యకు సాటి రావు గువ్వల చెన్నా" అన్నాఁడయ్యా.

రసిక—ఎవరి కులవృత్తిలో వా రుండఁ దగినదే. కాని యా కులవృత్తి యోగ్యమైనది కావలెను.

మంగ—అవు నదీ సత్యమే. కాని శాస్త్రవిహితరీతిగా నడచుకొనిన మా వృత్తియు యోగ్యమైనదే.

రసిక—దేహ మమ్ముకొనువృత్తి యోగ్యమైన దెట్లు కాఁగలదు ?

మంగ—పండితవర్యా, మా కులజులందఱి వర్తనమును నేను గాపాడ నెంచుచున్నా నని భ్రమపడ వలదు. శాస్త్రవిహితమైన మా వృత్తి యోగ్యమైన దేలకాదో తెలుపఁ గోరెదను వేశ్యలెల్లరును దేహము నమ్ముకొందు రనుట ధర్మము కాదు. అదట్లుండ నిండు. వాదము నిమిత్తము మీరు చెప్పినదే న్యాయమని నమ్మెదము. అయినను

దేహ మమ్ముకొను వృత్తులన్నియు నింద్యములుగా నెన్నఁబడుచున్నవా ?

రసిక—సందేహమేమి ?

మంగ—ఉద్యోగములని మీరు పిలిచి గౌరవించు వృత్తులు దేహము నమ్ముకొనుటలు కావా ?

ఆ. నెలకు జీతమిచ్చు • నేతఁ గొల్వఁగ వలె, పలుక వలను కాదు • తలఁచినట్లు
తలఁప వలను కాదు • వలసిన రీతిగా, దేశసేవ చేయఁ • దెన్ను లేదు,
స్వేచ్ఛ యుండఁ బోదు • సేవలత్యధిక ము, ద్యోగయోగ మిట్టి • యోగ్యమహహ.

రసిక—ఉద్యోగములోఁ బరులను మోసము చేయుట లేదు. మీవృత్తి యన్ననో పరవంచనమే ప్రధానముగాఁ గలది.

మంగ—మీరు సరిగ సెలవిచ్చి యుండలేదు. మా వృత్తియును బరవంచనమే ప్రధానముగాఁ గలిగినది కాదు. లోకములో నధర్మ మెక్కుడగుటచే మొత్తముమీఁద నన్నివృత్తులును బరవంచన ప్రధానము లగుచున్నవి.

రసిక—వృత్తులన్నియు నట్టివియా ?

మంగ—ఏల కావు ? పరికించి చూడుఁడు. న్యాయవాది వృత్తిం దీసికొనుఁడు. వీరిలో యోగ్యులు లేకపోలేదు గాని మొత్తముమీఁద

గీ. తేని కక్షులఁ జెక్కుంటి • లెక్క పెట్టి, చేతి సొమ్ములఁ మెల్లగాఁ • జిక్కఁబట్టి
తతికి దరిలేకయునువాడు • తగులఁబెట్టి, ప్రజల మోసగింతురు న్యాయ•వాదులిలను.

వసం—బాగుగఁ జెప్పినావు. వేశ్యలును గుత్సితన్యాయవాదులును నొక్కటియే.

గీ. వేషభాషలచే మోహ • పెట్టి తమ్ముఁ, జేరినంతన వేలాగి • చేతి సొమ్ము
ధర్మగృహమేగఁ గడతేరు•దారి చూపు, దురగణికలును న్యాయవా•దులును బ్రజకు.

మంగ—కోర్టులకుఁ బోవువారు మాత్రము బాగుపడుచున్నారా ? ఆవేశపరు లచటికిఁ జనినను జోగులగుచునే యున్నారు.

వసం—అవునది నిజమే.

సీ. కోర్టులెక్కఁగ బిళ్ళ • కోర్కెఁదెల్పఁగ బిళ్ళ, మనవి చేయఁగ బిళ్ళ • మాస్పబిళ్ళ
సాక్షిపట్టిక బిళ్ళ • సాగింప నదిబిళ్ళ, మొత్తమీయఁగ బిళ్ళ • ముట్టు బిళ్ళ
ప్రతులు వ్రాయఁగ బిళ్ళ • ప్రతులు దీయఁగ బిళ్ళ, ప్రతులు వేయఁగబిళ్ళ•పట్టబిళ్ల
వాదింపఁగా బిళ్ళ • వారంటునకు బిళ్ళ, తీర్పు సంపాదింపఁ • దివ్వర బిళ్ళ

గీ. ఇన్ని బిళ్ళల బాధల • నేపు చెడిన, వారి వేధింపఁ గక్షుల • పార మింక
కోర్టులెక్కెడు మూర్ఖుల • కొంపమున్గు, వేశ్యవాటికఁ జేరిన • విటుల యట్లు. 29

మంగ—ఇంక వణిజులమాట చూచుకొందము. వీరిలోను యోగ్యులు లేకపోలేదు.

కాని మొత్తముమీఁద మోసము హెచ్చు.

గీ. వల్లపెసలను మినుముల ♦ నెల్లఁ జేర్చి, నేతిలోపల నూనియు ♦ నింపి పైచి
లేనిధరఁ జెప్పి నమ్మిన ♦ వానిఁ జెఱచు, వారలే కాక పరికింప ♦ వణిజులహహా.

వసం—అవును. మొత్తముమీఁద వణిజులును మోసగాండ్రే.

సీ. బావగారూ! యని ♦ వావులఁ బుట్టించి, లేని మమతను ♦ గల్పించి పెట్టి
నమ్మిక క్రమముగా ♦ నెమ్మదిఁ గలిగించి, తులలేని గౌరవ ♦ మెలమిఁ జూపి
బెల్లంపుపలుకుల ♦ మెల్లఁగాఁ దగిలించి, మొదటఁ బైకమ్మును ♦ బొసఁగ డించి
పద్దును హద్దునుఁ ♦ బాడఱఁగాఁ జేసి, జాణతనంబును ♦ జాల చూపి
గీ. ముల్లెయంతయుఁ జెల్లుగాఁ ♦ గొల్లగొట్టి, మాన్యముల నెల్ల నమ్మించి ♦ మాయచేసి
సాధ్యమైనంత త్వరలోన ♦ సాగనంపి, వేయుదురు గాదె వణిజులు ♦ వేశ్యలట్లు. 91

మంగ—లోకములో మోసము చేయనివా రెవరు? వారి వీరి మాట యెందుకు? గురు
నామధారులై లోకములోఁ బూజల నందుచున్నవారు గూడ జగద్వంచనము చే
యువారుగా నున్నారు.

శృంగా—అదియు నిజమే.

గీ. శిష్యవిత్తాపహరణంబు ♦ చేయఁగల్గు, గురులు పల్వురు గలరు సూ ♦ ధరణియందు
[illegible] మాయబోధలఁ గావింతుర ♦ మమత విడరు, చిత్తహరణంబుఁ గావించి ♦ చెలఁగలేరు.

వసం—కటకటా! ఇప్పటి విద్యాబోధలయొక్క విశేషములు చెప్పనలవి కావు.

సీ. పితరులపై భక్తి ♦ పెద్దలపై రక్తి, మతమునం దాసక్తిఁ ♦ మంటఁ గలుపు
పరసద్గుణాయుక్తి ♦ సాత్వికం బగు భుక్తి, జపమంత్ర జయశక్తి ♦ నపహరించు
సదసద్వరవ్యక్తి ♦ సదమలతరసూక్తి, జన్మభూమ్యనురక్తి ♦ సడలఁజేయు
దేశవస్తువిరక్తి ♦ తెచ్చుఁ దప్పక ముక్తి, యను మాట వేదోక్తి ♦ యనఁగఁ జేయు
గీ. నేఁటి గురువులు బడులలో ♦ నేర్పు చదువు
పాఠవేతనములు చాల ♦ బహుళ మగుట
నిల్లు నొడలును జెల్లుగా ♦ గుల్ల చేయు
కుటిలపణ్యాంగనాజనఁ ♦ గూట మట్లు. 98

శృంగా—ఇప్పటి చదువులు దేశవిద్వేషకరములుగా నున్నవని ప్రాజ్ఞులే చెప్పు
చున్నారు.

ఉ. పూర్వులు సంగ్రహించి హిత ♦ పూర్వమొసంగిన విత్తమాన్యముల్
సర్వముఁ శూన్యతం గనుమ ♦ జాఱును నాయువు నీతి మానముల్

పర్వను దాస్యమందు ఘన ♦ భావము సద్గుణ మారిపోవు, నీ
యుర్వర నేత్రబళ్ళ చదు ♦ వొప్పఁగ మోసమొనర్చ దెవ్వరిక్. 94

మంగ—న్యాయముచేఁ జూచిన మోసము లేని వ్యాపారమే గాన్పించుట లేదు. ఇప్పటి వైద్యుల చర్యలం జిత్తగింపుఁడు.

శృంగా—అవు నవును.

సీ. ముగ్గు రజితభస్మ ♦ ము మతి ముత్తెపుభస్మ, మనుచు మోసముచేసి ♦ ధనములాగు
రసవిమగంధక ♦ ద్రవ్యంబులను బెట్టి, దేహామంతయును శి ♦ థిలము చేయు
లేని రోగము చెప్పి ♦ దీనులఁ గావించి, క్రొత్త మందుల కంచు ♦ విత్తముఁ గొను
వేషభాషలఁ జూపి ♦ భైషజ్యమును బెంచి, రోక్కమ్ము గుంజును ♦ వెక్కగతుల

గీ. నరసి చూడఁగ వేశ్యల ♦ యట్లుగాదె
కుటిలుఁడై యుండు వైద్యుఁడు ♦ గూడ చాల
మోసమును జేసి తుదకెంతో ♦ ముప్పుఁదెచ్చి
పెట్టుచుండును హెచ్చుగా ♦ పృథ్వియందు. 95

మంగ—వెక్కేల, లోకమునం గల వృత్తులన్నియు మోసముతో నిండియున్నవి. ఏవృత్తియైనను నయోగ్యుల పాలఁబడిన మోసమున కాలవాల మగును. యోగ్యుల పాలం బడిన మంచి కనుకూలించును.

రసిక—నీ చెప్పిన న్యాయవాదులు మున్నగువారిలో నయోగ్యత గలవారి వలనఁ గదా హాని కలదంటివి ? యోగ్యులవలన లేదు గద ?

మంగ—యోగ్యులవలన లేదని నేను మొదటినుండియుఁ జెప్పుచునే యున్నాను. మాలో యోగ్యత గలవారివలన మాత్రము హానికలదా ?

రసిక—మంగతాయి, మీవారి యందు యోగ్యత కూడఁ గలదా ? మీ వారి మోహములం దేమైన సత్యము కలదా ?

సీ. మీ వారి మోహంబు ♦ మేలఁతరో విప్రినా, రాయణుం డెఱిఁగించు♦రక్తిమీఱ
మీ వారి మోహంబు♦ మీనాక్షిరో బిల్వ, మంగళుం డెఱిఁగించు ♦ సాంగముగను
మీ వారి మోహంబు ♦ మేచకకుంతలా, జయదేవుఁ డెఱిఁగించు ♦ స్వాయముగాను
మీ వారి మోహంబు ♦ మృదుగాత్రి యెఱిఁగించు, శరభాంగలింగని ♦ చరితమెల్ల

గీ. మాయలును ; మర్మములు పన్ని ♦ మదనవహ్ని
విటుల దేహంబులందున ♦ వెలుఁగఁ జేసి
దగ్ధమొనరించి మీరలు ♦ తప్పుకొందురి
వలులునె నిజ మగు తమి మీ ♦ వారి యందు. 96

మంగ—అట్లనరాదు. మావారిలో మోసము లేకపోలేదు. కాని, నిక్కమగు ప్రేమా
నుబంధముఁ జూపినవారు మాలోఁగూడఁ బలువురు కలరు.

రసిక—ఒక్క యుదాహరణ మిమ్ము.

మంగ—పెక్కు లిచ్చెదం గనుఁడు.

సీ. వినుత వసంతసే • న నెగడు భక్తిని, చారుదత్తుని సేవ • సలుప లేదె?
ప్రవిమల మోహంబు • ప్రవరాఖ్యు మీఁదను, సుదతి వరూథిని • చూపలేదె?
యనఘ కానోపాత్రి • యను పణ్యభామినీ, ప్రతి సద్వ్రతంబుఁ • బూనలేదె?
కేతరాజకుల సం • జాతుని నరసింహు, లలిఁ జంద్రముఖి నమ్మి • కొలువలేదె?
గీ. అల పురూరవు నూర్వశి • యమల మతిని
దివిరి నిర్మల మోహాబ్ధిఁ • దేల్పలేదె?
కలరు మాలోనఁ గూడ ని • క్కంపుఁ దమిని
జూపు వారలు కొందఱు • చూడఁ జూడ. 97

రసిక—మంగతాయీ! న్యాయస్థానములు, విద్యాకూటములు, మున్నగు వానివలన నేదైన నేకారణములవలన నైనఁ గొన్ని నష్టములు కలిగినను వానివలన బహులాభములు కలవు. వేశ్యాంగనాసాంగత్యమువలన నష్టము లుండవచ్చునని నీవే యంగీకరించితివి. ఎన్నఁదగిన లాభము లేవైనఁ గలవని చెప్పఁగలవా?

మంగ—మమ్ములఁ గూర్చి ముచ్చటించుటలో మీ దృష్టి యథాన్యాయముగాఁ బోవుటలేదు. నిక్కమగు వేశ్యాసంపర్కము సరసతను గల్గించును. లోకజ్ఞానము హెచ్చించును. కళాకౌశల్య మొసంగును. మహాకవుల సరసతరకవిత్వమునకు మా వేశ్యాంగనాసాంగత్యమే యాలవాలమని చెప్పవచ్చును. మృదు మధుర గుంఫిత కుంభత్కవిత్వ మలవడఁ జేయుటకు మా గోష్ఠియే యవసరమని సాహిత్యశాస్త్రములు ఘోషించుచున్నవి. శాస్త్రముల మాట యటుండనిండు. ఘనకవుల మాటఁ దీసికొనుఁడు.

సీ. కాళిదాసుఁ డఖిల • కవిశేఖరుండాయె, మా గృహసంచార • మహిమముననె,
తిక్కన కవులలో • నెక్కువ వాఁడాయె, మాగృహసంచార • మహిమముననె,
కనెను శ్రీనాథుండు • కవి సార్వభౌమత, మా గృహసంచార • మహిమముననె,
ధూర్జటి సుకవిత్వ • ధూర్వహత్వముఁ దాల్చె, మా గృహసంచార • మహిమముననె
గీ. కలరు లెక్కకు మిక్కిలి • గాఁగ మాదు, మందిరంబులఁ దిరిగిన • మాత్రిఁ గవిత
సరసతరముగఁ జెప్పంగఁ • జాలు కవులు, జంక నేటికి నిటుపరా • శంక లేల? 98

మా వారు చేసిన ధర్మకార్యములు గూడ ననేకములు గలవు. ఆలయములు నారామ

ములఁ జెలువులు మున్నగు సప్తసంతానములు మా వారిచే నిల్పఁబడిన వనేకములు గలవు. పరమభాగవతోత్తముఁడగు బమ్మెర పోతనాదికవిశేఖరులు మా వారిపైఁ గృతులు వ్రాసియుండిరి. ముద్దుపళని లోనగు వేశ్యారత్నములు కృతు లొనరించి ధన్యలైరి. ఇంతయేల? ఇప్పటికిని జాతీయోద్యమములోఁ గూడ శ్రీమతి యామినీ పూర్ణతిలక లోనగు మా గణికామణు లగణ్యమగు పావనప్రచారము గావించుచున్నారు. వేయేల? వేశ్యలు ప్రకృతిస్వరూపురాండ్రు. ప్రకృతి మాయ కావున వారి ప్రవర్తనములు మాయగాఁ గాన్పించినను వారి చేతులంబడిన బుద్ధిమంతు లెల్లరును లీలాశుకుఁడు, జయదేవుఁడు, మాందకర్ణి, విప్రనారాయణుఁడు లోనుగాఁగల యుత్తమపురుషులెల్లరు భవబాధావిముక్తులై యుచ్చైర్గతి నందిరి. కావునఁ దెలిసికొనఁ గల వారికి మా జాతి హానికరము గాదు.

రసిక—లీలాశుకాదులు బాగుపడిరందువా? సంసారనాశనము కాలేదా?

మంగ—ఆర్యవర్యా, శాంతచిత్తముతోఁ జిత్తగింపవలెను. ఉత్తమ బ్రహ్మానందముఁ గోరువారికి నసారములగు సంసారము లాటంక దాయకములు గావా?

శా. సారం బింతయు లేదటంచు విబుధుల్ ♦ సంవాదముల్ సల్పి సం
సారంబుల్ విడనాడి ఘోరవనసం ♦ చారంబులం జేయుచున్
వైరాగ్యం బెదఁ బూని భక్తి వెలయన్ ♦ వాయ్వంబు పర్ణాదులై
సారూప్యాదిక ముక్తిఁ గొంట వినమే ♦ సర్వార్యశాస్త్రంబులన్. 99

వసం—అవును. బాగుగఁ జెప్పినావు.

శా. సారం బింతయు లేనిదూరఁ దినఁగాఁ ♦ గాంక్షింతెరి కుక్షింభరుల్
సారా యింతయు లేన్ని విందుగుడువన్ ♦ స్వచ్ఛాత్ము లాసింతురే
స్వారస్యం బది బోధలోనఁబడ ని ♦ స్సారంపు సంసారముల్
సారాచారులు త్రోసివేయుదురు వే ♦ శ్యాసారభోగజ్ఞులై. 100

ముక్తిశాస్త్రము సంసారమును వదలవలెనని చెప్పినప్పుడు సర్వానుబంధములను వదలవలెనని భావము కాని సంసారమును వదలి సానివలపునఁ దగుల్కొనవలెనని భావము కాదు. సింహామునుండి తప్పించుకొని పులినోటఁ బడిన లాభమేమి? చుట్టను మాని సిగరట్టుమ నభ్యాసము చేసికొనినఁ బ్రయోజనమేమి?

మంగ—ఆర్యులారా, నేను పరమతత్త్వార్థమును జెప్పినాను. మీరు దానిని గ్రహింపలేదు. వేశ్య ప్రకృతి యనియు మాయాస్వరూపురాలనియు నట్టిదాని వలలోఁ బడవలదనియే చెప్పుచున్నాను. ప్రకృతియందు బద్ధుఁడగు పురుషునకు నెచటికిఁ బోయినను మాయ తప్పదు. కావున మాయనుండి తప్పించుకొనుఁడని తెల్పుచు

న్నాను. వేశ్యాలతత్వము నైన మీరు బాగుగ నెఱుంగరు. ఆటసాని యనియు, పాటసాని యనియు, నీటుసాని యనియు సానులు మూఁడువిధములుగ నుందురు. భరతశాస్త్రబోధిత నృత్తకళవలన జీవించు వా రాటసానులు. గానకళ నభ్యసించు వారు పాటసానులు. ఒడలి నీటు వలన జీవించువారు నీటుసానులు. మొదటి యిద్దఱును నీమముగలిగి యుందురు, లేకున్న వారి కళలు చెడును. నీటుసాని మీరు చెప్పు మోసములకన్నిటికిని నాలవాలమై యున్నది. ఆమెనైనను మీ రంతగా నిందింపవలసినది కాదు. పరిక్రుతిబద్ధులైన మీ రామె యింటికిఁ బనిపూని పోయి మీ సొమ్ము లెమ్మెలుఁ జూపి వలపించి యామెపై మీ రామెకలనం జెడుచున్నారు. ఆమె మీ యింటికెన్నఁడును రాదు. మిమ్ము మీరు సంస్కరించుకొనుటకు మాయెడఁ బరిక్రుతిని సంస్కరింతుమని తెల్పుచున్నారు. కానిండు. జారత్వము నింద్యమే. కడు హేయమే. పవిత్రుఁబడఁటుల నీచవృత్తుల మాన్పించిన మాకళకుఁ గాని మా జాతికిఁ గాని భంగముండదు.

రసిక—అదెట్లు ?

మంగ—(పరికరమున్న యద్దముల పెట్టికలోనుండి యొక పుస్తకముం దీసి) ఇదిగో! మా జాతియొక్క యుత్పత్తిఁ గూర్చి మా పెద్దలే యిట్లు వ్రాసిరి. కనుఁడు. ("తొల్లింటి మన బల్లిదులు" అను పదములు మొదలు చదువుకొనుఁడని చేతికిచ్చుచున్నది.)

రసిక—(చేతఁ బుచ్చుకొని చదువుకొని యట్టఁజూచి) ఎనిమిదవ సంపుటమా? ఓహో! మా పెద్దలు వ్రాసినదే! సరే మీ జాతియొక్క యుద్యమము మంచిదే. జారవృత్తి కలవాండ్రిది మానుకొనవలసినదే కదా!

మంగ—నీమము లేక ధనార్థమై తమ శరీరమును వానికిని వీనికిని నమ్ముకొను హేయవృత్తిని దప్పక మానుకొనవలసినదే.

శృంగా—మనకు వేళయగుచున్నది. పురమందిరమునఁ దగు నేర్పాటులు జరుగుచున్నవో లేవో ?

మంగ—(శృంగారశేఖరునిం గని) మీరును వసంతకుఁడును ముందుగాఁ జని పురమందిరము సిద్ధము చేయించి యిటకు వర్తమానించిన మేము వత్తుము.

రసిక—(తనలో) వీరిద్దఱు నిప్పు డిచ్చటినుండి వెడలిపోవుటయే నాకునుమంచిది. ఏమనఁ బెండ్లి చేసికొనుటకై తాయిని నే నిప్పుడు ప్రోత్సాహము చేయఁబోవుచున్నాను. కాని నా గురువరుల్గు శృంగారశేఖరులును వారి మిత్రుఁడును నిచ్చట నుండిన నామె నందుల కంగీకరింపనీయరు. నా గురువులు తుదకు స్వార్థపరులగు సంఘ

సంస్కారప్రియనామధారు లగుచున్నారు. వీరికి మంగపై మోహము హెచ్చుగా నున్నది. ఆమె పెండ్లిచేసికొనినఁ దమ కోరికల కడ్డువచ్చునను భావమున నాప్రియత్నము సాగకుండునట్లు చేయుదురు. వసంతకుఁడు ధ్వజపటమువంటివాఁడు. మా గురువుగారి గాలి యెటుపోయిన నటుపోవుచుండును. కావున నిప్పుడు మీ రిచ్చట లేకుండుటయే మంచిది.

శృంగా—సరే అట్లే చేయుదును. (అని శృంగారశేఖరుఁడు లేచి వెళ్ళఁబోవుచున్నాఁడు.)

మంగ—టీ సిద్ధమైయున్నది. అది పుచ్చుకొని మఱి వెంచేయుఁడు.

శృం—ఛా

మంగ—ఏమి! టీ పుచ్చుకొనతగదా!

వసం—ఉత్తరదేశమునందు టీనే ఛా యందురు. అందుమూలముచే దానినే ఛా యని పలికితిని గాని అది అక్కఱలేక కాదు. తప్పక తే తేవలసినదే.

మంగ—సరసీరుహాక్షీ! టీ సిద్ధముగానుండినయెడల తీసికొనిరమ్ము.

సర—మంచిది. (అని తీసికొనివచ్చుచున్నది. అందఱును పుచ్చుకొనుచున్నారు.)

వసం—(లేచి వెళ్ళుచు) మీరు తీరని వివాదములోఁ బడి కూర్చుండక యీ లోపల నేకీభావమునకు రండు. మేము పోయివచ్చెదము. (అని శృంగారశేఖరునితో కలసి వెళ్ళిపోవుచున్నాఁడు.)

రసిక—(తనలో) నే నొక్కఁడ నిచటనుండుట కభిలాషమున్నను నది లేనట్లు నటింపవలెను. (పైకి) మీ రుభయులును వెళ్ళిపోవుచున్నారా? నేనును వచ్చెదను. నే నొక్కఁడ నిచ్చటనుండ నొల్లను.

వసం—ధీరవర్యా, కుణకుణ మిట్టిచేలతనముఁ జూపుచుంటి వేమి? సభ సంసిద్ధము గాకపూర్వమే యుపన్యాసకుఁడు వచ్చి కూర్చుండిన నేమిలాభము? ఇచట నుండిన నీయట్టి దిట్ట కేమిహాని? ఇట నిలచి నీ యూహల నామె సమ్మతించునట్లు చేయుము. సభ సిద్ధమైనతరువాత రావచ్చును. దాన నీవు తలఁచిన కార్యము సిద్ధి పొందును.

రసిక—(తనలో) ధన్యుఁడ నైతిని. (ప్రకాశముగా) అట్లే యగుఁ గాక. (వసంతక శృంగారశేఖరులు వెడలిపోయిన తరువాత రసికశేఖరుఁడు మంగతాయింగని) సుందరీ, నీ వివేకము చాల ఘనమైనదిగ నున్నది. ఇట్టి నీవు విగ్రహారాధనముం జేయుట వింతను బుట్టించుచున్నది. ఇట్టి యజ్ఞానకృత్యముఁ జేయువారితో మేము సాంగత్యము చేయ నొల్లము, నీ నీ జీవము లేని ప్రతిమల నారాధించుట మాను

కొనవలెను. అది నీకు శ్రేయస్సును గూర్చును.

మంగ—మీ విలువ గల యుపదేశముల ననుసరించి నడచెదను. ఇంతటినుండి జీవములేని ప్రతిమల నారాధింపను.

రసిక—నీ వేకేశ్వరారాధనము చేయవలయును.

మంగ—నే నాదినుండియు నొక్క యీశునే నమ్మియున్నాను. పల్వుర నెన్నఁడుఁ గొల్చుటలేదు.

రసిక—నీవు పవిత్రములగు నూహలు కలదానవు. భక్తురాలవు. విద్యాంసురాలవు. ఇట్టి నీవు వివాహము చేసికొని కులాంగనవై యుంటివా, నీ కెంతయో శ్రేయస్సు కలుగును. నిన్ననుసరించి వారనారు లెల్లరును బాగుపడుదురు. పదవృత్తి హేయమైనదని యంగీకరించితివి గాన నా మాట విని వివాహము చేసికొనుము.

మంగ—ఆర్యవర్యా, మీ చెప్పినట్లు చేయవలయునను నూహలు నాకును బుట్టుచున్నవి. కాని మా కులము వా రంగీకరించు వఱకు నే నేదియుఁ దొందరపడి చేయరాదు. నన్నుఁ బెంచి పెద్దదానిని జేసిన తల్లి యున్నది. ఆమె యంగీకారమును బడయవలెను. ఇట్టి ఘనకార్యము నెమ్మదిగ నాలోచించి చేయఁదగినది కాని తొందరపడి చేయరాదు. కాన [illegible] పరిశ్రమమునఁ జేయవలసినది మా వారల కందఱకు నీతి వచ్చుటకై తగు సభలు చేసి మంచిబోధ గావించుట. పండితవర్యా, మా కులము పవిత్రము చేయు భారమంతయు మీపై నున్నది. చక్కని యుపన్యాస మిచ్చి జారత్వములోని నీచత యంతయు మా వాండ్రకు బోధపడునట్లు చేసి వారిని యోగ్యవృత్తిలోనికి మఱలింపుఁడు. మీరు సభను జయప్రదముగ సాగించిన యెడల మీ యుపన్యాస మమోఘమగునట్లు నేను జేసెద.

(తెరలో ధూమ్మని చప్పుడగుచున్నది.)

మంగ—అమ్మయ్యో! (అని భయము నటించుచు రసికశేఖరుని గౌఁగలించుకొనుచున్నది.)

రసిక—(నవ్వుచు) భీరురాలా, భయపడకుము. రేవులోనికి యుద్ధనావ వచ్చినది. ప్రజలకుఁ దెలియుటకుఁ గాంబోలు శతఘ్ని పేల్పఁబడినది. (తనలో)

ఆ. వె. మగువ హస్తమునకు ♦ మాంత్రికవేత్రంబు
తగుల ఝల్లుమనియెఁ ♦ దను వదెల్ల
మనసు తత్పరమయి ♦ మమతను బొందెను
పొలఁతి మంత్రశక్తి ♦ పొగడఁ దరమె! 101

అహాహా! ఈ యబల యింకను భీతిచేఁ గన్ను లుమూసికొని వడఁకుచునే యున్నది.

(అని వేశ్యను కలయం జూచి తనలో)

సీ. నిర్మల లావణ్య ♦ నీరనారంబును, వర్ణనీ సౌభాగ్య ప్రే ♦ వాహినులు
చారులోచన మీన ♦ చటులవిభ్రమములు, కస్తూరి నళిని ♦ కంకులును
ముఖకుక్షిగత రద ♦ ముక్తాఫలంబులు, శ్రోణిసైకతపరి ♦ స్ఫురణములును
ప్రియతర దరహాస ♦ ఫేన నిర్మల కాంతి, కమనీయ గళశంఖ ♦ విమలశోభ

గీ. కన్నులారంగ గాంతుతో ♦ గనుంగొనంగ, నతివ సౌందర్య దుగ్ధాబ్ధి ♦ యనంగ నొప్పు
తఱచి చూచిన నమృతంబు ♦ తనరకున్నె, గానం దత్ప్రాప్తి నందంగ ♦ గడంగ నగును.

నా మనస్సు నన్ను వంచించి యీ సుందరి వశమగుచున్నది. సురలింప నా వశము గాకున్నది.

కం. సుడివడి లోపల నించుక, బడినంతన వస్తువెంత ♦ పాటిది యైనన్
కడువడి సుడివడు వడువున, సుడివడి నామెడంద లంజ ♦ సుడిలోం బడెడున్. 108

కటకటా! తుదకు మోహాబ్ధిలోనే బడుచుంటిని. నా మనస్సు నన్నిట్లు వంచించునని యెన్నండు ననుకొనలేదు. ఇంక మరల్ప నా వశము గాదు.

గీ. కలికిచూపులు చిఱునడల్ ♦ తెలినగవులు, భావ సూచిత గంభీర ♦ భాషణములు
చతుర శృంగార చేష్టలు ♦ చాలం గలుగు, కలికిం గన నేరిహృదయంబు ♦ కలంగకుండు?

మంగ—అమ్మయ్యా! అతనుభీతిని బొందినాను. (అని కౌంగలింత వదలి దూరముగా నిలువంబడుచున్నది.)

రసిక—అదేమి?

మంగ—నా సామీప్యము మీకు ధర్మసందేహము కలిగించుచున్నదేమో యని దూరమ్ముగా నిలచితిని.

రసిక—(నవ్వుచు)

సీ. ధర్మ స్వరూపంబు ♦ తన్వి నీ కనుబొమల్, వీక్షించినంతనె ♦ విశదమయ్యె
సన్మార్గ తత్వంబు ♦ చాన నీ మధ్యంబు, తిలకించినంతనె ♦ తెలిసివచ్చె
శ్రుతి హితశబ్దంబు ♦ శుకవాణి నీమృదు, గానంబు విన నవ ♦ గాహమయ్యె
శుకవాగ్విహాస్యంబు ♦ పికవాణి నీసు సం, భాషణ మాలింప ♦ స్పష్టమాయె

గీ. వీడె ధర్మసందేహముల్ ♦ వెలందిమిన్న, నీదు సాంగత్య మబ్బిన ♦ నిముసమందె
లలితదీపంబు చెంతను ♦ నిలువ లేక, గాఢ తమసంబు మాయమౌ ♦ కరణి గాదె.

[తెరలో]

గీ. భృంగరాజంబ! నీవు సం ♦ పెంగ కడకు, స్వాదు మకరంద మానంగ ♦ జనుచునుంటె!
కలితసుమనః ప్రసంగంబు ♦ కలదు నీకు, కాని ఫలమేమి? కామాంధ ♦ కారపతిత!

రసిక—(అదలిపడి) ఏమిది? ఎవరి వీ పలుకులు ?

మంగ—(నవ్వుచు) పరిసరోద్యానములో సంచరించువారు సంపెంగమీఁదికిఁ బోవు భృంగముం గని పలుకు పలుకులివి.

రసిక—మనలం గూర్చి కాదుకద ?

మంగ—లోకమున కంతకును మనవ్యాపారమును గనిపట్టుటయే పని యనుకొనినారా? ఇది యెవరికిఁ గావలెను?

రసిక—(మంగతాయిని సమీపించి)

సీ. అధరమధురరసము ♦ ననుభవింపఁగఁ జేయు, శ్రుతిహితవాక్కులఁ ♦ జూపు మబల

మంగ—(ఈవలకు తప్పించుకొని)

పరదారఁ గూడుట ♦ పాపమనెడు నుడి, శ్రుతిహితమధురోక్తి ♦ నూవె యార్య

రసిక—(సమీపించుచు)

పణ్యాంగనామణి ♦ పరదార గాకుంట, నామెను బొందుట ♦ యనువు కాదె ?

మంగ—(తప్పించుకొనుచు)

భార్యకంటెఁ బర యే ♦ భామిని యామెయుఁ, బరదార యందురు ♦ ప్రాజ్ఞులరయ

గీ. అగ్నిసాక్షిగఁ బెండ్లాడి ♦ నట్టి సతిని, వదలి యన్యఁ గూడనగునె ♦ బాస యుంట

రసిక—

బాల్యమందునఁ జేసిన ♦ బాస లిపుడు, నిలువఁ జాలునె పరికింప ♦ నళిననేత్రి? 107

(అని చేయి పట్టుకొనఁ బోవుచున్నాఁడు.)

మంగ—(చేయి తప్పించుకొని) నేను వారవధువును.

రసిక—(నవ్వుచు) కావు. కావు. నీవు మారువధువువు. (వేయి రూపాయల కాగితము నిచ్చుచు) ఈ గదిలోనికి రత్నఖచితాసన మొకటి చేయింపుము.

మంగ—(కైకొనుచు నిరసన భావముతో) ఇది నాకేల ?

రసిక—నేను మనస్ఫూర్తిగా నిచ్చుచున్నాను. కైకొనుము.

[తెరలో]

ఆ. బాల కాక తలఁప ♦ గోల యీ మధుకరి, యెట్లు గారవింతొ ♦ యింక నీవు

భ్రమలఁ దీర్చివైచి ♦ భ్రమరమా యేలుకో, యదనుఁ దెలిసికొనియుఁ బదను నెఱిఁగి.

రసిక—వనసంచారుల పలుకులు నాకు హితబోధలుగా నున్నవి. పాణిగ్రహణవిషయమున నీ హృదయము వెల్లడిచేయుము.

మంగ—నే నెన్నఁడును హృదయమును దాఁచుకొనుదానను గాను. నేను గాయనిని. జితేంద్రియత్వము నాకు ప్రధానము. అది చెడిన నా గానకళ చెడి వృత్తికి మోసము

వచ్చును. ఆపై జీవయాత్ర సరిగ జరుగదు. కానఁ బాణిగ్రహణ మొల్ల.

రసిక—(నవ్వుచు) నీ వృత్తిని నీవు మార్చుకొనునట్లు చేయుటకై నే నిచ్చటికి వచ్చినాను. ఆ మార్పును నీ వంగీకరించిన జీవయాత్ర మఱింత సుఖవంతమై జయప్రదముగ సాగునట్లు చేయ నా లక్ష్మిని నియమించెద. నమ్ము. ఇదిగో చేతిలోఁ జేయి వేసెద. (అని చేయి పట్టుకొనఁబోవుచున్నాఁడు.)

మంగ—(తప్పించుకొని) మీ యట్టి పెద్ద మనుష్యు లాడినమాటలఁ దప్పువారు కారు కాని (అటు నిటుఁ జూచి) అదె యెవరో యిద్దఱు వచ్చుచున్నారు.

రసిక—(కొంచెము వెనుకకుఁదిరిగి) ఎవరు వారు? నీ శయనాగారమునకు నిర్భయముగా రాఁదగిన పెద్దమనుష్యులు కారు గద?

మంగ—వారెవరో నే నెఱుఁగను. సభతో సంబంధించిన వారుగాఁబోలు. వాకిట నిలిచినారు.

రసిక—అట్లైన హానిలేదు. ఇదే చేతిలోఁ జేయివైచి బాస చేయుచున్నాను. వినుము.

(అని చేయి పట్టుకొనుచున్నాఁడు)

మంగ—(సిగ్గు నభినయించుచు చేయిలాగివైచుకొనఁ బ్రయత్నము నభినయించుచున్నది.)

రసిక—(నవ్వుచు) నీ పెనుగులాటలో నీ తలుపు నీకుఁ దగులునట్లున్నది. కాన దీని యాతంకముఁ దీర్చెదను. (అని తలుపును గాలితోఁ ద్రోయుట నభినయించుచున్నాఁడు.)

తెర పడును.



పదునొకండవ రంగము.



మంగతాయి చావడి.

[సభాపురుషు లిద్దఱు ప్రవేశింతురు.]

ప్రథముఁడు—ఆహా! ఈ దివ్యభవనములోఁ గాఁపురముండిన వేశ్యబ్రతుకే బ్రతుకు.

ద్వితీయుఁడు—అట్లుకాదు. దివ్యభవనములోఁ గాఁపురముండినంతన బ్రతుకు సార్థకముగా నేరదు. తాను బాగుపడి యితరులను బాగుచేయువారి బ్రతుకే బ్రతుకు. తాను చెడి యితరులను జెఱచువారి బ్రతుకు బ్రతుకు కాదు.

గీ. నవ్య మందార సుందర • నందనమున, మంజు కుంజంబు నిలయమై • మసలునట్టి
చీడపురు వెడ్డుఁ జీడయై • చేటుఁ దెచ్చుఁ, గాని, వనలక్ష్మి దానికి • ఘనత నిడునె?

ప్రథముఁడు—ఈమె ధనవంతురాలయి కూడ నున్నది కాదా?

ద్వితీయుఁడు—వట్టి ధన మేల? మానధన ముండవలెను.

ఆ. వె. మానధనము లేని ♦ మానిని చేతదో, ధన మదేల కనని ♦ ధనము కొఱకె
ధర్మపరము గాని ♦ ధనము దంధనమగు, మానధనము తెచ్చు ♦ మహిమ మెప్పుడు.

ప్రథముఁడు—అట్లైన నీ వేశ్య బ్రతుకు వ్యర్థమే యందువా?

ద్వితీయుఁడు—సందేహ మేమి?

కం. తను వది కల్లంగడియో, గన మోవియె కల్లుపాత్ర ♦ ఘనతరతనుభూ
జనితగిరుల కలుకుండలు, వినుతాధరమధువె కల్లు ♦ వేశ్యది బ్రతుకే. 111

ప్రథముఁడు—ఏది యెట్లైనను మనకేమి? మన మాలస్యము చేయవలదు. వచ్చిన పని చూచుకొనవలయును. (తెరవైపు చూచి) రసికశేఖరులును మంగతాయియు నేమి చేయుచున్నారు? సభ సిద్ధమై యున్నది. వారు త్వరగ రావలయును.

[తెరలో]

వారు తగు వేషములతో వచ్చుచున్నారు. (రసికశేఖరునియొక్కయు స్వదేశవస్త్ర ధారణము చేసియున్న మంగతాయియొక్కయు ప్రవేశము.)

రసిక—ఇదే వచ్చినాము. సభకు పోవుదము రండు.

[సభనుండి వచ్చినవారు దారి చూపఁగ రసికశేఖరుఁడును మంగతాయియు సభకుఁ బోవుచున్నారు.]

సభనుండివచ్చినవారు—ఇటు. ఇటు.

రసిక—(తనలో) కటకటా! పడిపోయినాను. వేశ్యతో నేకాంతము నుండుటచే నీ చిక్కు వచ్చినది. (పైకి) పురమందిరము సమీపించినాము.

సభనుండివచ్చినవారు—అవును. సమీపమునకు వచ్చినాము. వారుగో! శృంగారశేఖరులు మున్నగువారు. సభలోనికిఁ బోవుదము రండు. వారు మనకై యెదురు చూచుచున్నారు.

(అందఱును వెళ్ళుచున్నారు.)

శృంగా—(తాయితో రహస్యముగా) పండా, కాయయా?

మంగ—(నవ్వుచు రహస్యముగ) పండే; పరిపక్వ మయిపోయినది. మీ శిష్యుఁడు సార్థకనాముఁడైనాడు.

శృంగా—(అసహిష్ణుతతో తనలో) అంతవఱకు సాగనిమ్మని నా తలంపు కాదు. ఈయుద్యమము నేను దలపెట్టినదే యైనను ఫలవంతమైనదని తరువాత నా కసూయ పుట్టుచున్నది. ఎప్పుడైన నీ తరుణి యొక యువకునిఁ జేపట్టవలసినదే కదా. అట్టిది

రసిక శేఖరుఁ జేపట్టినంగలదు నా కనూయ యేలకో ? ఆహా ! మనుజప్రకృతి యద్భుతమైనది కదా ! కడచిన దానికి వగచిన నేమి లాభము ! (అనుకొనుచు వందలతో నడుచుచున్నాఁడు.)

(తెర పడును.)

## పండ్రెండవ రంగము.



పురమందిరము.

[సభాభవనము: సభ్యులు ప్రవేశించి యాసనములపైఁ గూర్చుందురు.]

శృంగా—(ఆసనమునుండి లేచి నిలువఁబడి నలుదిక్కులు చూచి) ఓహో ! ఇట్టి ప్రధానసభ యిచ్చట జరుగుచుండినను నావల చతురంగములు, చీట్లాటలు, టెన్నిసులు. (చప్పుడు నాలించి) బిలియర్డ్సు నవిచ్ఛిన్నముగా జరుగుచున్నవే. సంఘ మేమయిపోయినను నీ యాటలాడు పెద్దమనుష్యులకు నేమియు లక్ష్యము కలుగదు గాఁబోలు. ఈ పురమందిరము విద్యానిలయముగా నుండవలెనని నే ననుకొనఁగాఁ గేవలక్రీడామందిరముగ మాఱిపోయినది. (కూర్చుండును.)

రసిక—(సభ కలయఁజూచి) సభకు వేశ్యలు తండోపతండములుగా వచ్చియున్నారు. పురజనులు బెక్కురు వచ్చిరి. పెద్దలుమాత్రి మాటలనుండి యిటకు రారైరి. ఏమైన నేమి ? సభం గన చాలసంతోషముగా నున్నది. (మంగతాయి వైపు చూచి, తనలో) మంగ యింటఁ జిత్రవిచిత్రములగు పరదేశవస్త్రములను ధరించినను సభకు వచ్చినప్పుడు స్వదేశవస్త్రధారణ మొనరించినది లంజవేషములన నిట్టివే గాఁబోలు.

ఆ. వె. ప్రకృతి ఋతువు మాఱఁ ♦ బాత వేషముఁ దీసి
క్రొత్త వేష మూని ♦ కోఱలు నట్లు
వేశ్య తతినిబట్టి ♦ వేర్వేరు వేషముల్
వేయుచుండు గొత్త ♦ విటుల లాగ. 112

మంగ—(శృంగారశేఖరుని గని) నేఁటి సభ కెవరి నధ్యక్షులఁ గావింతము ?

శృంగా—అది సభవారు నిర్ణయింపవలెను.

వసం—శృంగారశేఖరులనే సభాధ్యక్షులగా నియమించుకొనుట మంచిదని నా తలంపు.

శృంగా—అట్లు కాదు. ఇది వేశ్యలం గూర్చిన విషయము కావునఁ దగు వేశ్యనే యేలినిగా నియమించుట మంచిది.

వసం—బాగుగా నున్నది అట్లే చేయుదము గాక (లేచి నిలువంబడి) పురుష సింహు
లారా! కాదు-కాదు-స్త్రీరత్నములారా! పురుషసింహులారా! మనము గొప్ప
సంఘసంస్కారవిషయముం గూర్చి పండితవరులగు రసికశేఖరుల బోధలు విను
టకై యిచటికి వచ్చియున్నాము. సభాధ్యక్షుల నెవ్వరి నేర్పాటుచేసికొనిన
బాగుగా నుండునో మీరే యాలోచింపుఁడు. ఇది వేశ్యలం గూర్చిన సభ కావున
నొక వేశ్యారత్నమునే సభాధ్యక్షురాలినిగా నెన్నుకొనిన బాగుగ నుండునని
యస్మదాదుల తలంపు. (అని కూర్చుండుచున్నాఁడు.)

ఒకవేశ్య—(లేచి) సభ్యులారా! మా వారనారులలో విశేషవిద్యాబుద్ధులు కలది
మంగతాయి. ఆమె యీపురమునందలి వారముఖ్య. కాన నామెను సభాధ్యక్షు
రాలినిగా నేర్పాటుచేయ నా యభిప్రాయము.

(అందఱు 'బాగు' అని పలుకుచున్నారు.)

మంగ—(లేచి) శృంగారశేఖరాది పండితవరులు సభలో నుండఁగా నేను సభాధ్య
క్షత వహించుట ధర్మము కాదు. పండితులలో నెవరినైన సభాధ్యక్షునిగా నెం
చుట మంచిది. (అని కూర్చున్నది.)

శృంగా—అట్లయిన వసంతకుని సభాధ్యక్షునిగా నెంచుట మంచిది. ఆతఁడు పురుష
సంఘములలోఁ బురుషుఁడుగాను స్త్రీ సంఘములో స్త్రీగను సంచరించుచుండును.
కాన నతఁడు సభాధ్యక్షత వహించుఁగాక యని నేను కోరుచున్నాను.

(అందఱును బలపఱచుచున్నారు.)

మంగ—వసంతకుఁడుగారూ, దయచేసి సభాధ్యక్షాసనము నలంకరింపుఁడు.

వసం—(అగ్రాసనముకడకు వచ్చి) సభాసదులారా! నేను సమర్థుఁడనే నైనను మీ
కోరిక ననుసరించి కాలహరణము కాకుండుటకై యీ యధ్యక్షత నంగీకరించు
చున్నాను. పండితశేఖరులగు రసికశేఖరులు దయచేసి తమ యుపన్యాసమును
బ్రారంభింతురుగాక!

రసిక—(బల్లపైనెక్కి, తనలో) నేను చెడినాను. ధర్మోపన్యాస మిచ్చుటకు జంకు
పుట్టుచున్నది. (ఆలోచించి) జంకేల? మా గురువుల పద్ధతి ననుసరించి నిశ్శంక
ముగా మాటలాడెదను. (పైకి) స్త్రీమణులారా! పురుషరత్నములారా! నేను
మీకడ నుపన్యసింపఁబోవునది వేశ్యల పడుపువృత్తిఁ గూర్చి. దీనిఁ గూర్చి విశేషోప
న్యాస మవసరములేదు. వక్తృత్వముతోఁ బ్రయోజనము లేదు. (సభ కావల నాట
లాడుచోట కలకలమును చప్పటులును బయలువెడలును.)

రసిక—(ఉపన్యాసము మాని ముందుకు చూచి) ఏమిది? ఓహో! బంతులాట

## పండ్రెండవ రంగము.

గడబిడయా ! అందులకా యీయట్టహాసము ! ఇట్టిశాపుల సభలు జరుగు టెట్లు ! (కలకల మడగువఱకు నాగి) మానమమ్ముకొని జీవించుటకంటె హేయ మైన పని మఱియొకటి లేదు. అది దేహమును బాడుచేయును. కష్టములఁ దెచ్చి పెట్టును. సంఘములో లాఘవముఁ గలిగించును. పరలోకమందు ఘోరనరకముల పాలుచేయును. ఈ వృత్తి తుచ్ఛమని మీ రందఱు నంగీకరింతురా ? లేదా ! తెల్పుఁడు;

అందఱు—పడుపువృత్తి పరమనీచమైనదనియే మా తాత్పర్యము.

రసిక—అట్లయినచో పాపాసువృత్తిని వేశ్యలు మానుకొని సంసారములోఁ బ్రవేశిం చుట మంచిది. అట్లుచేసినఁ బెద్దలెల్లరు గౌరవింతురు. పడుపుఁబడఁతులు బాగు పడుదురు.

(సభలోనుండి)

ఈ బోధలు బహుకాలమునుండి వినుచున్నాము. ఆచరణములోఁ బెట్టువారు కాన్పింపరు.

రసిక—ఆచరణములేని యుపన్యాసములవలనను సభలవలనను నేమియుఁ బ్రయోజన ములేదు. మీకు దేశమాతయందును, నీతియందును, జాతియందును, ఖ్యాతియం దును, నాతియందును గౌరవ మున్నయెడల వేశ్యలలో వివాహసంస్కారముం దెచ్చిపెట్టఁ బ్రయత్నింతురుగాక ! ఈ పూజ్యకార్యమునకు సిద్ధపడువా రెవరో లేచి నిలుచుందురుగాక !

ఒకవేశ్య—అయ్యా, హేయమైన జారవృత్తిలో నింతకాలము గడపిన మమ్ముఁ బెండ్లి యాడువా రెవరు ?

రసిక—మీ తోడిదే బ్రతుకని మిమ్ము నమ్మించు మీ విటులు పెండ్లాడరా !

వేశ్య—వారి కిదివఱకే పెండ్లిండ్లైనవి. మఱలఁ బెండ్లి యాడుదురా !

రసిక—ఇష్టమున్న నాడవచ్చును.

వేశ్య—మీరు బహుభార్యాత్వము నంగీకరింతురా ?

రసిక—అంగీకరింపము. కాని-

వేశ్య—పైన-

సభాధ్యక్షుఁడు—ఇపుడు ప్రశ్నలు వేయవద్దు. ఈ సభలోని వేశ్య లెవరైన వివాహ మాడుటకు సిద్ధముగనున్నచో వేశ్యాసంఘోపకారార్థమై మే మ్మెబ్బరువును భరింప సిద్ధముగానున్నారము ఎందఱు వచ్చినను వివాహమాడుదుము.

ఇంకనొక వేశ్య—అయ్యా, ఉపన్యాసకుఁడుగారూ, ఇపుడు మీరు వివాహముల నేర్పాటు చేయఁబోవుచున్నారు గదా! నాగరకత గల పశ్చిమదేశములలో వివాహము లపజయమునందుచున్నవే! ఆదేశమునందనేకులకు కన్యకలు వివాహమాడినఁ గష్టపరంపరలు సంప్రాప్తమగుచున్న కారణమున వివాహమునే మానుచుండఁగా, మీరు మమ్ముల వివాహములు చేసికొని దుఃఖము పాలగుఁడనుట ధర్మమా?

రసిక—పశ్చిమదేశపు పరమావధులు వేఱు, మనదేశపు పరమావధులు వేఱు.

వేశ్య—అది మీ రంగీకరింతురా? మీకుఁ బశ్చిమమే కదా గురి?

రసిక—అనవసరప్రశ్నలు లేల? స్త్రీపురుషులకు వివాహమనునది పరమధర్మము. స్త్రీ లేనిపురుషుఁడును పురుషుఁడు లేని స్త్రీయును వ్యర్థులు. తనసృష్టియేదియు వ్యర్థము కాఁగూడదని జీవనయాపకుని తలంపు.

ఇంకనొక వేశ్య—అయ్యా, ఉపన్యాసకుఁడుగారూ, పడుచుఁదనముననే భార్యలఁ బోఁగొట్టుకొనినవారెల్లరు మీవలెఁ దప్పక వివాహము చేసికొనుచున్నారా?

రసిక—అనవసర ప్రసంగములఁ జేయవద్దు.

వేశ్యలు—సమాధానము చెప్పలేక యనవసర మనుట ధర్మమా?

(సభలో కలకలము.)

అధ్యక్షుఁడు—(బిగ్గరగా) అల్లరిచేయవద్దు. రసికశేఖరుఁడుగారి యుపన్యాసము చాల లోతుగలది. సారము గ్రహించుకొనవలసినది. వారి యూహకు నంగీకారము నందునా రెవరైన నుండిన లేవవలసినది.

మంగ—(నిలువంబడి సద్దణఁచి) సభాధ్యక్షా! సభ్యవరులారా! ఉపన్యాసకశేఖరా! నేను రెండువాక్యములఁ జెప్పెదను. సావధానముగఁ జిత్తగింపుఁడు. పడపుఁగాండ్ఁతుల వృత్తి చాల హేయమైన దనుమాట సత్యము. దానిని దప్పక సంస్కరింపవలసినదే. కాని యేసంస్కారమైనను నొక్కమాఱుగ నవలంబనములోనికి రాదు. అభ్యాసము కూడువిద్య. అభ్యస్తమైన దానిని దురభ్యాసమైనను నొక్కసారిగా విడిచివేయుట దుర్ఘటము. శ్రీరసికశేఖరుఁడుగారి పండితోక్తులు నా యల్పబుద్ధికి జాల నచ్చినవి. సాధ్యమగునంతవఱకు వారి బోధల నాచరణములోఁ బెట్టఁ దలఁచినాను. నావశమున మాయింట పుల్లాబ్జముఖి యను వేశ్యాబాలిక గలదు. ఆమెకుఁ బదునాలుగేండ్లు వయసున్నది. అనావిద్ధరత్నము. ఆ బాలిక నెవరైన వివాహము చేసికొన నిశ్చయించికొనినచో నే నామె నిచ్చి వివాహము నేఁడే చేయుటకు సిద్ధముగానున్నాను. ఇట్టనున్న పురుషసింహములు చేతుల నెత్తవలెను.

(ఎవరును చేయి నెత్తలేదు.)

సభాధ్య—ఎవరును చేతుల నెత్తుటలేదు. వాయెత్తువారే గాని చేయెత్తువారు గాన్పింపరు. నే నధ్యక్షత వైవేసికొంటిని గనుక ఖాజీ ఖిస్సా యీ చేసినట్లు నాకిచ్చిన నేను పెండ్లిచేసికొనియెదను. (రహస్యముగా మంగతాయితో) ఆమె పేరు పుల్లి కాదా ?

మంగ—(రహస్యముగా) పుల్లి యనునది మొదటి పేరు. దాని నిటీవల ఫుల్లాబ్జముఖిగా మార్చినాము. (పైకి) సరే. మీరట్లు పైన నుండవలసినదే. రసికశేఖరుల యుపన్యాసమమోఘము చేయుటకు నేను నిశ్చయించుకొనినాను. మా యింట నిరువదియేండ్ల బాలుఁడొకఁడు గలఁడు. ఆతఁడు దిక్కుమాలిన యనాథుఁడుగా నుండఁగా మేమే పెంచినాము. చదువుకొనుచున్నాఁడు. ఆతఁడు దాక్షిణాత్యుఁడు. ఫుల్లాబ్జముఖిని వాని కిచ్చి నేఁడే వివాహము చేయ నిశ్చయించుకొనినాను. జ్యోతిషములోను మంచి ప్రవేశముగల శృంగారశేఖరులు నేఁడొక గంటుపైన మంచిముహూర్తము గలదని సెలవిచ్చియున్నారు. ఈ వివాహము మా యింట జరుగును. కావున సభవారెల్లరు నా వేశ్యా రజస్వలాదివివాహ సందర్శనార్థమై మా యింటికి దయచేసి నూతనవధూవరుల దీవించి, వినోదములఁ జిత్తగించి, మత్కృత సత్కృతుల నంది నన్నుఁ గృతార్థురాలిఁ జేయఁ గోరుచున్నాను. చక్కని యుపన్యాసము నిచ్చిన రసికశేఖరులు గారికి, జయప్రదముగా సభను నడపిన సభాధ్యక్షులకు దండములు సమర్పించుచున్నాను.

విసం—మధ్యాహ్నము పండ్రెండుగంటలు దాఁటిన తరువాత పెండ్లి చేయవచ్చునా ?

శృంగా—చేయవచ్చును. మన దేశమునం దంతగ నాచారము లేకున్నను నితరదేశములందుఁ గలదు. దక్షిణదేశమునందు పగలు మాత్రమే వివాహము చేయుదురు. దక్షిణదేశమునందే కాదు. మన యాంధ్రదేశమునందుఁ దప్ప తదితర దేశములందు రాత్రి వివాహము చేయరు. ఆంధ్రదేశమునం దయినను నభిజిల్లగ్నమును బ్రధానముగాఁ జేసికొందురు కోయలు. పోటువేళను బ్రధానముగాఁ జేసికొందురు జాలరివాండ్రు. ఇట్లాచారములు భిన్నములుగా నుండును. అదిగాక మేము సంఘసంస్కారప్రియులము. మాకు లగ్నము లంతగాఁ జూడ నవసరములేదు. కాని యిట వరుఁడు దాక్షిణాత్యుఁ డగుటచే సాయంకాలము నాలుగుగంటలు దాఁటకుండ పగ లెప్పుడు చేసినను జేయవచ్చును.

సభాధ్య—నేను దక్షత మీఱ సభాధ్యక్షత వహించి జయము గలిగించినందులకు సంతసించుచు సభ ముగిసినదని తెల్పుచున్నాను. (అని లేచుచున్నాఁడు)

శృంగా—మంగతాయీ, నా మిత్రుఁడు సభను జయప్రదముగాఁ గావించినాఁడు,

సంతోషమైనది. నీవు వెళ్ళి వివాహకార్యసన్నాహముఁ జేయుము. ద్విచక్రికల మీఁదను, మరబండ్ల మీఁదను శాహ్వానపత్రికలఁ బెద్దమనుష్యుల కందఱకుఁ ద్వరగఁ బంపుము. మే మొకసారి యటు నిటు దిరిగి వివాహసమయమునకు నీ యింటికి వత్తుము.

(శృంగారశేఖర వసంతకు లిరువుర మిగులఁగా యవనిక పడును.)



## పదమూడవ రంగము.



### రాజవీధి.

వసం—నాకు దప్పి కొమ్మ్సాఁ నగుచున్నది. ఆ ప్రక్క యిండ్లకుఁ బోయి దప్పి తీర్చుకొని వచ్చెదను. (అని వెళ్ళిపోవుచున్నాఁడు.)

శృంగా—(తనలో) కటకటా! నే నెంత చదివిన నేమిలాభము! తుదకు నేను జెడుటయె గాక శిష్యులను గూడఁ జెఱచుచున్నాను. రసికశేఖరుఁడు నీతియం దాదరము గలవాఁడు. వేశ్యాటన మనినఁ బరమనీచముగాఁ జూచెడువాఁడు. అట్టి సాధుహృదయునిఁ బనిపట్టి వేశ్యామోహాబ్ధిలోనికి నెట్టివేసినాను. అనదల బాగు చేయుట యను మిష నొకదానిని గల్పించుకొని యువకుల నెందఱినో పాడుచేసినాను. నా పూర్వకృత్యములఁ దలఁచుకొన నా యొడలు కంపమొందుచున్నది. ఐనను నా దుర్వృత్తులు నన్నింకను విడువలేదు. స్వభావముచే నేను దుష్టుఁడను. సుజనుని వలె వేషము వేయఁబోయిన నది నిలుచునా? (ఆలోచించి) ఏది యెట్లు జరుగవలెనో యది యట్లు జరుగుచున్నది. నా వేషము లిప్పుడు మార్చుటకు వలను కాదుగదా! (అటునిటుఁ జూచి) ఆలస్య మగుచున్నది. వసంతకుఁ డింకను రాకున్నాఁడు. (ముందుకుఁ జూచి) అతఁడుగో! వసంతకుఁడు వచ్చుచున్నాఁడు. (వసంతకుని ప్రవేశము. వసంతకు నుద్దేశించి) ఇంత యాలస్యమేలఁ జేసితివి!

వసం—నేను దప్పి తీర్చుకొనుటకై కాంచనమాలా విటశేఖరులును, వ్యాకరణాచార్య అను నగు స్వామినాథశాస్త్రిగారి నడవలోనికిఁ బోవునప్పటికి లోని చావడిలో శాస్త్రిగారికిని వారి శిష్యునకును నద్భుతరీతి వ్యాకరణశాస్త్ర విషయక వాక్యార్థము జరుగుచున్నది. ఈవలనుండి కొంచెము విని యానందించితిని. నీవు తొందరపడుచుందువను భయమున లోనికిఁ జని మంచితీర్థము పుచ్చుకొని వెంటనే వచ్చి వేసితిని.

శృంగా—ఆ వాక్యార్థమేమి?

వసం—పెద్దలమైన మమ్ముఁ బోసి రాజని కాంచనమాలకు నీ భ్రా జేశ మే నూతనముచే

నైతివని గురువుగారు ప్రశ్నించిరి. 'వృద్ధో యూనా' అను సూత్రముచేత నని శిష్యుఁడు మెల్లఁగఁ బ్రత్యుత్తర మిచ్చెను. ఇట్లు చర్చ జరుగుచుండ నాలస్యమగు చున్నదని లోనికిఁ జని వారి యద్భుత వాక్యార్థములను శాంతిఁ జెప్పించితిని.

శృంగా—(తనలో) స్వామినాథశాస్త్రిగారి యవస్థయే నాకును బట్టఁబోవుచున్నది. నా శిష్యుఁడగు రసికశేఖరుని వేశ్యాప్రియుని జేయుటకై నా బహిఃప్రాణమగు మంగ కప్పగించితిని గాని తుద కదియా యువకుని వరగి నన్నుఁ ద్రోసిరాజను ననుభయము గలుగుచున్నది. వారి సంధికి నేనే మూలమైనను శాకటాయనుని వలెఁ దల్లోపమును విధింపఁ దలఁచుచున్నాను. నా కా విషయములో నసూయ పుట్టుచున్నది. ఆహాహా! మానవవృత్తు లెంత విచిత్రమైనవి.

వసం—మిత్రమా! నీ వేదో యాలోచించుచున్నావు. అది చెప్పఁ దగినదైనచో నాకుఁ జెప్పుము.

శృంగా—మిత్రమా, వసంతకా! మఱి యేమియును లేదు. మన యేర్పాటుం గూర్చి యాలోచించుచున్నాను. అంజనము దిగ్విజయముగాఁ బారుచున్నదా!

వసం—అందుకు సందేహ మేమి? సంఘసంస్కారప్రియుల కందఱకును శుభలేఖ లంది యుండునా? సందేహమేమి? వారుగో, సంఘసంస్కారప్రియులు రసికశేఖరుని ముందిడుకొని గుంపులు గుంపులుగా వచ్చుచున్నారు. వారితోఁ గలిసి యచటికిఁ బోవుదము రమ్ము. అదిగో, బ్యాండు వాద్యముల చప్పుడు మంగతాయి యింట మిక్కుటముగా వినఁబడుచున్నది. మంగళసూత్రధారణ మగుచున్నట్లున్నది. (సంఘసంస్కారప్రియులం గని) మిత్రులారా! ఎచటికి చనుచున్నారు?

సం, ప్రి—ఎక్కడికని యడిగెద రేమి? గురువరులు చేయించుచున్న యా యుత్తమ వేశ్యారజస్వలావివాహసందర్శనార్థమయి యే పోవుచున్నాము.

శృంగా—మంచిపని చేయుచున్నారు. లోకములో జారత్వ మడుగంటు నట్లుచేయ వలయును. అందులకయి నేనును నీ రసికశేఖరుఁడును నీ యెత్తు నెత్తినాము.

సం, ప్రి—చాల మంచిపని. కాని, గురువర్యా, వివాహసమయమందు భోగముమేళ ముండునా? ఉండునని కర్ణాకర్ణిగ వినియుండుటచే మి మ్మీ ప్రశ్న వేయుచున్నాము.

శృంగా—గృహస్థుల యిండ్లలో జరుగు వివాహములలోనే మేళములు తప్పనియప్పుడు, వేశ్యాగృహములందు జరుగు వివాహములందు వేశ్యల మేళము లుండకపోవునా?

సం, ప్రి—మీయట్టి శుకతుల్యులు చేయించు వివాహములలోఁగూడ నవి యుండ వచ్చునా?

శృంగా—నేను వలదనియే చెప్పినాను. వేశ్యాగృహము బహు నాయకము. మాలో

వనేకులు వివాహము బాగుగాఁ బ్రచురముగుట కై మేళము పెట్టక తప్పదని పెట్టు చున్నారు. నేనుమాత్రి మా మేళములోనికిఁ బోయి కూర్చుండను.

సం, ప్రి—కటకటా! మన హిందూదేశమునందుఁ దప్ప మఱి యే యితర దేశము నందును జారత్వము ప్రధానముగాఁ గల పణ్యభామినులు లేరు.

రసిక—మీ యూహతో నే నేకీభవింపఁజాలను. మన దేశమునందు వలె నృత్యముచేఁ జీవించు నాటకత్తె లితరదేశములందు లేరేమో కాని పడపుఁ బడఁతులు లేకపోలేదు. పణ్యభామినులు మన దేశమునందుకంటె నితరదేశములందె హెచ్చుగఁ గలరు. ఒక్క లండను పట్టణమందె యెనుబది వేల పడపుఁ బడఁతులు గలరఁట. పారిసు మున్నగు పురములందును వీరి సంఖ్య ఘోరముగనే యుండునఁట. కావున, నా విషయములో మన దేశమును నిందింపఁ బనిలేదు. ఇంకను బరికించి చూడ మన దేశపు ధనసారులే నాగరికత గలిగి యంతఁగా హాని చేయనివారుగా నున్నారు. అబ్బేడుబాయి గ్రంథము చదివిన నీ యంశములు తెలియఁగలవు. మన దేశపు వేశ్యలన్ననో నృత్తగానములే వృత్తిగాఁ గలవారు గాని జారత్వమే ప్రధానజీవికగాఁ గలవారు కారు.

సం, ప్రి—స్త్రీలు పురుషులముందు తెయితక్కలాడుట పరమనింద్యము కాదా? ఏదేశమునందైన నిట్టిది కలదా?

రసిక—ఈ వింత మాట లేల? నాగరకత గల సమస్త దేశములందును గూడఁ గలదు. మనము మెచ్చుకొను పశ్చిమదేశమునందు కుటుంబినులే బహిరంగ సభలలో పురుషులతోఁగలసి నృత్యముచేయుటలేదా? అదియటుండ బట్ట విప్పివేసికొని యించుమించుగా దిసమొలతో స్త్రీలు స్త్రీపురుషులు గలసభలో నృత్తము చేయుటయు నది గొప్పవిశేషముగా యా దేశనాగరకులు తలంచుటయును గూడ కలదు కదా!

సం, ప్రి—మేళము పెట్టఁ దలఁచినప్పుడు మనలను బిలుచుట ధర్మమా?

రసిక—ఎందుకుఁ గాదు?

సం, ప్రి—మనము మేళము లంగీకరింపము కాదా?

రసిక—ఇట్టి సందర్భములో మన మంగీకరింపవలసినదే. ఇదివఱ కంగీకరించి తీరినాము.

సం, ప్రి—ఎప్పుడు? ఎక్కడ?

శృంగా—రాజమహేంద్రవరములో స్త్రీ పునర్వివాహములో భోగముమేళము పెట్టలేదా? మన సంఘసంస్కారప్రియు లెల్లరును జూచి యానందింపలేదా?

సం, ప్రి—ఆ వివాహ మపూర్వము గావున నది లోకుల సందఱు సాక్షించుట కయి

మనలోఁ గొందఱిచే భోగముమేళము పెట్టఁబడినది. అది ప్రధానులు పెట్టి యుండలేదు.

రసిక—ఇదియు నట్టిదే. అది గాక,

సీ. రామమోహనరాయ ♦ నామక విబుధుండు, వింతుల మేళముల్ ♦ పెట్ట లేదె?
ఆంధ్రవిద్యాసాగ ♦ రాఖ్యుండు చేసిన, పెండ్లిలో మేళముల్ ♦ వెలయ లేదె?
వెదురుపాకయందు ♦ వేశ్యల మేళంబు, కదుకొని మనవారు ♦ నడుప లేదె?
నాళమువారింట ♦ నాగరత్నము పాడ, మనవార లచ్చట ♦ మసల లేదె?
గీ. ముత్తవారింట పెండ్లిలోఁ ♦ జిత్త మలర, మన సఖులు మేళతాళముల్ ♦ గనరె వేడ్క
సత్యవాదిని మతి ధర్మ ♦ సాధనియును, బోధ చేయవె మనవారి ♦ కోక లెల్ల.

సం, ప్రి—వారిదియుఁ దప్పే యనుఁడు.

శృంగా—మనకు మేళములోఁ గూర్చుండుట కభ్యంతర ముండుటచేఁ బ్రక్కఁగా బల్లలు వేయింతుము. వానిపైఁ గూర్చుండవచ్చును.

సం, ప్రి—మనవారందఱును వచ్చుట కంగీకరించిరా?

శృంగా—అంగీకరించిరి. కలికాలమహర్షిగారును, పిండివోలు సంస్థానాధిపతులును రానై యున్నట్లు తెలిసినది. ఇదిగో, మంగతాయి మందిరమునకు వచ్చినాము. లోపలికిఁ బోవుదము రండు.

[అందఱును లోపల ప్రవేశింపుచున్నారు.]

## పదునాల్గవ రంగము.

మంగతాయి యింట పెండ్లి మందిరము.

[మేళము జరుగుచుండును.]

శృంగా—అదిగో లోపల పెండ్లి యయిపోవుచున్నది. ఈవల మేళము జరుగుచున్నది. (సంఘసంస్కారప్రియుల వైపు చూచి) మన మీ ప్రక్క బల్లలపైఁ గూర్చుండుదము. వసంతకా! మేళములోనికిఁ బోయి కూరుచుండుము.

వసం—నేను సభలో లేకుండిన నాసభ సభయే కాదు.

శ్లో॥ విద్వాంసః కవయో భట్టా । గాయకాః పరిహాసకాః
ఇతిహాస పురాణజ్ఞాః । సభా సప్తాఙ్గ లక్షణమ్॥

అని యభినయదర్పణము చెప్పుచున్నది. (అని సభలోనికిఁ బోయి కూరుచుండి పాముల దండముల నందుకొనును.)

సం, వి—మంగతాయి మేళములో లేదేమి ?
శృంగా—గానకళావిద్వాంసురాలగు మంగతాయి యిట్టి మేళములోఁ దిరుగునా ?
సం, వి—మేళము కట్టి దేశదేశములు తిరిగి పేరు పొందినఁ గొప్ప కవిటుల సంపా దించుకొనవచ్చునే !
శృంగా—మంగతాయివంటి సుప్రసిద్ధవిద్వాంసురాండ్రకది యవసరము కాదు.
గీ. పద్మినీ ఘనపరిమళ ♦ భరితపకాచు, దిశలు చెన్నార సద్దానిఁ ♦ దెలిసికొనఁగఁ
దిరిరి తిరిగి రేతెంచుఁగాఁ ♦ దేఁటి యటకు, ఖ్యాతిఁగాంచిన గణికల ♦ రీతు లివియు.
(సంఘసంస్కారప్రియులు శృంగారశేఖరునితోఁ గూడి బల్లలపైఁ గూర్చుండుదురు. వసంతకుఁడు 'కానిండు' అనుచున్నాఁడు. మేళము జరుగుచున్నది. ఒక వేశ్య నృత్యము చేయుచున్నది.)
వసం—మిత్రమా ! యీ ముద్దులగుమ్మ చేయు నీ నృత్యము గంటివా ?
గీ. కురులు చెదరంగ గురుకుచ ♦ గిరులు గదల
వేణి తూఁగంగను మృణాళ ♦ పాణు లూఁగ
కటి నటింప రటన మిడఁ ♦ గటకపాళి
† బడఁతి చేయు నృత్యము నేత్ర ♦ పర్వ మొసఁగు. 115
శృంగా—బాగుగాఁ జెప్పినావు.
గీ. లయకు సరియగు నృత్తంబు ♦ లలిఁ జెలంగ
శ్రుతికి సరియగు పాటలు ♦ శ్రుతులఁ దనుప
వర్గహిత హావమును నభిన ♦ యంబు పొదల
* నాటి నృత్యంబు రసికసం ♦ ప్రీతిఁ గూర్చు. 116
(ఒక రసికుఁడు తాను నొక తమలపాకులో నుంచి మొగ్గ వేసి తీసికొనుమనఁగా నాటకత్తె మొగ్గ వేసి తీయుచున్నది.)
శృంగా—(అది గని) మిత్రమా, ఈ మొగ్గవేసిన మోహనాంగిం గంటివా ?
గీ. కాముఁ డేనియెదు విలుకాఁడు ♦ కాముకాళి
నేయ మదిలోన భావించి ♦ యెక్కుపెట్టి
పట్టి పూవిల్లువాఁగను ♦ నమరి యుండు
మొగ్గ వేసిన యీ పణ్య ♦ మోహనాంగి. 117

† ఇద్ది తాడుచుండిన "పడఁతు లాడు నాటు నయన ♦ పర్వ మొసఁగు" అని చదువ వలెను.

* ఘనుల నృత్యమూ గూర్చెడు ♦ సంతసంబు.

వసం—మేలు. బాగుగఁ జెప్పినావు నీ యూహకు నేను గుణము హెచ్చించెదను మాడు.

గీ. వేణి యనెడు తేంట్ల గుణము ♦ వెలయు చుండె
ముగ్గ వేసిన యీ పద్మ ♦ ముఖి యొసంగు
కాముఁ డనియెడు విలుకాఁడు ♦ కాముకాళి
నేయు నెంచిన ప్రాకీల్లు ♦ విధము గాను. 118

విద్యార్థులు—(ఒకరి నొకరు మోచిరొని) ఈ మందిరశోభ యీ సుందర రూపరేఖా విలాసములు నాట పాటలుఁ జాల మనోహరముగా నున్నవి. మనము పరశీయ గ్రంథములలోఁ జదువుకొను దేవతాకన్యలవలె నీ మందయానలు కాన్పించుచున్నారు. ఇది మన మప్పుడప్పుడు దర్శింపఁ దగిన చోటుగా నున్నది. అదిగో, యీ సుందరి మనల నావలకు రా! సంజ్ఞచేయుచున్నది. అటు పోదము రండు. (అని కొందఱు పోయి నేలముపెనుక నిలచి మాట్లాడుచున్నారు.)

శృంగా—కృష్ణారావు! నారాయణరావు! గోపాలరావు! సభకుఁ బెద్దమనుష్యులు వచ్చుచున్నారు. మరబండ్లు ద్విచక్రికలు వచ్చుచున్నవి. మీరు నడుములు కట్టుకొని యత్తరువు, పన్నీరు, పారితికర్పూరపు పూసలు, చందన తాంబూలములు, జపాను విసనకఱ్ఱలు, జేబు రుమాళ్ళు నందఱకు నిచ్చుచుండవలసినది. కట్నములు వచ్చుచున్నవి. జాగరూకతతో నందుకొని పద్దులు వ్రాయుఁడు.

('మంచిద'ని వారట్లు చేయుచున్నారు.)

వసం—(ఆటకత్తెం జూచి) పిల్లా! పతాకహస్తలక్షణముం జెప్పు.

ఆటకత్తె—(సిగ్గుపడి తల వంచుకొనుచున్నది.)

వసం—హస్తలక్షణముఁ జూపు మనిన ముఖ లక్షణము మాటిన దేమి?

ఆటకత్తె—మే మభినయము చెప్పుకొనినాము కాని, శాస్త్రవిధులు నేర్చుకొన లేదండి.

వసం—అబ్బే, అదేమి? మీలో నెవరికి లక్షణము తెలియుదా?

వేశ్యలు—శాస్త్రలక్షణము మేము వర్ణింప లేము.

వసం—ఏదీ తాయి నిటు పిలువుఁడు.

[ఒక వేశ్య వెడలి తాయిని బిలుచుకొని వచ్చుచున్నది. తాయి ప్రవేశము.]

మంగ—(సభకు దండము పెట్టి) సభవారి సెల వైనదఁట. ఎందులకు?

వసం—(దండము పుచ్చుకొని) మీ వాళ్ళు పతాక హస్త లక్షణము చెప్పలేకపోయినారు. నీవు చెప్పఁగలవేమో యని పిలిపించినాము.

రసిక—(సంఘసంస్కారప్రియులం గని) తాయి మంచి విద్వాంసురాలు. నియమము లో నా లక్షణముఁ జెప్పివేయుము.

మంగ—శ్లో॥ అఙ్గుళ్యః కుఞ్చితాఽఙ్గుష్ఠః స్వంశ్లిష్టః ప్రసృతా యది
సపతాక కరః ప్రోక్తో నృత్య కర్మ విశారదైః॥
(అని లక్షణమును జదువుచున్నది.)

వసం—కాదు, కాదు దాని లక్షణ మది కాదు. దాని లక్షణము విను.
శ్లో॥ సంలగ్న తర్జనీ మూలే యత్రాఙ్గుష్ఠో నికుఞ్చితః
ప్రసారిత తథాఙ్గుళ్యః పతాకః ప్రభవేత్కరః॥

మంగ—అది మతాంతరము.

వసం—లాంగూలహస్త మెప్పుడు పట్టవలెను?

మంగ—శ్లో॥ లికుచస్య ఫలే బాలా కుచే కల్హారకే తథా
చకోరే క్రముకే బాల కిఙ్కిణ్యాం ఘటికాఽదికే
చాతకే యుజ్యతే చాఽయం లాంగూల కరనామకః॥

వసం—నీవు మంచి విద్వాంసురాలవే. నీ మేళములోనివాళ్లు తిండికడ నెన్ని హస్త విన్యాసములు పట్టగలెనో యన్నియుఁ బట్టఁగలరు కాని విద్వత్సభలో నభినయము పట్ట నేది పట్టవలెనో యా క్యాది పట్టలేరు.

శృంగా—ఎవరో మరబండి మీఁద పెద్దమనుష్యులు వచ్చినట్లున్నది. (మరబండి వచ్చినవైపు చూచి) పిండివోలు మహారాజుగారును కలికాల మహర్షిగారును వచ్చుచున్నారు. (అని వెళ్ళి వారిని దీసికొనివచ్చి, చావడిలోఁ గుర్చీలపైఁ గూర్చుండఁ బెట్టి వారిని గౌరవించుటకై కృష్ణారావు నేర్పాటు చేసి, తానుఁగూడఁ బ్రక్క కుర్చీలోఁ గూర్చుండును.)

(కలికాల మహర్షియు, పిండివోలు సంస్థానాధిపతులును శృంగారశేఖరుఁడుగారికి వందన మాచరింతురు.)

కలికా—శృంగారశేఖరుఁడుగారూ! మీరు కంట్రీ బాగు చేయడానికి చేసే వర్కు మిక్కిలి ప్ర్యాక్టికల్ ప్రెయిజువర్దీగా వుంది. ఈ కంట్రీ మీ మూలంగా యిమ్మీడియట్టిగానే సెకండింగ్లండు కాఁగలదని తలంచెదము. మీ కివిగో అనేక థ్యాంక్సు. మీ శక్తి ఇజ్ ఇన్డిస్క్రైబబిల్. పత్రికలలోఁ జదివితిఁదా! మీ పావన సహవాసమువలన మీ గుడ్ కాండక్టు గల మంగతాయి ప్యూరయి మన అట్టెంప్టుకు సక్సెస్సు కలిగించింది. అయ్యా మ్యారేజ్ సక్సెస్ ఫుల్ గా జరిగిందా?

శృంగా—బాగుగా జరిగినది.

కలికా—న్యూకపుల్‌ను, మంగతాయిని, రసికశేఖరుని మహారాజావారి కడకు రప్పింపుఁడు.

శృంగా—చిత్తము. కృష్ణారావు! నూత్నవధూవరులను, మంగతాయిని, రసికశేఖరుని నిటకుఁ దోడ్కొనిరమ్ము.

కృష్ణా—చిత్తము. (అని పోయి వారిని దోడ్కొనివచ్చుచున్నాఁడు.)

కలికా—పిండివోలు మహారాజుగారు నూత్న వధూవరులకు వేయియును నూటప దార్ల కట్నము నిచ్చుచున్నారు. (అని విలువగల నాణెపు కాగితము లిచ్చిరి) మంగతాయీ, నీవు చేసిన పావనకార్యమునకు మేము ప్లీజయినాము. ఓ వేశ్యలారా! ప్రతివేశ్య మ్యారేజి కయ్యే ఖర్చులున్ను, వేయి న్నూట పదార్ల కట్నమున్ను యిచ్చుటకు మా మహారాజుగారు డిటర్మిన్ చేసికొనినారు. జీవ దయా పరుని కృపచే వేశ్య లెల్లగ నీ ప్యూర్పొస్పుగో అసిస్టు చేయుదురుగాక! (మంగతాయియొక్కయు శృంగారశేఖరునియొక్కయుఁ జేతు లూపి) రసిక శేఖరా! నా కౌఁగిలిలోనికి రమ్ము.

రసిక—గురువర్యా! ఇదె వచ్చితి. (అని సమీపించుచున్నాఁడు.)

కలికా—మై డియర్ ఫ్రెండ్! నీవు ప్రైజ్‌వర్దిగా పని చేసినావు. నీ ఫేమ్ శాశ్వతముగా వరల్డులో వుండును. నీవు వేశ్యాగృహముల కన్నిటికిఁ జని వారి నీ రీతి గనె బాగుచేయవలయునని సంఘసంస్కారప్రియుల మందఱముఁ దలంచుచున్నాము. జీవదయాపరుఁడు నీ అటెంప్టుకు సక్సెస్సు గలిగించుఁ గాక.

రసిక—(తనలో) నేను సర్వవిధముల ధన్యుఁడ నైనాను. నాకు మంగతాయిపై మమత హెచ్చినది. దాని వలలోఁ బడినాను. నే నింక స్వేచ్ఛగా నే దాని యింటఁ దిరుగవచ్చును. నా కీర్తికి హాని యుండదు. మఱింత హెచ్చును. (సైకె) మహార్షి సత్తమా! ధన్యుఁడ నైతిని. ఇదిగో! ఈ నూత్నదంపతులకు నేను రెండు వేయును నూటపదార్లు చదివించుచున్నాను. (అని చదివించుచున్నాఁడు. మఱి కొందఱుఁ గూడఁ జదివించుచున్నారు. వసంతరుఁడు వచ్చు కట్నములు చదువును)

మంగ—(సభవారివంకఁ జూచి) ఇఁక నూరేగింపు గావలసి యున్నది. కావున నేఁటికీ సభఁ గట్టివేయుదము. రేపు గానసభ గావింపఁబడును. కృష్ణారావుగారూ, అందఱకును దాంబూలాది సత్కారములు ముట్టినవా?

కృష్ణా—ముట్టినవి. (అందఱును లేచి వెళ్ళిపోవుచున్నారు. ఒక పెద్దమనుష్యుఁడు శృంగారశేఖరుని చెవిలో నేదియో చెప్పి వెళ్ళిపోయినాఁడు. మంగతాయి, వసంతరుఁడు, శృంగారశేఖరుఁడు నీవల మిగులఁగాఁ దెర పడును.)

శృంగా—(తనలో) నా మిత్రులగు సంఘసంస్కారప్రియు లెల్లరును మంగ యింటికి వచ్చి దాని వైభవముం గని మెచ్చి దాని కడకు నేను జనుట లోక హితార్థ మనుకొను స్థితికిఁ దెచ్చినాను. నన్నుఁ దిట్టువారిఁ బడఁగొట్టినాను. (పైకి) మంగతాయీ, మన యంజనము బాగుగఁ బారినదా ? నీకు ధనము యశో ధనముఁ గూడ దీని వలన లభించినవి.

మంగ—చిత్తము. అంతయు మీ కటాక్షవిశేషమువలన.

శృంగా—మంగతాయీ, ఈ సంతోషసమయమున నొక చిన్న విచారకరమైన సంగతి కూడఁ దెల్పవలసివచ్చినందులకు ఖిన్నుఁడ నగుచున్నాను.

మంగ—(ఆతురతతో) ఏమది ?

శృంగా—ఏమియు లేదు. నేను సదా నీతోఁ గూర్చుండి యుండి ధనధాన్యాదికము నీ పరము చేయుచు వచ్చుచుండుటచేత నింటివ్యవహారము చిక్కులోఁ బడి పోయినది. అప్పులవాండ్రు హెచ్చిపోయిరి. కొన్ని వ్యాజ్యములు పడినవి. కొన్ని తీర్పులయినవి. కొన్ని పాటలోఁ బడినవి. ఈ చిక్కులం గూర్చి నా మిత్రుఁ డొకఁ డిప్పుడే చెవిలోఁ జెప్పిపోయినాఁడు. మా యిల్లుఁగూడ నేఁడో రేపో ఘోషణపూర్వకక్రియమునకుఁ బాలగునఁట. కావున మనస్సు కొంత కలవర పడుచున్నది.

మంగ—మీకు కలవర మెందుకు ? నేను కృతఘ్నురాలనా ? వ్యవహారలోపము రానీయను.

శృంగా—(తనలో) నీ కృతజ్ఞత క్రమక్రమముగాఁ దెలియ వచ్చుచున్నది. (పైకి) అంత యెందుకుగాని ప్రస్తుతము మనశ్శాంతికై నీవు నేను వసంతకుఁడు (ముందుకు జూపి) యా వచ్చుచున్న కవిగారును నలువురము నుద్యానవనవిహారము నొనరించి లతామందిరమునఁ జీట్లాటతోఁ గొంత కాలహరణ మొనరించుకొందము.

మంగ—అట్లే యగుఁగాక. ఆ వచ్చువా రెవరు ?

శృంగా—ఆ వచ్చువా రొక కవివరులు. నా మిత్రులు. తమ కవిత్వమునకు వన్నె వచ్చుటకై నీయట్టి గణికామణులతో సహవాసము చేయనెంచి నా ద్వారముగా నీమైత్రి నపేక్షించుచున్నారు. నీవు వారి నెఱుఁగవు, గాని వారు నిన్నెఱుఁగుదురు.

మంగ—మహాభాగ్యము. తప్పక దయచేయుదురుగాక. దయచేయుఁడు కవి గారూ!

(అని నలువురు నుద్యానవనమునకుఁ బోవుచున్నారు.)



## పదునాఱవ రంగము.

### శృంగారోద్యానవన పరిదర్శనము.

శృంగా—(వసంతకునితో రహస్యముగా) చెలికాఁడా! మనము చేయఁదలఁచిన వన్నియు లెస్సఁగఁ జేసితిమి. ఇఁక నా మనస్సు విఱుగుచున్నది. నా యవస్థను బరికించి చూచుకొనఁగను వేశ్యల నీచవ్యాపారములఁ బరిశోధించి చూచుకొనఁగను నా మనస్సు వేశ్యాప్రియత్వము నుండి క్రమక్రమముగాఁ గొంత విముఖత నొందుచున్నది.

వసం—(రహస్యముగా) అది సత్యమే యగునెడల నీకు శ్రేయస్సే కలుఁగును. కాని కొంత విఱిగిన దనుచున్నావు. ఇంకను వేశ్యా ప్రియత్వము పోలేదనియే తోఁచుచున్నది. నీ వయస్సు ముదిరిపోయినది. డెబ్బదేండ్లు దాఁటినవి. ఇఁకనైన ధర్మమార్గమునఁ బడుట యుచితము. ఇంకను నీ యత్తరు పన్నీరు లేల? సెంటుబుడ్లేల?

శృంగా—(తనలో) పుట్టినబుద్ధి పుడకలతోఁ గాని పోదు. వీని దృష్టి నితరాంశముల మీఁదికి మరల్చెదను. (పైకి) అదిగో! అటు చూడుము.

ఉ. కోకిల కాకలీ ధ్వనులు ♦ కూర్చుచు నుండఁగ మోదమెల్లఁ బ
ద్మాకర వారి పూరములు ♦ యంత్రములం బడి వాన వెట్ట, శో
భాకర పుష్ప పల్లవ వి ♦ భాసితమై తరుపాళి యొప్పఁగా
శ్రీకర మౌచుఁ బుష్పవన ♦ సీమ వెలింగెడు కంటివే సఖా! 119

వసం—(విస్మయముతోఁ దనలో) విషయము మార్చివేసినాఁడు. బహుకాలను ముండలమిండఁడై యున్న యీతఁ డొక్కసారిగా మనస్సు నా దుర్వృత్తినుండి మరలించుకొనఁ గలుగునా?

శృంగా—ఆహా! ఇచ్చట మలయమారుత మెంత మనోహరముగా నున్నది.

గీ. పుష్పవతి యౌ లతాతన్వి ♦ ముట్టి యుంటు, విమల శీతల వారిలో ♦ విధిగ మున్గి
మలయ పవనుండు మెలఁగెడు♦మందగతుల, పుష్పవతి వంటు భయమింకఁ♦బుట్టకుండ.

మంగ—(నవ్వుచు) ఆర్యా, విటపాళి యాచారము వేఱు కాదా? పుష్పవతి యగు కొమ్మయందే పల్లవసంయోగమును శోభిల్లుట కలదు గదా!

శృంగా—(నవ్వుచు) తాయీ, ఈ లతిక చెట్టునంతను వెట్టు, లల్లిబిల్లిగ నల్లుకొని యున్నదో చూచితివా?

ఉ. అల్లన ముందుగాఁ బదము ♦ నంటి పదంపడి పైకిఁ బ్రాఁకి, మే
నెల్లను గౌఁగిలించుకొని ♦ యింపెసలారఁగ రక్తిఁ జూపుచుం
జల్లన పాణులన్ శిరము ♦ పైనను జేరిచి వృక్షరాజమున్
బెల్లుగ లోఁగొనెన్ దరువు ♦ పేయును నూరును మాపి వేశ్యనాన్. 121

మంగ—తుదకు మీరుకూడ మా మీఁద బాఁదులు బాఁదుటకు మొదలుపెట్టినారా ?

శృంగా—(నవ్వుచు) నేను సత్యముం దెల్పితిని. ఈ లతాతన్వి చేసిన పని వర్ణనీయ
మనియే నా తలంపు. (వసంతకునిఁ జూచి)

గీ. కంటివే సఖ యీ పంతి! ♦ గణిక లెల్లఁ
బట్టి కరముల నావల ♦ పాఱుఁ గూర్చ
మొల్ల యాలగారి సుమనఃప్రి ♦ మోద మెలమి
గలుగఁ జేసెను వగపాళి ♦ కాంక్షలడర. 122

ఇక్కాలమున విటపాళి స్థితిగతులం గనుము. (మంగతాయిం గని)

గీ. కలికిరో! కొమ్మలందున ♦ వెలయు పల్ల, వాళి ముదిరి నిస్సారత ♦ నంది రాల
వెంటనే క్రొత్త పల్లవ ♦ పంక్తి యుదయఁ, గ్రాలుఁ గంటివె యిప్పటి ♦ కాలమందు

మంగ—(తనలో) ఓహో! నేను రసికశేఖరునియందు మోహము పెట్టుకొని తన్ను
దోఁపిరా జనునట్లు సూచించుచున్నాఁడు. నేను వీనిపై నేరము వేసెద. (పైకి)

గీ. క్రొత్త కొమ్మల నింపుగాఁ ♦ గూడి యుండి
ప్రాఁత కొమ్మల కాకుల ♦ పాటుఁ గూర్చెఁ
గంటె! ప్రియుఁడ యీ పున్నాగ ♦ కఠిన చర్య
యిట్టిదే కద విటపాళి ♦ యింపు లహహ. 124

(అని యొక పొన్నవైపు చూపుచు) శృంగారశేఖరులారా! మీ మతము మాటినట్లు
తోఁచుచున్నదే. ఇటుఁ గనుఁడు.

గీ. గణిక యదె విమలామోద ♦ గరిమ వెలయ
సరస తరముగ ఘనతరు ♦ స్కంధమంటి
మించి యలరారుచును గౌఁగి ♦ లించెఁ బ్రియుఁడ
యిట్టి కలయిక లెవ్వరి ♦ కింపు నిడవు. 125

శృంగా—చిన్న రహస్యము తెల్పుట తప్పా ? దాని కేమి గాని, యీ యశోకవన
శోభ వర్ణనీయము గాదా ?

శా. కన్నాగంగను గాంచినావె సతి యీ ♦ కందర్ప రాజోన్నతుల్
త్రిన్నల్ తన్నఁగ నమ్ము మిన్న లెలమిన్ ♦ ధన్యత్వమున్ గాంచుచున్

విన్నాణం బగుశోభ లొందిరసం ♦ వేత్తల్ సదా మెచ్చ నో
లి న్నవోద్భవులఁ బూని యుండు విటపా ♦ లిట్టే మోద ముప్పొంగఁగన్. 126

ఇటు చూడుము.

గీ. రంగురంగుల వేషముల్ ♦ తోఁగఁగొంచు, అధరమధువానఁ గొమ్మల ♦ నుండ నెలమి
చేరి తిరిగెడు నీ యారు ♦ చిలుక లొప్ప, వేశ్యవాటికఁ దిరిగెడు ♦ విటుల యట్ల.

మంగ—మేలు. ఏ పోతుపుత్తునో మీ వృత్తి మాటిమా న్నట్లున్నది.

శృంగా—అది యెన్నటికిని మాఱునది కాదు.

మంగ—

గీ. కంటె పొదరింట పిచ్చుకల్ ♦ జంట గూడి
చిన్ని మునుముక్కులను విప్పి ♦ చెవుల కింపు
గొఱలు సల్లుఁగఁ గిచకిచఁ ♦ గూఁత లిడును
టెక్కలార్చుచు విహరించు ♦ రీతులెల్ల. 127

శృంగా—అన్యోన్యానురాగ మున్నచోట్ల నెంత మురిపమైన నుండును. కోర్కు
లన్నియుఁ గొనసాగును.

మంగ—

గీ. తియ్యమామిడి పండ్లను ♦ దెచ్చి పెట్టి, యొయ్య నొయ్యనఁ బరిచర్య♦లొనరిచి తమి
కీరి కీరికంటి చూపుల ♦ సౌరు నందఁ, గీర మాఁగూటఁ దివిరెడు ♦ ధీర కంటె. 128

శృంగా—మారునిచేఁ గూర్పఁబడు జంటల చతురత వర్ణనీయము గదా! (నూత్నకవి
నుద్దేశించి) కవిశేఖరా! చిగిర్చియున్న యీ మావిగున్నను వర్ణింపుము.

నూత్నకవి—(కొంచె మాలోచించి)

ఉ. అల్లదె మావిగున్న యల ♦ రారెడు భీకర శాణ శోణ వ
త్పల్లవ కాండ షండ పరి ♦ భాసుర మౌచును పాంథు గుండియల్
తల్లడ మొందఁ గోకిలలు ♦ తత్పరతం గని మోదమంద నా
సల్లలితాత్మసంభవ వి ♦ శాల వినూతన తూణమో యనన్. 129

శృంగా—మేలు. బాగుగా వర్ణించితివి. వసంతకా, ఆ పూచిన మోదు గెట్లున్నది?

వసం—(ముందునకుఁ బోవుచు)

మ. అదిగో మోదుగుఁ గాంచితే సఖుఁడ గ ♦ క్తామేయనూనా చ్ఛసం
పద లొప్పంగను బ్రేకుకాళి మదిలో ♦ భావోన్నతుల్ పొందఁగా
మదనాఖ్యాసురభర్త తానుఁ దినఁగా ♦ మత్తాత్మతం బొంధరా
ట్సుదతీమాంసపురాశిఁ గూర్చె ననఁగన్ ♦ శోభిల్లు రాగోన్నతిన్. 130

శృంగా—బాగుగాఁ జెప్పితివి. సఖుఁడా! యీ పచ్చికపట్టుఁ జూచితివా?

గీ. దట్టమగు నను పచ్చిక ♦ పట్టునందు, నడుమ రంగుల పూఁదీవ ♦ లడరుచుండ
సంచులై వన్నెవన్నెల ♦ యాకు లొప్పఁ, జిత్రకంబళి మట్టులీ ♦ చెలక యొప్పు.

వసం—గీ. కాంచివాఁడవె సఖుఁడ, యీ ♦ ఖండమందుఁ
బచ్చమొక్కల యమరిగ ♦ పంక్తి దనరు
"దేవుఁడో మూత మిమ్మ"ను ♦ తెలుఁగు లిపుల
నేత్రపర్వంబుఁ గూర్చుచుఁ ♦ జిత్ర గతుల. 132

[తెరలో] అక్కా! అక్కా!

మంగ—(ఆలించి) ఎవరది?

[తెరలో] చకోరాక్షిని. (అని తెర ప్రక్కనుండి చకోరాక్షి తనకడకు రమ్మని మంగతాయికిఁ గనుసన్న చేయుచున్నది.)

మంగ—(చకోరాక్షికడకు పోయి) ఏమి? ఎందుకు బిలిచితివి?

చకోరా—(మెల్లఁగా) రసికశేఖరులవా రొక రహస్యలేఖను నీకుఁ బంపిరి. అది నీవే విప్పి చూచుకొనవలెనని భటునితోఁ దెల్పిరఁట. ఇదిగో, యాలేఖ. (అని సంచి నందిచ్చుచున్నది

మంగ—(సంచి నందుకొని దానిని చించి, లో నొక సంచి యుండ దానిని గూడ చించివైచి లేఖను చదువుకొని నవ్వుచుఁ దొందరపాటున రైకజేబులో సగము సగము పెట్టుకొని) సరే, చకోరాక్షీ, నీవు వెళ్ళుము.

(మంగతాయి శృంగారశేఖరాదుల తావునకుఁ జనినది. తెరలోనికి చకోరాక్షి వెళ్ళిపోయినది.)

శృంగా—అదిగో, లతాగృహమునకడకు వచ్చినాము.

శా. నాళోద్భూతసరోవరాంబుకణముల్ ♦ నవ్యాప్తిఁ జెన్నారు నీ
కేళీమందిరసక్తవల్లికల సం ♦ క్లృప్తంబు గావింప నే
వేళన్ శీతలవాతపోతములచే ♦ వ్రేలాడుచున్నట్టి యీ
నాళీకాకరతీరపుష్పగృహ మా ♦ నందంబు తాఁ గూర్చెడిన్. 133

సఖులారా! ఇందుఁ గూర్చుండి చీట్లాటతోఁ గొంత కాలయాపనము చేయుదము.

(వసంతకుఁడు తన కంచుకమునుండి చీట్లకట్టుఁ దీయఁగా నలువురుఁ గూర్చుండి చీట్లాడుచున్నారు.)

మంగ—రూపాయి రూపాయి పందెము.

మిగిలినవారు—సరే యట్లే యగుఁగాక.

(వసంతకుఁడు చీట్లఁ గలిపి పంచి, నాలుగు ముక్కలఁ గ్రిందనుంచఁగా)

కవి— ఒకటి.

తక్కినవారు—ఒకటి, ఒకటి, ఒకటి.

కవి— రెండు.

తక్కినవారు—రెండు, రెండు, రెండు.

కవి—మూడు.

మంగ—(క్రిందిముక్కలఁ దీసి చూచుకొని) కలిసినది. కలిసినది.

వసం—కలిసి వచ్చుట వింత కాదు.

మంగ—ఏమి ?

వసం—రాజులు, జాకీలు, పదులు, తొమ్మిదులు మొదలగు పెద్దసరకు నీ చేతిలోనికే వచ్చుచుండ నీవు గెలుచుట యబ్బురమా ?

శృంగా—నీ యాట యంత జయప్రదముగ నున్నయెడల ముక్కలఁ జూపివేయుము.

మంగ—చూపుట యెందుకు ? ఆడుఁడు.

వసం—అట్లయిన ముక్కలఁ దీసివేసి తురుఫు చెప్పుము.

మంగ—(ముక్కలు తీసివేసి) ఇస్పేటు తురుఫు.

కవి—ఆరసు రాణి నాడితి.

మంగ—ఇదిగో ! ఇస్పేటు జాకీతోఁ గోసితిని. (తక్కినవారందఱు ముక్కలు వేయుచున్నారు.)

కవి—ఆహా ! రాణి జాకికి లొంగిపోవలసివచ్చెఁ గదా !

వసం—తురుఫులోఁ జేరిన సెట్టివారికైన నఖండశక్తి వచ్చును గదా.

మంగ—(పట్టుఁదీసికొని) ఇదిగో, ఇస్పేటాసు నాడితిని.

శృంగా—కటకటా ! నాయొద్ద నొంటిరా జుండుటచే వృథాగఁ గూలిపోవుట తటస్థించుచున్నది. (అని యిస్పేటు రాజును వేయుచున్నాఁడు.)

వసం—(పకపక నవ్వి) తగు బలములేకున్న నొంటిరాజేమి చేయఁగలఁడు ? (తక్కినవారందఱు తురుఫులు వేయుచున్నారు.)

మంగ—ఇఁక గెలిచితిని. నాకడ తురుఫులాసు మదాం జాకీ రెండుపాళ్ళు, మారాసు గలవు.

వసం—రాజును వశపఱచుకొనినతరువాత నిఁక గెల్చుట కభ్యంతరమేమి ?

శృంగా—గెల్చునెడల నీ యాటఁ జూపివేయుము.

మంగ—(ఆట చూపివేయుచున్నది. ఓడినవారు మంగతాయికి రూప్యముల నిచ్చుచున్నారు.)

వసం—కవిగారూ! చీట్లాటపై పద్యము చెప్పండి.

కవి—

క. చీట్లాటకుఁ బూనినచో, నట్లెట్లన రానికోర్కి ♦ మడరును వాపై
నెట్లాటకి వారికైనను, బోట్లాటలు తప్పవయ్య ♦ పురుషవరేణ్యా! 134

వసం—మేలు. ఆశుకవిచక్రవర్తీ! మేలు. ఏమి మార్దవముగను గంభీరభావయుక్తముగను జెప్పితివి! చీట్లాట విదేశక్రీడ. మనదేశపు టాటలఁ గందపద్యములో వివరించి చెప్పఁడు.

కవి—(తలయెత్తి యాలోచించి)

క. పులి జూదము చతురంగము, పాలుపొందు దశావతారి ♦ బుద్ధిదకేళుల్
ఇల పాచికలగు వ్యసనం, బల యుప్పట్టియుఁ జెనుగుడి ♦ యర్భకకేళుల్. 135

వసం—బాగుగనే యున్నది కాని, కవిత్వమున మాధుర్యము తక్కువ. కవిత్వములోఁ బదలాలిత్య ముండవలెను. ధ్వని యుండవలెను. అవి లేకున్నఁ గవిత్వము కాదు. యతి ప్రాసము లనవసరము. నే నొక శూన్యకందమును జెప్పెదను. అది యెట్లున్నదో చెప్పఁడు.

కవి—ఏదీ! చెప్పఁడు.

వసం—

గీ. పాలు పెరుగు నేయి ♦ పంచదార, చందనము కర్పూరగంబు ♦ చలువనీరు
వెండి బంగారు మీగడ♦వెన్న జున్ను, కరులు సికరట్లు కెంపులు♦నగలు హాయిలు.

ఇది శూన్యకందము ఇది యెంత మనోహరముగా నున్నది.

కవి—ఇందుఁ గందపద్యలక్షణ మేది?

వసం—శూన్యకంద మంటిని గాదా? లక్షణ శూన్యము అగుటచే శూన్యకందమైనది.

కవి—యతి ప్రాసము లేవి?

వసం—శూన్యకందములో నవియు నుండవు.

కవి—భావమును శూన్యము కాఁబోలును. సర్వశూన్య కందమా?

వసం—కాదు. ఎంతయో భావము కలదు.

కవి—క్రియయే లేదే! ఇందు భావ మెట్లుండఁ గలదు?

వసం—ఇందున్న పాలు పెరుగు మున్నగు వస్తుజాల మంతయు నీకు నాకు లోకమున కంతకును గలుగుఁగాక యని ధ్వనించుచున్నది. ఇన్ని వస్తువుల వర్ణించు

నప్పుడవి కలుగవలెనను ధ్వని దానియంతట నది పుట్టదా ? ఇది యేధ్వని. లేనిపోని నియమములఁ బెట్టుకొని సహజధారను పాడుచేయుట ధర్మము కాదు. మఱియును నెల్లకాలమును శార్దూలముల తోడను, మత్తేభములతోడను లోకమును భీతిల్లఁ జేయుటలో స్వారస్యము లేదు. క్రొత్త వృత్తములు వ్రాయుచుండవలెను. పలక సరులు, తుమ్మకాయ గొలుసులు మున్నగునవియు, మత్తమహిషవృత్తము; కాంగఱు కందము మున్నగునవియు స్వేచ్ఛగాఁ జెప్పినగాని మన కవిత్వము పరిపూర్ణదశ నొందదు.

కవి—(ఆశ్చర్యముతో) తక్కినవాని కేమి. కాంగఱుకంద మన నేమి ?

వసం—శార్దూలము, మత్తేభము వలెనే 'కాంగఱు' అనునది యొక జంతువు. దానికి ముంగటికాళ్ళు చిన్నవిగను వెనుకకాళ్లు పెద్దవిగను నుండును. కందమునందలి చిన్నపాదములు ముందు పెట్టి పెద్దపాదములు వెనుకఁ బెట్టిన కాంగఱుకంద మగును. చూడుము.

కాంగఱు కందము. కమ్మని పప్పులు కూరలు
ముమ్మరముగ బాలు పెరుగు
ఘుమ్మనఁ బరిమళము నిచ్చు ♦ గోఘృతము వరా
న్నమ్మును భుజియించువాఁడు ♦ నరశేఖరుఁడా. 137

ఇదియే కాంగఱుకంద మని పిలువఁబడుచున్నది. కవిత్వ మెట్లుండవలెనో చెప్పెద వినుఁడు.

క. విగతాలంకృత యగుచును, విగళిత బుధవిహిత సూత్రి ♦ విభవోన్నతయున్
సుగమరస కలిత భావయు, నగుచుఁ గవితావధూటి ♦ యడరఁగవలయున్. 138

కవివరా ! కవిత నడక యెట్లుండవలెనో నీవు చెప్పుము.

కవి—వినుము.

గీ. కవిత చెప్పిన రవిరథ ♦ గమన వేగ, ధిక్కరణ సూచి ధిమధిమ ♦ తీవ్రనాద
ధూర్వహాయసమార్గగ ♦ ధూమశకట, చటులగతి రంజకంబయి ♦ సాగవలయు.

వసం—అటుల కాదు.

గీ. కవిత చెప్పినఁ బరిపూర్ణ ♦ గర్భ కలిత, సుందరీమణి వగ లొప్ప ♦ సొంపు గులుక
మంద మందముగఁ బదార♦విందములను, పొందుగాఁ బెట్టు చందంబు♦పొందవలయు.

కవి—మన కీ వాదమేల ? శతాధిక గ్రంథకర్తలగు శృంగారశేఖరుల వా రున్నారు కారా ? వారి యభిప్రాయముఁ దీసికొందము.

శృంగా—వినుఁడు.

శుద్ధాంధ్ర నిరోష్ఠ్య కందము.

చల్లఁగఁ జను టొక్క తఱిలోఁ, జల్లనఁ దగు తొరఁ కలిగి చెలి ♦ సఁగుటయు నొకచో
నల్లిక జిగి యొక్కొకచో, నల్లిన యెడఁ గయిత చెంతో ♦ యలరుచునుండుఁ. 141

వసం—కవిగారూ! "మీరును మీరు మీరు మఱి మీరును మీరును మీరు మీరలుఁ"
అను సమస్యను బూర్తి చేయుఁడు.

కవి—(ఆలోచించి) వినుఁడు.

ఉ. వారక మాతృభూమియెడ ♦ వర్తిలు భక్తిని జేసి గ్రామసం
చారము చేసి చేసి జన ♦ సంఘము లెల్ల స్వదేశవస్త్ర సం
ధారణ మూన బోధలను ♦ తప్పకఁ జేయుఁడు ధీరచిత్తులై
మీరును మీరు మీరు మఱి ♦ మీరును మీరును మీరు మీరలుఁ. 142

మంగ—అబ్బో! కవిగారు స్వదేశీ కాఁబోలును.

కవి—లోకములో నిట్టియూహ లిప్పుడు వ్యాపించి యున్నవి కావునఁ గాలానుగుణముగఁ జెప్పితిని.

వసం—మన కవిగారి కవిత్వమునందు సరసత తక్కువగాఁ గాన్పించుచున్నది. అది వేశ్యతోఁ జీట్లాడినంతనఁ గలుగదు. "సుకుమార వారవనితా జనతా ఘనతాప హార సంతత మధురాధరాధర సుధారస ధారలు" గ్రోలినం గాని కలుగదు. (చెవి యొగ్గి యాలకించి) వీధిలో నేదో డప్పు చప్పుడు వినఁబడుచున్నది.

(అందఱు నాలించి) ఏదో యాస్తిని గూర్చిన దండోరా వలె నున్నది.

(అని చెవి యొగ్గి విందురు. ఈవల డప్పువాఁడు ప్రవేశించి డప్పుకొట్టి) మూనా, రానా, మూనా, పానా, లానాపల్లని యప్ప శెట్టిగారి కీయ వలసిన బాకీ యిసయంలో శృంగార శేఖరుఁడుగారి యిల్లు కోర్టోరు ఏలంపాడతాగంటు. రేపు మూడు గంటల యేళ పాడీవోరు రావలసిందోహోయి. (అని కేక వేయుచు, పోవుచున్నాఁడు.)

వసం—ఏమి! మన శృంగారశేఖరుఁడుగారి యిల్లే! పాపము!

శృంగా—ఊఁ-హూఁ-వణిజుఁడు తొందరపడినాఁడా? ఇప్పుడు చేతిలో డబ్బులేదే?
(అని యాలోచించుచున్నాఁడు.)

కవి—(మంగతాయిం జూచి) ఇట్టి సమయములో నీ వేమియు మాట్లాడవేమి?

మంగ—తల్లి చాటుదానను. నే నేమి చెప్పను? నేనును నావిషయమై యాలోచించుచున్నాను. మా యమ్మ రాక్షసి.

కవి—నీ విప్పుడు చేయవలసినది గృహము వేలము కాకుండ నాఁపుట. నీ భాగ్యమున కంతకును నీతఁడే కారణము. అయినను నీ ఋణమున నీతఁ డెన్నఁడును నుండు

కవి—(తనలో) ఓహో, వసంతగమన మిషమీఁద దల్లి తాయికి బుద్ధి చెప్పుచున్నది. గ్రీష్మాగమన మిషమీఁద నేను చెప్పఁదలఁచినది చెప్పెదను.

మంజరి. ఎండ చిగురు లెల్ల ♦ నింపు మీఱంగ
గూఁడీవు కట్టంగఁ ♦ గూర్చెడు నట్టి
కీర్తిమంతుం డగు ♦ గ్రీష్ముండు వచ్చె
'కావు' మం చార్వుమా ♦ కాకమా నీవు. 145

మంగ—(తనలో) ఇతఁడు నన్ను రసికశేఖరుని నుద్దేశించి పలుకుచున్నాఁడు కాఁబోలు.

[తెరలో] మంజరి. మలయానిలం బను ♦ మఱివీవన నిడి
విసరించి జీవుల ♦ వివిధ మార్గముల
నానంద పఱిచెడు ♦ నామని యేఁగె
'కో' యని పాడకే ♦ కోయిలా యింక. 146

కవి—మంజరి. ప్రకృతి యనెడునట్టి ♦ పణ్యభామినికి
సలలితకర్ణపు ♦ ష్పంబులు గాఁగఁ
బారు శిరీషముల్ ♦ చాలఁగాఁ గూర్చి
కైసేయు గ్రీష్ముఁడు ♦ కడువడి వచ్చె
'కా'యని కూయుమా ♦ కాకమా నీవు. 147

[తెరలో] మంజరి. ఇంత మేఁతను గూర్చ ♦ నిగు రెండిపోయె
ఫలము కానఁగ రాదు ♦ పట్టి మాడంగ
చూతంబు విడనాఁడి ♦ చూడు మన్యంబు
'కో' యని కూయకే ♦ కోకిలా యింక. 148

(మంగతాయి) యొక పురుగుమీఁద వ్రాఁక మేను సవరించుకొనుచుండ నొక కాగితము జారి యీవలఁ బడును.)

కవి—(అది గని మెల్లఁగ తాయికిఁ దెలియకుండ దానిని దీసికొని చదివి చూచుకొని శృంగారశేఖరుని గని పైకి మెల్లఁగ) మిత్రమా! నిన్ను వెడలఁగొట్టుమని నీ ప్రియశిష్యుఁడును నిదే యుత్తరము వ్రాసినాఁడు.

శృంగా—ఏది చదువుము.

మంగ—(అది విని పైకెత్తి జేబు తడివి చూచుకొని అదరిపడి పైకి) అది నా రహస్యలేఖ. మీరు చూచుటయుఁ జదువుటయు ధర్మము కాదు. నాది నా కిచ్చివేయుఁడు. (అని చేయి చాఁచుచున్నది.)

శృంగా — నీ రహస్యలేఖలఁ జగుప్పుటకే మా కధికారము కలదు చదువ నిమ్ము. (అని చేయి త్రోసి వేయుచున్నాఁడు.)

మరిగ — (తనలో) పోనిమ్ము. ఆ లేఖ వీరు చూచుటయే మంచిది. ఈ ముసలిరసికుని నా నోటితో నేఁ బొమ్మనుటకంటె నా లేఖ నుండి యది యాతఁడు గ్రహించుకొనుట మంచిది. (అని చాఁచిన చేయి తీసివేసికొనినది.)

కవి — చదివెద వినుము (అని చదువుచున్నాఁడు.)

శ్రీరస్తు సౌభాగ్యవతి యగు నా యనుంగు మంగను దీర్ఘాయురారోగ్యైశ్వర్యాభివృద్ధిగ బహుశతసహస్ర వివిధమనఃకృతచుంబన పూర్వకముగా దీవించి వ్రాయు కామలేఖార్థములు.

నా బహిఃప్రాణమా,

మన మిద్దఱమును నొకరి నొకరు చూచుకొనిన ముహూర్త విశేష మెట్టిదో కాని మన యేకీభావము కీర్తికరమును నానందదాయకమును నై శోభించుచున్నది. ప్రియా, నిన్నొక నిముస మయిన నెడబాసి యుండుటకు నా మన స్సంగీకరించుట లేదు. ఇట్లుండ నో హృదయనవనీతాపహారిణీ, పాడుదైవ మొక చిన్ని యెడబాటును గలిగించినాఁడు. నే నింట్రికిఁ జనుసరికి కాళీఘట్టమునుండి యత్యవసరముగ నచటికి వెంటనే రావలెనను తంతీవార్త వచ్చినది. నే నీసాయంకాలపు పొగబండిపై కాళీఘట్టమునకు విధి లేక చనుచున్నాను. నా మనశ్చంచరీకక్రీడారామమా, నా యీ యపచారమును సహింపుము. నా మనోహారిణీ, నా బొందియొచటికేగినను నా హృదయేందిందిరము మాత్రము నీ వదనారవిందము నందే వ్రాలి యుండును. ప్రేయసీ, నేను కొలఁది దినములలోనే తిరిగి వచ్చెదను. నేను వచ్చునప్పుడు నీ దేహగేహములకుఁ దగు నపూర్వాలంకారములఁ దీసికొని వచ్చెదను. నా ముద్దులగుమ్మా, నే నింతయు నీ యెడబాటొల్లనివాఁడ నగుటచే నేను వచ్చిన తరువాత నీ యునికి నా యింటిలోనికి మార్పఁ దలంచితిని. నా చక్కెరబొమ్మా, నా లక్ష్మియు, నా యర్థాంగలక్ష్మియు నీ వేడుక చెలికత్తెలై యుండఁ జూడవలెనను కోరిక యమితముగఁ గలదు. ప్రాణనాయికా, ఈలోపల నా ముసలిగురువుగారి కుద్వాసనము చెప్పుము. నా హృత్పద్మచక్రవాకీ, ఆ ముదుసలి యాతంకము వదలినఁగాని మన మవిచ్ఛిన్నసుఖ మనుభవింపఁ జాలము. నాముద్దు, నాముద్దు. నాముద్దు. నాముద్దు.

ఇట్లు,

నిష్కళంకప్రేమాస్పదుఁడు,

రసికశేఖరుఁడు,

వసంత—(ఆశ్చర్యముతో) ఏమి వింత! ఏమి వింత! ఎంత వివేకి! ఎంత మోహాంధకారమునఁ బడిపోయినాఁడు! వేశ్యల మోహనశక్తి యాశ్చర్యభరితము కదా.

కవి—శృంగారశేఖరులారా, మీ కుపన్యాసము చెప్పఁగను బోధ యన్ని తావులనుండియు వచ్చుచున్నది. మన మింటికిఁ బోయి కర్తవ్య మాలోచించుకొందము. ఆస్తి పోవుచుండ నాటలతోఁ గాలయాపన మొనర్చుట ధర్మము కాదు. శృంగారప్రియులైయితర కార్యాలసులగువారు వ్యవహారపుతొందర గలిగినదాని నివారించుకొనుటకు యత్నింపక యెట్లో నిట్టి క్రీడలతో మనస్సమాధానము చేసికొన యత్నింతురు. అది మహేంత ముష్కరుఁ గారణము. ఇచ్చటి నుండి లేచి రండు. మీ బుద్ధి నంతను గృహవ్యవహారములలో వినియోగించి చిక్కులనుండి తేలుఁడు. అప్పుడు మనస్సునకు నిక్కముగు శాంతి గలుగును.

శృంగా—(తనలో) ఇంటికిఁ బోక తప్పునా? (పైకి) నేనును నట్లే తలంచుచున్నాను. ఈ వ్యసనప్రియత్వమును వదలి గృహవ్యవహారప్రియుఁడ నయ్యెదను. పోవుదము రమ్ము. (అని వసంతకునివైపు చూచుచు లేచుచున్నాఁడు.)

వసం—నేనును వచ్చుచున్నాను. (అని లేచును.)

(అందఱును లేచుచున్నారు.)

(శృంగా[illegible]క కవిగారలీవలకు రాఁగా తెర పడును.)

[illegible]

మొదటి[illegible] రంగము.



రాజవీధి.

[వసంతక, శృంగారశేఖరకవిగారలు వీధి నడచుచు]

కవి—మిత్రమా, శృంగారశేఖరులారా! ఆప్తులెవరో యనాప్తులెవరో తెలిసికొనుటకుఁ దగిన సమయము జీవయాత్రలో నడుమ సంప్రాప్తమగుచుండును. అటు పిమ్మట నైన నాప్తానాప్తవివేకము గలిగి మసలుకొనుట యుచితము.

శృంగా—"బుద్ధిః కర్మానుసారిణీ"

వసం—మెట్ట వేదాంతములు వలదు.

శృంగా—మనము మంగతాయితోఁ గలిసి పీట్లాడుచుండఁగా నొక దివ్యబోధ వచ్చి నా చెవిలోఁ బడినది. అప్పటినుండియు నేను దప్పు చేయుచుండినట్లును, నయ్యది తత్క్షణమే మానుకొన వలసియున్నట్లును నా మనస్సునకుఁ దోఁచినది. కాన వేశ్యాంగనాసాంగత్యము సాధ్యమైనంత త్వరలో మానుకొనఁ బ్రయత్నము

చేయుట కుద్యమించెదను. ఇదిగో, మా యింటికి వచ్చినాము. వసంతకా! తలుపు దీయింపుము.

వసం—అమ్మా! సుశీలా! తలుపు దీయుము.

సుశీల—(లోపలినుండి మృదులస్వరముతో) ఎవరు వారు?

వసం—నేను వసంతకుఁడను. నీ భర్తగారు వచ్చియున్నారు, తలుపు దీయుము.

సుశీల—ఇదిగో, తీయుచున్నాను.

[తెర యెత్తఁబడును.]



పదునేడవ రంగము.

ప్రదర్శనము: శృంగారశేఖరుని చావడి.

కవి—(గృహమును పరికించి చూచి)

ఉ. తిన్నెల చిన్నెలం గనఁగఁ ♦ దేజము మీఱఁగ జీవనాగ సం
పన్నవపీప్రవాహములు ♦ పారెడు నిచ్చట నంచు నెన్నవై
క్రిన్నన నిండువేసవిని ♦ గాలికెడు నేటిని బోలి సూటిగా
నున్నది యీ గృహంబు విభ ♦ వోన్నతి నొందిన జాడలొప్పఁగా. 149

(సుశీల లోపలికేఁ జని యుంగవస్త్రమును చెంబులతో నీళ్ళను దెచ్చి వాకిటఁ బెట్టి వసంతకునిఁ గవిని కాళ్ళు కడుగుకొనుఁడని భర్త పాదములఁ దా స్వయముగఁ గడిగి పైఁట చెంగుతోఁ బాదము లొత్తుచున్నది.)

శృంగా—(తనలో) అబ్బా! ఎంతభక్తిని జూపుచున్నది.

కవి—(సుశీలం గని)

సీ. పరిమళ మబ్బిన ♦ బంగరు ప్రతిమక, శ్యామాంకరహిత మౌ ♦ చంద్రరేఖ
వాడక యుండెడి ♦ ప్రవిమల పుష్పంబు, తఱుచు పగలొప్పని ♦ తారకంబు
చంచలత్వము లేక ♦ మించుచుండెడు మించు, నాకులపాటును ♦ నందనిలత
జడభావ మింతయుఁ ♦ బడయని ఘనమణి, నివురుఁ గప్పని యగ్ని ♦ నిరుపమశిఖ

గీ. ధారుణీవ్యాప్తవరకీర్తి ♦ ధర్మమూర్తి, పూతనిర్మల సుచరిత్ర ♦ పుణ్యగాత్రి
విమలమణిగణ గుణధుర్య ♦ వినుతచర్య, యార్య శృంగారశేఖరా♦హ్వాయునిభార్య.

అహాహా! యీ కులసతి యెంత సౌందర్యము కలిగియున్నది. ఇట్టి భార్యల విడచి పడుపుఁ బడఁతుల వలలఁ దగులుకొనువారు మూర్ఖులు గదా!

ఉ. పూఁత మెఱుంగు పెట్టి కను • మోసము చేయును వేశ్యరూపసం
జాత పవిత్రశోభఁ గుల • చంపకగంధి వెలుంగు నైననున్
శీతవివేకు లీ విషయ • భేద మెఱుంగఁగలేక సాధుహృ
ద్భూతనిజాంగనామణులఁ • బొందక కూడుదు రెడ్డెలంజలన్. 151

ఒకవేళ మంగతాయియు సహజ సౌందర్యయేయనినను,

సీ. పణ్యభామ కనులు • పంకజాతమ్ము లీ, సతికనుల్ శ్రీదేవి • సదనములగు
తొడరు వేశ్య ముఖము • దోషాకరసఖ మీ, కాంతముఖము సుధా • కర సఖంబు
మతి వేశ్య కురులెన్న • మధుపాళి తుల్య మీ, యతివ నునుకురుల్ ఘ • నాళి సఖులు
పడఁపుఁబడఁతి పల్కు • పరభృతాలాప మీ, నాతిది కలకంఠ • నాద మరయ

గీ. పద విభేదంబుచేతను • వస్తు వొకఁడె, ఘనత లోపల భేదంబుఁ • గాంచుచుండుఁ
దరచి చూచిన యుభయుల • తారతమ్య, మెంతో కాన్పించు దానికి•నీమె కిలను.

వసం—కవిగారూ, మీరును మంగతాయి మాయలోఁ బడినారు. ఆమె సహజసౌందర్యవతి గాదు. ఆమెది యంబరకాంతి. దర్శనీయరూపమే లేదు. మహామాయ.

అ. వె. తళుకు బెళుకు రాళ్ళఁ • దగఁ దాలిచి యనర్ఘ, రత్నరాశిఁ ద్రోసి • రాజను గతి
ధర్మశాస్త్రములను • దవ్వులఁ బడవైచి, హాస్య పుస్తకాళి • నరసినట్లు
పూఁత గాంగ జలముఁ • బోనాడి కుల్యలోఁ, గడఁకమీఱ మునుకఁ • లిడిన యట్లు
వాంఛ నుల్లిపాయ • వంటకంబులఁ గొని, రుచిర పాయసంబు • రోసినట్లు
పూఁత దేశవస్త్ర • జాతమ్ము విడనాడి, తనువిదేశిపటముఁ • దాల్చినట్లు
ఆత్మ నాగరకత • నంతయు విడనాడి, పరుల నాగరకతఁ • బడసినట్లు
ధర్మపత్ని విడిచి • ధన్యోస్మి యనుచును, వారనారిఁ జేరు • వసుధ జడుఁడు. 153

సుశీల—(విసనకఱ్ఱతో విసరుచు) నాధా! క్షేమమా? నేఁటికి దీనురాలిపై దయ వచ్చినదా?

శృంగా—ఓసీ, నే నిప్పుడు పెద్దచిక్కున నున్నాను. ఆ యాపత్సముద్రముఁ దాఁటిన గాని నా కేమియుఁ దోఁచదు.

సుశీల—(ఆతురతతో) నాధా, అది యేమి?

శృంగా—మన యిల్లు న్యాయస్థానమువారిచే ఘోషణపూర్వకక్రియను గావింపఁ బడుచున్నది. అది పరులపాలయిన నాపరువంతయుఁ బోవును.

సుశీల—ఏమి సెలవు? ఇప్పుడు నేను చేయవలసిన దేమి?

శృంగా—ఏమియు లేదు. (తనలో) ఇది పైవారున్నారు కదా యని నాపై విశేష ప్రేమఁ జూపుచున్నది. నేనును ప్రేమయున్నట్లు నటించి నగలు లాగెదను. (పైకి)

నీనగలఁ జాలవఱ కిదివఱకే పుచ్చుకొని యున్నాను. మిగిలినవన్నియుఁ బుస్తెలతోఁ గూడ నీయవలెను. పాపము నేను నీ కన్యాయ మొనర్చుచున్నాను. (అని చింతించుచున్నాఁడు.)

సుశీల—నాధా ! నా కన్యాయము జరుగుచున్నదని విచారింప వలదు. మీ కవసరము వచ్చినప్పుడు నా సొమ్ముల మీ కిచ్చుట ధర్మమే కాని, యన్యాయము కాదు మనః పూర్వకముగా నిచ్చెదఁ దీసికొనుఁడు. సందేహ మిసుమంతియు వలదు.

శృంగా—అలంకారములు చేయించుటకు మారుగ నున్నవన్నియుఁ దీసికొన వలసి వచ్చెఁగదా యని విచారించుచున్నాను.

సుశీల—స్త్రీకి నిజమగు నలంకారము పాతివ్రత్యము. అది యనుకూలముగా నుండిన నీ యలంకారములతోఁ బనిలేదు. అన్నియు నిప్పుడే యిచ్చెదఁ దీసికొనుఁడు. (లోనికి జని పసపుకొమ్ము మెడలోఁ గట్టుకొని పుస్తెలసహితముగా నగ లన్నియు సొమునఁ జిఱునగవు మెఱయ నెదుటఁ బెట్టుచున్నది)

కవి—చ. అనఘపథానువర్తనమె ♦ యంఘ్రిపరిష్క్రియ, ధర్మరాశిదౌ
సనికియె కర్ణభూషణము ♦ విశ్రుతవిద్యయె యాస్యమండనం
బనుపమ దానసత్క్రృతులె ♦ హస్తవిభూషలు, దైవకీర్తనల్
గన గళమందునానగలు ♦ కాంతల కిట్టివె మంచిసొమ్ములౌ.

శృంగా—

గీ. పెద్ద లిచ్చిన ధనమును ♦ వీటఁ బుచ్చి, సారిది మాన్యంబు లెల్లను ♦ సున్న చుట్టి
కడకు నాలి స్త్రీ ధనమెల్లఁ♦దడవుచుంటి, గలఁడె నాయట్టివ్యర్థుఁడీ♦ కాశ్యపి నిఁక.

ప్రేయసీ! ఈ వ్యర్థుఁడు నీ కెంతయు మనస్తాపంబుఁ గలిగించుచున్నాఁడు. (అని దుఃఖించుటను నటించుచున్నాఁడు.)

సుశీల—నాధా! ఇటు తలఁపవలదు. ఎట్టివారికైన నిట్టి యవస్థ లొకప్పుడు తటస్థమగును గదా.

సీ. భర్తమూలముగాను ♦ భాగ్యంబు పోఁ జంద్రి, మతి దుఃఖమందెనే ♦ మదినినైన?
పతిమూలమునను సం ♦ పదలెల్లఁ బోవంగ, దమయంతి యెద నింత♦తలఁకెనదిరొకొ ?
ధవుమూలమున సర్వ ♦ ధనభాగ్యములు పోవ, సీతామహాదేవి ♦ చింత గనెనె ?
నాథుఁడు రాజ్య మ♦న్యాయంబుగా నోడ, ద్రౌపది మసలెనే ♦ ధైర్య మెడలి?
గీ. అట్టి సతులకుఁ గల్గిన ♦ యార్తిలోన, నింతయైనను గలిగెనే♦ యిపుడు నాకు
నడవి నిడుమలలోఁగూడఁ ♦ బడరె వారు, వారి నాథులు వ్యర్థులే ♦ ప్రాణనాథ.

ఆ. వె. ఆలి నోడె నొక్కఁ ♦ డమ్మను నొక్కండు
కోలుపోయి యొకఁడు ♦ కుందఁ బొచ్చె
కట్టుబట్ట కొంత ♦ ఖండించి దాల్చె నొ
క్కఁడు వారిచర్య ♦ కలదె మీకు ? 156

వసం—ఆహా! ఈ పుణ్యభూమియందలి పతివ్రతాధర్మ మెంతవర్ణనీయముగా నున్నది. మిత్రమా,

ఆ. వె. నీదు సిరి సపర్య ♦ సెనరును బొందిన, వారనారి నిన్ను ♦ జార విడిచె
కష్టకాలమందు; ♦ కడఁగండ్ల నెవ్వతె, నందఁజేసి తట్టి ♦ యాలె ప్రోచె. 157

కవి—ఆహా! ఈదేశస్త్రీల పాతివ్రత్య మెంత స్తవనీయముగా నున్నది.

సీ. మానవీయామేయ ♦ మహిమాఢ్య వరభక్తి, వినుతపాతివ్రత్య ♦ విమలశక్తి
వర్ణనీయానంత ♦ వరగుణమణియుక్తి, వినుతపాతివ్రత్య ♦ విమలశక్తి
పూజనీయాఖిల ♦ పూతధర్మాసక్తి, వినుతపాతివ్రత్య ♦ విమలశక్తి
స్తవనీయ కమనీయ ♦ సత్యవ్రతనరక్తి, వినుతపాతివ్రత్య ♦ విమలశక్తి
గీ. రుచులు లేనట్టి యింటను ♦ రుచిర భుక్తి, గన నసార సంసారము ♦ నన నను రక్తి
జీవయాత్రకుఁ బిమ్మటఁ ♦ జెలఁగు ముక్తి, పరఁగఁ జేయు పతివ్రతా ♦ భవ్యశక్తి.

ఎన్నఁడైన నీ పుణ్యభూమిని గాపాడవలెనని నీపుణ్యశక్తియే కాపాడవలెను. సంధియ మేల ? కాపాడి తీరును.

వసం, కవి—ప్రియమిత్రమా శృంగారశేఖరా! ఇంత నిట్టి మహాసాధ్వియుఁ బరమ భక్తురాలును సర్వ లక్షణ లక్షితయు నగుభార్యను గుందఁజేసి సత్యసౌందర్య విహీనయు కృత్రిమప్రేమాన్వితయు నగు హేయవేశ్యతో నీవు కాలము పుచ్చుట కడు శోచనీయముగా నున్నది. లోకు లందులకు నిన్ను చాల నిందించుచున్నారు. ఇప్పుడైన నా పాడులంజెను విడనాడి నీ కులకాంతను సంతోషపెట్టుము. అది నీకు సర్వవిధముల శ్రేయస్కర మగును.

శృంగా—(తనలో) కటకటా! నా భార్య యితరు లున్నప్పుడు చూపు కపటభక్తి విశ్వాసముల నమ్మి యిట్టి మిత్రులెల్లరును నన్ను నిందించుచున్నారు. నా భార్య చేయు సాధువేషము నాకుఁ జాల హానిని కలిగించుచున్నది. ఈనగ లిచ్చినందులకై ముందు నన్నుఁ గోసికొని తినును. దీని వలన నా కపయశస్సనంతముగా గలుగనై యున్నది. దీనిని వదల్చుకొనినం గాని నాకు చాల కీడు మూడఁగలదు. (తల పైకెత్తి యాలోచించి) దీనికి రహస్యముగ విషము నిచ్చి స్వర్గమునకుఁ బంపి వైచెదను. నన్నాశ్రయించియున్న స్త్రీలనేకలు గలరు. వారి ద్వారముగా నా భోజనాది

కము గడచిపోవును. అప్పుడు గాని నాకు నిజమైన సుఖ ముండనేరదు. జీవద యాపయని కృపచే లోకములో నాకు విశేషఖ్యాతి కలిగియున్నది. అందుచే నన్ను భార్యను జంపినవానిగ నెవ్వరును దలంపరు. నా భార్య హఠాన్మరణము నొందె ననుకొందురు. భృగువు మున్నగుబుధులే భార్యలను జంపిరి. కాన నవసరమును బట్టి యట్లు చేయవచ్చును. నేడో రేపో యట్లు చేసెదను. నా హృదయము వీరికి దెలియకుండుటకై వీరికడ నిప్పుడు వేశ్యయం దిష్టముపోయినట్లును భార్యయందలి ప్రేమ హెచ్చినట్లును ముచ్చటించెద. (పైకి) వసంతక కవులారా! నా మన స్సిప్పుడు పరిపక్వ మగుచున్నది. వేశ్యాలోలత యతిగర్హ్యమను నిశ్చలభావము స్వానుభవముచేఁ గలుగుచున్నది. కుటుంబమునందు గౌరవాతిశయము గలుగుచు న్నది. నా భార్య యిచ్చిన యీ నగల నమ్మి సొమ్ముచేసి, న్యాయస్థానమునఁ బోసి వారి యాతంకము తప్పించుకొనెదను.

[తెరలో] అయ్యా, ఎవరండోయి లోపల.

శృంగా—(ఆలించి) వసంతకా, ఎవరో తలుపుకడఁ బిలుచుచున్నారు. సంగతి యేమో తెలిసికొని రమ్ము.

వసంత—(లేచి వెళ్ళి ఒక యచ్చుకాగితమును బట్టుకొని, మరలివచ్చి) నేఁడు పురా యుర్వేదవైద్యశాలలో నారోగ్యవారోపన్యాసములు కావింపఁబడునఁట. అందు నకు మిమ్మును మీ మిత్రబృందముతో రమ్మని వైద్యశిఖామణిగా రాహ్వానపత్రిక నంపియున్నా రిదిగో. (అని శృంగారశేఖరుని చేతి కందిచ్చుచున్నాఁడు.)

శృంగా—(చదివి చూచుకొని) మిత్రులారా, మన మచటికి ముఖ్యముగాఁ బోఁదగినది. మీరును వచ్చెదరా?

వసం—తప్పక వచ్చెదము. వేశ్యాలయప్రవేశము చేయువారికి వైద్యాలయ ప్రవేశ మనివార్యమే

కవి—అవును. రెండింటికి సంబంధమున్నది.

గీ. మత్తు మందిడి దేహంబు ♦ మరువఁజేయు, నంగముల ఖండనము చేయు♦నద్భుతముగ
పిసిగి చీము రక్తముఁ గూడఁ♦బిండు వేశ్య, వాటమును వైద్యశాలయు;♦ఫలము వేఱు.

శృంగా—అచట వైద్యశిఖామణి యాయుర్వేదాచార్యపరీక్ష నిచ్చియున్నాఁడు. హూణవైద్యము కూడఁ బాగుగఁ నెఱుఁగును.

వసం—అవును. ఆ వైద్యశాల ప్రసిద్ధి చాల హెచ్చుగనే యున్నది. ఎందును గూర్చి నేటి సభ?

శృంగా—నేడు భోగభామినులు, సుఖరోగములు అను విషయమును గూర్చి యుపన్య సింపఁబడును. మనము వెళ్ళితీరవలెను.

కవి, వసం—మంచిది. (అని అందఱును వెళ్ళుచున్నారు)



[illegible] రంగము.



రాజవీధి.

[కవి వసంతక శృంగారశేఖరుల ప్రవేశము.]

వసం—మిత్రమా, అదిగో, చకోరాక్షీ ప్రియుఁడగు రంగారావు వచ్చుచున్నాఁడు. భార్య గజస్తూల యయినది కార్శ్యము చేసికొననని పట్టుపట్టినాఁడు.

శృంగా—తుదకు కార్శ్యము చేసికొన లేదా ?

వసం—పెద్దలందఱు గట్టిపట్టు పట్టఁగా నంగీకరించినాఁడు. నిన్నటి రాత్రి గర్భాధాన మహోత్సవము జరిగినది.

[రంగారావు ప్రవేశము]

శృంగా—నూత్న గర్భాధానపుఁ బెండ్లికొడుకా ! విశేషములు. మా మనుమరాలను కూలురాలుఁగ వర్తించెనా ?

రంగా—తాతగారూ, మీతోఁ గనుక నా హృదయము వెల్లడించుచున్నాను. ఏమి యనుకూలము. ప్రాఢలగు వేశ్యలతోడి సంబంధము గలరసికులకు నింట నాల్గు గోడలలోఁ గూర్చుండు ముగ్ధభార్యవలన నానందము గలుగునా ?

శృంగా—అదేమి యట్లనుచున్నావు ?

రంగా—ఏమియును లేదు. సరసములా, సల్లాపములా ? ముద్దులా, ముచ్చటలా ? గర్భాధానపుఁ బెండ్లికూఁతునకు సిగ్గఁట. తలవంచుకొని తలుపుమూల నొదిగి నిలువఁబడినది. ప్రౌఢోక్తులు లేవు. కలికిచూపులు లేవు. వేశ్యలతోడి పొత్తుండునా?

శృంగా—ఓహో, శోకపడితివా ముగ్ధ యగు కులకాంతతోడి పొత్తు గనికులకు

గీ. లోన స్నేహ సద్భావముల్ ♦ లోలమగుచు
గ్రాలుచుండియు వానిఁ బ్ర ♦ కాశపఱచు
కళ నవోఢయొ గరిత మా ♦ గ్ధ్యంబుఁ జూపు
వరకవి రచిత ప్రారంభ ♦ కవితఁ బోలె.

గీ. పైకి పలుకుల సౌరెంతో ♦ పరిఢవిల్లు, లోన సద్భావ మింతయుఁ ♦ గానరాదు
కుటిలవేశ్యాంగనల యందుఁ ♦ గుకవిరచిత భాషనుగహిత చిత్రకా♦వ్యమునఁ బోలె.

అది యట్లుండనిమ్ము కృత్రిమ మోహావుల గాఁపు వేశ్యలతోడి సాంగత్య మెక్కడ? సహజప్రేమము గల కులసతీసాంగత్య మెక్కడ. సహజప్రేమ క్రమక్రమాభివృద్ధి నొందు సన్నాహముల నిచ్చును.

గీ. మొదట సహజప్రేమమ్ములో ♦ మొగ్గ, పిదప
మొగ్గ, యీపైన కుసుమంబు ♦ పూప కాయ
ఫలము పిమ్మట నై వృద్ధిఁ ♦ బడయుం వరుసఁ;
జేత నగల నీ చోద్యముల్ ♦ తెలుఁగఁ గలవె? 161

కృత్రిమమోహము గుప్పునఁ బ్రాఁతి ననకుల నుండునటులె నొకసారి వెలిఁగి మాయమగును.

వసం—(తనలో) మా శృంగారశేఖరునకు పరోపదేశపాండిత్యము హెచ్చు. (పైకి)

ఆ. వె అది పోదమినుము ♦ నావల బాధించుఁ, జినుము గోసుటవలెఁ ♦ జెనఁటివేశ్య
అది నొప్పకున్న ♦ నావల సుఖపెట్టు, విద్య నేర్చుటవలెఁ ♦ బెండ్లి మెపుడు. 162

రంగా—చకోరాక్షికి నాయుడుఁగల ప్రేమాతిశయము మీ రెఱుఁగరు. నేఁ డామె నాకు వ్రాసిన యీ మదనలేఖం గనుఁడు, ఆమె నిష్కళంకహృదయము మీరు బోధపడఁగలదు.

శృంగా—ఏదీ చదువుము.

రంగా—ప్రధానాంశములు చదువుచున్నాను. వినుఁడు. (అని యిట్లు చదువును.)

ప్రాణవల్లభా,

నిన్నటిరాత్రి మీ మదనోత్సవ మిందిరానందనుని కృపచే జయప్రదముగా జరిగినదని తలంచెదను. నా దేహ మిట నున్నను మనస్సంతయు నచ్చటనే యున్నది. ప్రాణప్రియా కాదు. కాదు. పూర్వప్రియా, నా యక్కగారు రూపలావణ్యాతిశయములచేతను సరససల్లాపోన్నతిచేతను, నమితక్రీడావినోదములచేతను, మీ మానసమును జూఱఁగొనెనని భావించుచున్నాను. ఏమన నిప్పటివఱకు పగనాయిగఁ ట్లైనను మీ దర్శనభాగ్య మీ దీనురాలి కబ్బలేదు. ధూర్తా, నిన్నటిది మీ కెంతయో ... సైనను ... గాని నాకు శివరాత్రియైనది, కంటు నిద్దుర లేదు. భుజంగభూషణ సేవ తప్ప మఱియొకటి దిక్కు కాలేదు. మీ కులకాంతతోడి పొత్తు మీ కెంతయానందమును గూర్చినను గూర్చుఁగాక. నాథుండు సవతిని గారవించుటయే గాక తన్ను గౌరవించిన నే మానవతి సహింపఁగలిగి యుండునో మనమున నూహింపుకొనుఁడు. నే నీ తీరని విరహము సహింపలేకున్నాను.

గీ. క్రూరుఁడయి మారుఁ డామన ♦ ఘోరనిశిత, కుసుమశరంబుల వేధింపఁ ♦ జొచ్చినాఁడు
నిలువఁజాలదు తను వొక్క ♦ నిముసమైన, నీశ ! నీ వింక దరిశన ♦ మీయకున్న.

అయ్యో, ప్రాణము లింకను నిలుచు ననుకొనుచున్నాను. ఏమి నా దౌర్భాగ్యము. ప్రాణములు నిలుచునను నాశకూడ గలుగుటలేదు. అవి యిదివఱకే యూడియుండును గాని నా మానప్రాణనాథులగు మిమ్ముల నొకసారి యీక్షించుటకై యింకను బొందిలో నూఁగులాడుచున్నవి. క్షణమాత్రదర్శన మిచ్చిన ప్రాణము లూడిపోఁగలవు. అప్పుడు నా సవతితోడి సుఖము మీ కవిచ్ఛిన్నముగాఁ గొనసాగును. నే నిప్పుడు మిమ్ము నడిమాన్యములఁ గోరుటలేదు. ధనధాన్యముల యాచించుటలేదు. ప్రాణావసానసమయమునఁ గర్చ్చలేని కటాక్షలేశ మొకటి కాంక్షించుచున్నాను. అది యొసంగి సుఖావసానము గలిగింపఁ గటాక్షింపుఁడు. ప్రాణములు తమంత తా మూడిపోకున్న నిఁక నొక గంటలోపల మీ దర్శనభాగ్యము నందఁ జాలకుందు నేని నేనే యే నూతిలోనో గోతిలోనో పడి దేహము చాలించెద. నే నీ యవమానము సహింపలేను. నమ్ముడు. నమ్ముడు. నమ్ముడు. నేను మృతినొందిన పిమ్మట,

ఉ. నా దగు మేనుచెప్పులయి ♦ నవ్యసుఖంబుల మీకు నిచ్చుతన్
మీఁదను గల్గు జన్మముల ♦ మీరలె నా ప్రియు లౌట గల్గుతన్
నా దగు సేవ మీ యెడ న ♦ నారతము న్వెలుగొందు గావుతన్
మోద మెలర్ప నీశ్వరుఁడు ♦ బ్రోచెడు గావుత మిమ్ము నెప్పుడున్.

ఇట్లు విన్నవించు,
ప్రాణప్రియ. కాదు- కాదు-
ప్రస్తుతా ప్రియురాలు,
చకోరాక్షి.

ఇట్లు వ్రాసినది. పాపము వెఱ్ఱిముండ నా మూలమున నెచ్చటఁ జచ్చిపోవునో యని యచటికిఁ బోవుచున్నాను.

(శృంగారశేఖరుఁడు పకపక నవ్వును)

వసం—(వీపుమీఁదఁ జేయివైచి చఱచి) నీవు వెళ్ళునప్పటికే మృతినొందిన నేమి చేయుదువు ?

రంగా—ఏమి చేయఁగలను? శవముపైఁ బడి యింత నేడ్తును.

వసం—సహగమనము చేయవా ?

రంగా—ఊఁ- నీ వేళాకోళముల కేమి? నీకు నిక్కమైన ప్రేమ యన నేమో తెలియదు.

వసం—(నవ్వుచు) వెఱ్ఱివాఁడా నీకు నీ భార్యపై ప్రేమ హెచ్చకుండఁజేసి నిన్ను

స్వవశము చేసికొనుటకై వ్రాసిన మోసపులేఖ యిది. ఇట్టి టక్కరివ్రాఁతలను నమ్మకుము. నీవు చచ్చినను నది చావదు. 'కావేరిగొట్టము తేవే' యనును.

శృంగా—(రంగారావు నుద్దేశించి) ఓయీ, అనుకూలముగా సంసారము చేసికొనుము. పొమ్ము. (రంగారావు నవ్వుచు పరువిడుచున్నాఁడు.)

వసం—(పశ్చిమ దిశనుజూచి)

గీ. ఘనపథంబునఁ జనువార • లనవరతము, భయదజలరాశిఁ బడిపోవు • పట్టిదియని
తెలుపఁ గట్టిన యొత్తివి • దీప మనఁగ, వరుణరవిబింబ ముదయ న • స్తాద్రికడను.

కవి—

గీ. ఘనపథంబున వేఁ బోవు • కాలపురుషు, ధూమశకటంబు వెనుకను • తొడరునట్టి
యొత్తిదీపం బనంగను • నెసక మెసఁగు, వరుణరవిబింబ మల్లదె • యస్తగిరిని. 164

శృంగా—

> గీ. చండకరఘాటిఁ జూపింప • చండధాముఁ
> డస్తమించెడు సమయంబు • లడరు కతన
> స్వేచ్ఛ లాడఁగూర్చుచుండెడు • స్త్రీయరాజు,
> వచ్చునని కువలయ మెంతో • వఱలఁ జొచ్చె. 165

వసం—ఉపన్యాసవేళ యగుచున్నది. త్వరగఁ బోవుదము. (వసంతక శృంగారశేఖరులును గవియును వైద్యశాల వైపునకుఁ బోవుచున్నారు.)



పందొమ్మిదవ రంగము.



వైద్యశాలా ప్రదర్శనము.

[వసంతక శృంగారశేఖర కవిగారల ప్రవేశము.]

వసం—మిత్రమా! ఇటు. ఇటు. వైద్యశాలకు వచ్చినాము. వైద్యాచార్యుఁ డెవరి కొఱకో యెదురు చూచుచున్నట్లున్నది. సభ్యులు పలువురు వచ్చిరి. (పరికించి చూచి) వేశ్యలుకూడ కొందఱు వచ్చిరి. అదిగో తాయియు నందుఁగలదు.

శృంగా—వేశ్యలంగూర్చిన విషయము గాన వారుంద్రువచ్చిరి. లోనికిఁ బోవుదము రమ్ము. (లోనికిఁ జని) మిత్రవర్యులారా, వైద్యాచార్యా!

వైద్యాచార్యుఁడు—(ముందుకు చూచి) ఓహో! శృంగారశేఖరరాయలా? మీరాకకై యెదురు చూచుచున్నాము. ఇఁక సభ ప్రారంభింతమా?

శృంగా—మంచిది. అట్లే యగుగాక.

వైద్యా—శృంగారశేఖరులారా! మీరు సభాధ్యక్షతను వహింపుఁడు.

శృంగార—ఇది మీయట్టి వైద్యశిరోమణులు సభాధ్యక్షతను వహించి ఉపక్రమోప సంహారోపన్యాసములచే కొనసాగింపవలసిన తరుణము. కావున మీరే యట్లు గావింపుఁడు.

సభవారు—శృంగారశేఖరులు చెప్పిన దానిని మేము బలపరచుచున్నాము.

వైద్యా—సభవారి సెలవుప్రకారము చేసెదను. (అని అధ్యక్షుని ఆసనముకడకుఁ బోయి నిలచి) సభాస్తారులారా! భోగభామిను లారోగ్యఫలశాఖికం జంపు వేరు పురుగులై యున్నారు. వారి కెవరియందును వలపుండదు. వారు వెలయాండ్రు. సొమ్మిచ్చువారికే దేహ మర్పింతురు. ఎట్టినీచుని నైనఁ గూడుదురు వివేకులైన వారు వేశ్యను గూడఁదగినది కాదు.

"శ్లో. కళ్ళుంబతి కులపురుషో ! వేశ్యాధర పల్లవం మనోజ్ఞమపి
చార భట చోర చేటక విట నట నిష్ఠీవ శరావం."

అని లోకజ్ఞుఁడగు భర్తృహరి చెప్పియున్నాఁడు. ఆ భోగకామినులు చూపు మాయామోహమునకు లోనై యవివేకులై లోకులు ధనప్రాణములఁ బోఁగొట్టుకొని నశించుచుందురు.

శ్లో. వేశ్యాఽసౌ మదన జ్వాలా రూపేంధన వివర్ధితా
కామిభి ర్యత్ర హూయంతే యౌవనాని ధనానిచ.

అని భర్తృహరి చెప్పియున్నాఁడు. ఈ భోగభామినులఁ గూడుటచే దారుణములైన సుఖవ్యాధులు కలిగి దేహమును జెడఁగొట్టి పిన్నవారల సంతతునంతికమున కంపును. సుఖము నిమిత్తముగాఁ గల రోగము లగుటచే వీనికి సుఖరోగములని పేరు వచ్చినది. ఈ సుఖరోగములు గ్రంధియని ప్రూతిమేహ మని ఉపదంశ మని మూడువిధములు. వీనిలో మిక్కిలి ఘోరమయినది ఉపదంశము. దీనికే ఫరంగిరోగ మని పేరు. ఇది ఫరంగివారి దేశమునుండి వచ్చిన విత్తన మగుటచే దీనికీ పేరు వచ్చినది. ఈ రోగము ప్రాచీనములగు సుశ్రుతము, వాగ్భటము మున్నగు వైద్య గ్రంథములయందుఁ జేర్పఁబడి యుండ లేదు. అప్పటికీ రోగము మనదేశమున లేదు. భావప్రకాశకారాదులనాటి కిది యీ దేశమున వ్యాపించినది. ఇది సాంక్రామిక రోగము. దీనింగూర్చి వా రిట్లు వ్రాసిరి.

శ్లో. ఫిరంగి నోఽంగ సంసర్గాత్ ఫిరంగిణ్యాః ప్రసంగతః
వ్యాధిరాగంతుజో హ్యేష దోషాణా మత్ర సంక్రమః.

ఈ రోగము సంభోగము వలననే కాక రోగుల స్పృశించుట వలనఁ గూడఁ గలుగును. వేశ్యాసంపర్కము విత్తభంగ మొనరించును. చిత్తశుద్ధి చెఱచును. పాపపంకమునఁ ద్రోయును. ఇతర పాపము లొనర్చు వారు తామె చెడుదురు కాని యీ పాప మొనర్చు వారన్నో తాము సుఖరోగముల పాలయి చెడుటయే కాక తమ సంతానముం గూడఁ జెఱతురు. ప్రజలు భోగభామినుల యెడ విముఖులై లోక సౌఖ్యము లనుభవించుటకై దేవుఁడిచ్చిన యారోగ్యమును గాపాడుకొని సుఖింతురు గాక!

మ. మతమా పాడగు, శీలమా తొలఁగు, ధ ♦ ర్మంబా చెడున్, బంధుస
మ్మతమా యుండదు, పాపమా పెరుగుఁ గ ♦ ర్మంబాకడున్ క్షీణమౌ
హితమా శూన్యతఁ గాంచెడున్, సుగుణసా ♦ హిత్యంబ మాయంబగున్
వ్రతమా పాడఱు, భాగ్యమా యణఁగిపోఁ ♦ బణ్యాంగనా సంగతిన్.

నేను వైద్యుఁడను గాని వక్తను గాను. కాన నాకుఁ దోఁచినది ముచ్చటించితిని. లోకానుభవము గల వక్తలీవిషయమై చక్కఁగా ముచ్చటింతురు గాక!

శృంగా—నా యూహల లోక హితార్థమై విన్నవించుచున్నాను. ఓజనులారా! వినుఁడు!

ఉ. మానము పోవు, సంపదలు ♦ మాయమగున్, గులమేగు, సౌఖ్యముల్
కానఁగరావు, పెక్కులగు ♦ కష్టపరంపర లాక్రమించు, స
న్మానము పూజ్యమౌను, నవ ♦ మానము వాటిలు, రోగజాలముల్
పూని పయింబడున్ గణిక ♦ పొందును నందినవారి కిద్ధరన్. 167

కాఁబట్టి బాగుపడఁ గోరువారు నన్ను విని దుస్సంగ దూరులగుటయు సర్వవిధములఁ బాటుపడ వలెను.

(సభ్యులు ఒకరి నొకరు చూచుకొని నవ్వుకొనుచున్నారు.)

కవి—ఓజనులారా! నేఁజెప్పున దాలకింపుఁడు.

చ. కులము నశించు, భంగము ల ♦ కుఁతితమై వహియించు, వ్యాధిసం
కులమయి దేహమేదు, సుమ ♦ కోమల శీలము మాసిపోవు, వ్యా
కులమయి బుద్ధి పాడగును, ♦ గూలు గృహంబును, పణ్య భామినీ
కులమునఁ జేరి దాని నొగి ♦ కూడిన మాత్రన పాప మెక్కుడౌ. 168

పిగ్గ—యూ మై పీపుల్! హియర్ మి—నన్ను వినండి.

పద్యము.

వేశ్యలందు కలుగు మోజు
వేడ్క సేయ నౌ డిసీజు
పొందు వలనఁ బుట్టు పుండు
మందు సేయ మానకుండు
దేహ మెల్ల నౌను పుల్ల
గేహ మెల్ల నౌను గుల్ల
కీర్తి యంత మాసి పోవు
నార్తి హెచ్చ వచ్చుఁ జావు
ఏమి లాభ మనుచు నీవు
భూమి గణిక పొందుతావు
వలదు వలదు వలదు సూ
దాని గూడ జనదు సూ. 169

వసం—నేను కూడ వాడుకను బట్టి కొన్ని పలుకులు పలికెదను. వాడుకను బట్టి యననేల యందురా, యీ ధర్మోపన్యాసములఁ జెవులఁ బెట్టువా రెవరుందురు? వినినను గ్రియలోఁ బెట్టువా రెవరుందురు? లోకములో వేశ్యా సంపర్కము వలన మూడు కీడును బాడెడు గ్రంథములు లేకయా, లోకులు వేశ్యా ప్రియులగు చున్నారు? కాదు. కాదు. లోకములో వేశ్యా ప్రియత్వమువలనఁ గలుగు పెక్కులగు చిక్కుల నన్నింటిని నొక్కి వక్కాణించు గ్రంథరాజములు లెక్కకు మిక్కిలిగఁ గలవు. అనుభవ రసికులు వ్రాసిన నాటకము లెన్ని, నవల లెన్ని, కావ్యము లెన్ని, యుపన్యాసము లెన్ని. ఎన్న వేనవేలుగలవు. కాని వీని నన్నిటిని బాగుగఁ జదివియుండిన వివేకులగు పండితవరులే మాయాంధకారమున నిమగ్నులయి వేశ్యాలోలురయి పొడగుచున్నారు. తక్కిన వారి లెక్క యేమి? శాస్త్రములు వేశ్యాసంభోగమును శునకగార్దభాది సంయోగములతోఁ దుల్యముగఁ జెప్పుచున్నవి. ఇంక వేశ్యాప్రియత్వమునం దెంతరసికత్వ ముండునో లోకము గ్రహించుకొనుఁ గాక! వేశ్యలకు దాస్యము చేయుటతోఁ గాలముఁ గడపిన దుర్విటులు వేశ్యాప్రియత్వము వలదని బోధించిన నది లోకమునకు హాస్యాస్పదముగఁ గానిపించును గాని ధర్మబోధకముగఁ గానిపింపదు. అయినను వారి బోధలకు విలువ నీయకున్నను లోకులు వారు పొందు దురవస్థలఁ గ్రహించుకొని వారి వలె దుర్వ్య

వర్తనము పాలు గాక బాగు పడుదురు గాక! శాస్త్రబోధలాలించి ధర్మముఁ బాలింతురు గాక!

శా. ధర్మం బంతయు మాసిపోవును గదా ♦ దైన్యంబు వాటిల్లు గా
కర్మం బెల్లను పాయమాను గదవే ♦ కష్టాళి బాధింపదే
మర్మం బింతయు నిల్వఁ జాలదు గదా ♦ మానంబు తూలుంగదా
చర్మం బంతయుఁ దూట్లు నందు గదవే ♦ సాగింప వేశ్యారతిన్ 170

వైద్యాచార్యు—లోకజ్ఞులగు పండితు లిప్పుడు ముచ్చటించిన దానింబట్టి వేశ్యలందు నిక్కముగు మోహ ముండదనియు వాండ్రు మోసకత్తెలనియు, సుఖమునకు మారుగ దుఃఖమును తెచ్చి పెట్టుదురనియుఁ దేలుచున్నది. ఆరోగ్యమునకు ముఖ్యముగ హాని కలిగించుచున్నవారు వేశ్యలే. ఇట్టివారి వలలో యువకు లెందులకు బడుదురో తెలియవచ్చుట లేదు. వారియందు రూపవిశేషమైన నుండదు. ఎవతెయైన నొక్కతె రూపవతి యున్నను రోగముల మూలముగ నది చెడును. అయినను గణికలు తెచ్చిపెట్టుకొనిన పూఁత మెఱుంగులచే సౌందర్యవతులైనట్లునటించి యువకుల మోసగింతురు. వారి నిజరూపములు మీకు బోధపడుటకై యీ పురియందు యువకుల మోహాబ్ధిలో ముంచుచున్న యావారముఖ్యయొక్క నిజరూప పటమును మీ కిప్పుడు చూపుచున్నాను. ఆమె సామాన్య వేషములో నుండుతతి విటుఁడొక్కఁడు రహస్యముగఁ దీసిన ప్రతిబింబ పటమిది. ఆమె నిజరూపముం గని సత్యమును తెలిసికొనుడు. (అని పటమును జూపుచున్నాఁడు.)

(సభ్యు లాశ్చర్యముతో జూచి,) ఎవతె యిది? (పరికించి) మం-గ-తా-యి, మం-గ-తా-యి.

ప్రథముఁడు—(ముఖము నీక్షించి)

సీ. మోము తామర యంచు♦ మొదటను నెంచితి, మోము తామరపొల్పుఁ♦బోడి సడలఁగ

ద్వితీయుఁడు—(కనులఁ దిలకించి)

ఆ వాలుకను లంద ♦ మనుకొంటి కాటుక, కడుఁగంగ నావాలు ♦ కన్నులివిగో

తృతీయుఁడు—(నడుము పరికించి)

తనుమధ్యయనుచును ♦ తలఁచుచునుంటిని, కనఁగ నతను మధ్య ♦ కాంచి విడువ

చతుర్థుఁడు—(తనువు పరిశీలించి)

కాంతఁ గాంచనయష్టి ♦ గా నెంచఁదుద కాయె, గాంచనయష్టి న ♦ గలనువిడిచి

పంచముఁడు—(తను వెల్లఁ గలయఁ జూచి)

గీ. కొమ్మలం దొప్పు గోతిగా•నమ్మి నిపుడు, కొమ్మలందునఁ గోఁతియై•గోలయుండె
వేష విభవంబు లన్నియు • విడిచి యుంటఁ, గలికి చేసెను మోసంబు•తెలిసివచ్చె

వైద్యా—బరన్ అను నాంగ్లేయజ్ఞాని చెప్పినట్లు నృత్త వేషాదులు కురూపములఁ గప్పిపుచ్చి, లేని సౌందర్యముం గూర్చి, ద్రిష్టల మోహాబ్ధిలో ముంచును.

వసంతకుఁడు—అదిగో మంగతాయి వచ్చుచున్నది. ఏమైన ముచ్చటించునేమో ?

మంగ—(ముందుకు వచ్చి) సభాధ్యక్షులారా! మీ యనుమతిఁగొని కొన్ని వాక్యములు ముచ్చటింపఁ బోవుచున్నాను.

సభాధ్యక్షుడు—ముచ్చటింపవచ్చును.

మంగ—ఆర్యులారా, సహజసౌందర్యము పురుషజాతిది గాని స్త్రీజాతిది గాదు. స్త్రీల సౌందర్య మెప్పుడును పురుష మోహారోపితమే. వేశ్య ప్రకృతి స్వరూపయని మీ రెఱుంగరా ? ప్రకృతి మాయా స్వరూపము గలది. ఆమె యీశ్వరసాన్నిధ్యముచే ననంత వేషములతోఁ జెన్నారి లోకానందముఁ గూర్చును. అట్లే ప్రకృతియైన వేశ్యయును నిజముచే నే వైభవము లేనిదయియును నీశ్వరులగు విటుల సాన్నిధ్యముచే బహువేషముల నలరారి లోకమును రంజింపఁజేయును. మా సొమ్ములును, కాటుకలును, కాంచీబంధములును, కనకములును మాకీశులైన మీ సాన్నిధ్యముచేతనే గలిగినవి. మీ కటాక్షము లేకున్న మేము లేము. ఏమియు లేని మాయందు మీరు వివిధరూపములఁ గల్పించుకొని యానందించుచు నా ప్రకృతి మిమ్ము మోసము చేసినదనుట ధర్మమా ? మీరు బాగుపడఁ దలఁచిన యెడల బహుమాయా స్వరూప యగు ప్రకృతిని జయించి జగత్తత్త్వమును దెలిసికొని శాశ్వత ముక్తికాంత నంది యానందింపుఁడు. (అని తన పూర్వస్థానమునకుఁ బోవుచున్నది.)

వైద్యా—సభ్యులారా, మంగతాయి మీకుఁ జక్కఁగ నిక్కమగు సత్యమును వెల్లడించియున్నది. మూలేరుతార అనినట్లు దుఃఖమున కంతకును మూల మేదో దానిని దెలిసికొని సంస్కరించిన యెడల సచ్చిదానందముల నందవచ్చును. మనము వేశ్య యనుకొను స్త్రీ మాత్రమే లోకమునకు హాని చేయు వేశ్య యనుకొనఁ దగదు. నీచమగు భవ సుఖమునకై నీచవృత్తులఁ బూని లోకము వంచించు వారెల్లరును వేశ్యావృత్తి కలవారె. పొట్టకై యొడ లమ్ముకొని పరుల దాస్యము చేయు వేశ్యావృత్తి నశించినఁ గాని దేశము బాగుపడదు. నిజమగు వేశ్య న్యాయముచే నానందదాయకములగు నృత్తగీతములచే జీవింపవలసినది గాని హేయమగు పడపు

వృత్తి చే లోకమును వంచింప వలసినది కాదు. నృత్త గాన కళలచే జీవించునది నింద్యకాదు.

ఉ. పాయక పల్లవరా దొరల ♦ పాదము లంటుచును జీవనార్థమై
స్వీయ ఘనాత్మగౌరవము ♦ చేటువహింపఁగ నిష్కృ సిద్ధికై
కాయము నమ్మికొంచు బహు ♦ కష్టము లోర్చుచు మాతృ భూమి క
న్యాయపు మచ్చఁదెచ్చు జను ♦ లాగయ నిందిత వేశ్యలేకదా ! 172

ఇట్టివారి నీచవృత్తులు తప్పక సంస్కరింపఁబడినఁ గాని దేశ మభివృద్ధి లోనికి రాదు. ఇఁక విటులఁ గూర్చి వినుఁడు.

ఉ. స్వీయ ధనాభివృద్ధికిని ♦ శ్రేయము గూర్పఁగఁ జాలి యుండు నా
స్వీయు లనాదరార్తిఁ బడఁ ♦ జేయుచు భూజన విత్త సంగ్రహా
పాయముఁబన్ను జాణలగు ♦ వారల మోసపు వేషభాషలన్
మాయపు మోహ చేష్టలను ♦ మర్మములం దిలకించి వీరలే
మా యనుకూలురంచు మతి ♦ మందత నెంచెను వారె కా విటుల్. 173

ఇట్టి వారను సంస్కార మందకుండిన దేశము బాగుపడదు.

ఉ. ఈశుఁని కూర్మిచేఁ బఠపుటింపుల ♦ వృత్తి విశుద్ధి నొందుతన్
దేశము స్వేచ్ఛమీఱ ఘన ♦ తేజ మునంది వెలుంగుఁ గావుతన్
క్లేశము లగ్నపూర్ణత న ♦ కుంఠిత రీతి నెసంగుఁ గావుతన్
పాశ వినాశ మొంది భవ ♦ బంధవిముక్తిని జీవు లందుతన్. 174

క. నీతిమతాచారంబులు, ఖ్యాతస్థితిఁ దెచ్చి ప్రజలు ♦ పురుషార్థములన్
భూతలమునఁ బడయుంగను, భూతేశుఁ డనుగ్రహించి ♦ ప్రోచుత సతమున్.

నేఁ డారోగ్యవారము గావున మీతో నింత సేపు ముచ్చటించితిని. మన పాపము లెల్ల నశించి మనము బాగుపడుటకై వేదవేద్యుఁడగు పరాత్పరుని స్తుతింతము గాక !

(అందఱును మంగళము పాడుదురు.)

సభ్యులు—సభాధ్యక్షాదులకు వందనములు.

సభాధ్యక్షుఁడు—నేఁటి కార్యము ముగిసినది. (అని అందఱు వెళ్ళిపోవుచున్నారు.)

ఓం తత్సత్.